# "కాంప్లాన్® మాత్రమే మా కుటుంబానికి సరియైనది–సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం."



''మా శ్రీవారు పనిలో మునిగి పంటా
రెప్పుడూ—తరచు భోజనం ఎగ్గొడుతూ
ఉంటారు. ఆయనకు అందని ఆ పోషణని
యిస్తుంది కాంప్లాన్."



''మా అబ్బాయి అన్నం సరిగ్గా తినడు,
మారాం చేస్తాడు. వాడి పెరుగుదలకు కావలసిన
ప్రొటీన్లూ, యితర ఆహార పదార్థాలూ
కాంప్లాన్‌తో తప్పకుండా అందుతాయి''



"మా అమ్మ యిప్పుడే జబ్బుపడి లేచింది.
ఆకలి లేదు. కోలుకునే యీ సమయంలో,
కాంప్లాన్ ఆదర్శమైన తీరులో
పుష్టినిస్తుందనిపిస్తోంది."

## కేవలం కాంప్లాన్® లోనే అందరికీ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి.



"ఇంట్లో పని చేసిచేసి
అలసిపోతాన్నేను.
మరింత పోషణ
అవసరమనిపిస్తుంది
ఒక్కొక్కప్పుడు.
మరి కాంప్లాన్, నేను మా
కుటుంబానికి
యివ్వగలిగినంత
యిచ్చేలా
చేస్తుందనిపిస్తుంది."

కేవలం కాంప్లాన్‌లోనే శాస్త్రీయంగా రూపొందించిన పాళ్ళలో, మన శరీరానికి ప్రతిరోజూ అవసరమయ్యే 23 కీలక ఆహార పదార్థాలున్నాయి...ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. డాక్టర్లు ఎక్కువగా సిఫార్సు చేసే ఆరోగ్యబద్ధమైన పానీయం.

రుచికరమైన చాక్లెట్, ఏలక్కాయ–కుంకుమపువ్వు, స్ట్రాబెరీ సువాసనలలో దొరుకుతుంది—ప్లెయిన్ (సాదాగా) కూడా.




# కాంప్లాన్®

## —సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం.

GLC-10-2316 TL

'న్ని సందర్భాలకు అనువెన చీరలు:
పెళ్ళిళ్ళకు, పార్టీలకు, పిక్నిక్ లకు,
పుట్టం రోజులకు—
విమల్ చీరలు.
నేడే విచ్చేసి సంపూర్ణ శ్రేణిని చూడండి




# మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం




## సజీవ చిత్ర రూపకల్పన

"తరానా" ముఖచిత్రం రసజ్ఞ మనోజ్ఞము. సదరు చిత్రం రామరాజభూషణుని (భట్టుమూర్తి) కావ్యాలంకార సంగ్రహాంతర్గత కావ్య ప్రకరణము నందలి కైశికీ వృత్తి లక్ష్యపద్యమైన—

ఉ. తిన్నని మేను గన్నుగవ తేటలు దేనియలొల్కు
మాటలున్
సన్నపు గౌను గుందనపు జాయలు దేరు
మెరుంగు జెక్కులుం
గ్రొన్నెల వంటి నెన్నుదురు గుబ్బచనుంగవ
తళ్కు జూపులున్
జెన్నెసలార గన్య నరసింహుని జూచె విలాస
ధన్యయై.

(కావ్యా —ద్వితీయ—75ప.)

అను పద్యమునకు సజీవ చిత్ర రూప కల్పనయా? అను నట్లున్నది. జగ్‌మోహన్ గారికి నా ధన్యవాదాలు.

చామర్తి శ్రీనివాస గోపాలరావు — భాషాప్రవీణ.
(చింతలూరు)

## శృంగారం చిందులు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక నటి రాజీ ముఖచిత్రంలో శృంగారం చిందులు వేసింది.

వై. చంద్రశేఖర రెడ్డి (నగరి)

## ఎబ్బెట్టు

23—7—82 తేది పత్రిక ముఖచిత్రం నటి రాజీ కాస్త ఎబ్బెట్టుగా ఉంది. సైడ్‌పోజు కన్నా, డైరెక్టుపోజుగా ఉంటే బాగుండేది.

ఎస్. అన్‌సర్ హుస్సేన్ (గిరింపేట)

## మధురం

భమిడి శకుంతులగారు రచించిన "తెరవెనుక" కథ మధురముగా ఉన్నది.

ఏ. వి. వి. యస్. యస్. వి. ప్రసాదు
(గాజువాక)

## సబబా?

"సంధియుగం" కథలో కృష్ణశర్మ పోన్‌లో శాస్త్రితో తన తండ్రి తద్దినం చేయించమని అడగగానే, ఏదో వూహించుకొని అకస్మాత్తుగా చనిపోవడం సబబా?

కె. ప్రహ్లాద్ కుమార్ స్వాపిక, (కదిరి)

## చక్కటి తీర్పు

కామంతో కళ్ళు మూసుకుపోయిన ప్రియతమరావు లాంటి వాళ్ళకు ప్రకాశ్ చక్కటి తీర్పు చెప్పాడు. నేటికథ— రేపటి ముగింపులో. ఈ వారంలోనే ప్రచురించిన వేరొక కథ "రామపాదం" తన వంశంలోని వారికి అన్యాయం జరిగిందని తెలిసి కూడ త్యాగంచేసిన మహామనిషి రామపాదం. ఇంకా "సంధియుగం, గిల్టీ" అన్నీ అపురూపమైన కథలే. పత్రిక ఈ వారం చాల గొప్పగా ఉంది.

ఎస్. ఇందుమతి (హైదరాబాదు)

## చాలా బాగుంది

"నేటి కథ రేపటి ముగింపు" కథ చాలా బాగుంది.

శింగరాజు శ్రీహరిరావు, గంగాభవాని (కనిగిరి)

## చాలా బాగుంది

"జేబుదొంగ" కథ చాలా బాగుంది.

యల్. రమేశ్ (యెర్రా పహాడ్)



## సందేహం

నేటి సత్యకళ (9—7—82) ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో బులుసు వేంకట రమణయ్య "ధర్మపథం" శీర్షిక చదివాక నా సందేహాన్ని ఈ క్రింది వ్రాస్తూవున్నాను.

ధర్మపథంలో దరిద్రుని భార్య ఇల్లువూడ్చేటప్పుడు ఆమెకు ఒక పాత్ర కనిపిస్తుంది. అదేమిటని భర్తను అడుగగా "రేపటికోసం దాచి యుంచిన రొట్టె ముక్కలు" అని సమాధాన మిస్తాడు. అంతట ఆతని భార్య " అకలి కల్గించిన అల్లాయే రొట్టెను కూడా యివ్వడా? నీకు భగవంతునిపై విశ్వాసంలేద"ని అంటుంది.

ఇటీవల జరిగిన సంఘటన నేనందిస్తున్నాను. వో ట్రాన్స్‌పోర్టు కంపెనీలో ఒక ముస్లిము డ్రయివరుగా పని చేస్తున్నాడు. అతని నివాసము "గ్వాలియర్" అట. ఒక రోజు అతడు మధ్యాహ్నము భోజనం ముగించి కొన్నిరొట్టె ముక్కలు అపురూపంగా దాచుకోవడం నేను గమనించి అందుకు కారణం అడిగాను. అతడు రాత్రి కోసం దాచుకుంటున్నాను అని అన్నాడు. "ధర్మపథం" లో దరిద్రుని భార్య అన్నట్లుగా నేను అతనితో అన్నాను. అందుకు అతడు "కథలూ— కావ్యాలూ" వేరు. ఇది నిత్య జీవితం. మనం కష్టపడితేకాని కడుపు నిండదు. అలా అని భగవంతుడ్ని దూషించకూడదు. ప్రతి పని చేసేటప్పుడు దైవాన్ని భక్తి విశ్వాసాలతో ప్రార్థించుట మానవుని విద్యుక్త ధర్మం. నేడు నాకోసం, నన్నాశ్రయించిన నా భార్యా పిల్లల కోసం, ఇల్లూ పొల్లూ విడిచి నేను యింతదూరం వచ్చి శ్రమిస్తున్నానంటే జానెడి పొట్టకోసం. అంతా భగవంతునిపై బరువు మోపి "అల్లా" అనికూర్చుంటే ఆకలితో చచ్చిపోమూ? ఒకవేళ భగవంతుడే రొట్టెముక్క యిచ్చే పక్షంలోవుంటే నేనింతదూరం ఎందుకు రావాలి?" అని ఎదురు ప్రశ్నవేసాడు.

నేను ఆస్తికుడిని. నాస్తికవాదాన్ని బలపరుస్తున్నానని పొరపాటు పడకండి. మన ప్రయత్నమేదో మనంచేసి ఫలితాన్ని అనుభవించాలి కాని, అంతా భగవంతునిపై భారమేసి కూర్చుంటే ఆత్మారాము ఊరుకునేదెలా? అందునా ఇది కలియుగం. నాకు భగవంతునిపై నిత్యము విశ్వాసముంది. మానవుణ్ణి కాబట్టి ఈ జీవన పోరాటంలో నా ప్రయత్నమేదో నేను సాగించకపోతే . . . భగవంతుడు వూనుకుంటాడా?

సూరాడ నారాయణరావు (యస్. ఇ. రైల్వే హిప్‌గిర్, ఒరిస్సా)

## ఆకట్టుకున్నది

"విలువలు" అనే కథ మమ్మలను ఎంతో ఆకట్టుకున్నది. "మనసు కథ" సీరియల్‌కూడ బాగున్నది.

సి. హెచ్. వెంకట్ (అబూధాబీ, యు. ఏ. ఇ.)

(74వ పేజీ చూడండి)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 - 1972]
శుక్రవారం : 13-8-'82
దుందుభినామ సం. శ్రావణ బ. నవమి
సంపుటము 75 సంచిక 49
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు 85-80
ఆరు మాసాల చందా రు 42-90
విడి ప్రతి వెల రు 1-50
ఆంధ్ర పత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



ముఖచిత్రం : శ్రీదేవి

(ఫొటో : ఆర్. ...)

కథలు :



సీరియల్ నవలలు :



వ్యాసాలు, శీర్షికలు :



## లోకంపోకడ — ఊమెన్

'పదవీ విరమణ అనంతరం రాష్ట్రపతి....
(ఓ.ఎస్.పి)
లోక్‌దళ్
జనతా
బి.జె.పి
మీకు అసంతృప్తిగా ఉందా...? అయితే మంచిదే...! అది అభివృద్ధికి నిదర్శనం....
పి.ఎల్.ఓ.కి మా సానుభూతి ఉంది. కానీ వారిని లోనికి అనుమతించం.......
అరబ్ దేశాలు
ఇజ్రాయెల్
అరబ్బులకి ఏకాభిప్రాయం లేదు. అదే మాకు మంచిది...
మీకు క్లస్టర్ బాంబులు ఇవ్వను...
ఇజ్రాయెల్
... కానీ అంతకంటే శక్తివంతమైన ఆయుధాలని ఇస్తాను...




చిక్కగా రాకాసి జడలా వుంది చీకటి.

జనతా ఎక్స్‌ప్రెస్ చీకటి ప్రకృతిని చీల్చుకుంటూ, గురిపెట్టి వదిలిన తుపాకీ గుండులా, పరుగెత్తుతోంది. దీపాలను కడుపులో దాచుకొని పరుగుదీసే పాములా వుందది. మధ్య మధ్యన రైలు ఇంజన్ గర్జన —పాము బుసలా ...

రైల్లో కూర్చున్న రామనాధం మేష్టారుగారి మెదడ్లో ఆలోచనలు — రైలు కంటె వేగంగా పరుగెడుతున్నాయి. అతని మొగంలో బాధ... అతని చూపుల్లో బాధ... అతని కడుపులో బాధ... అంతేగాదు అతని చుట్టూ వున్న పరిసరాల్లో బాధతో కూడిన వాతావరణం ఫక్కున నవ్వసాగింది.

ఒక్కగానొక్క కొడుకు—చేతి కందిన వాడు—చెయి జారి పోయినప్పుడు, అతనిపై ఆశలు పెంచుకొన్న తండ్రి హృదయంలో చెలరేగే ఆవేదనకు ప్రతిరూపంగా వున్నాడాయన. సప్తసముద్రాలూ అతని కళ్లలో విచ్చి వర్షింప బడటానికి సిద్ధంగా వున్నాయి.

మండే సూర్యగోళం అతడి నుదిటిపై ఎర్రగా నవ్వుతోంది. ప్రచండంగా వీచే సుడిగాలి గొంతులో చేరి అతన్ని మూగవానిగా చేస్తోంది.

"ఒరే భాస్కరం...ఎంతపని చేసావురా... అంతకన్నా నా పీక నులిమి చంపితే నే నానందించే వాడివిరా, సంతోషంగా కన్ను మూసే వాణ్ణి. ఈ బాధ తట్టుకోలేనురా, తట్టుకోలేను..."

గొంతు పెగలకున్నా మనస్సు నుండి వచ్చే ఆ మాటల్ని, కళ్లనుకార్చే కన్నీళ్ళు పూర్తిగా తడపేసాయి. ఒక్కొక్క కన్నీటి బొట్టు ... ఆవిరి చుక్కలా ... వేడిగా ... ఈ కన్నీటి చారలు రామనాధంగారి మొగంపైని ముడతల్లోంచి సన్నని కాంతి గీతల్లా మెరుస్తున్నాయి రైల్లో వున్న గుడ్డి దీపానిక్కూడా ఆ మెరుపు హేళనలా వుంది. వార్ధక్యంలో ఆయన శరీరంపైకి వచ్చి చేరిన ఒక్కొక్క ముడత ఒక్కొక్క జీవితానుభవానికి ప్రతీక. ఆ అరవయ్యేళ్ల జీవిత గమనంలో ఎన్నో అనుభవాలు ... చేదు, తీపి కలగలుపుగా ఎన్నో సంఘటనలు...

రైలు ఆకలితో వున్న అంబోతులా అరచింది. మేష్టారుగారి మేధస్సు ఓటమి పొందిన రాజులా విలపించింది. కిటికీ గుండా బయటికి చూస్తే అంతా చీకటి ముసుగేసుకున్న శూన్యం.

భాస్కరం వచ్చి ఆ రోజు తనతో "మేష్టారుగారూ" ... అని తియ్యగా పిలిచి సంవత్సరం దాటిందంటే నమ్మశక్యం కాలేదు రామనాధంగారికి. మధుర స్మృతికి వయస్సు ఆలస్యంగా వస్తుందంటే ఇదేనేమో!

ఆ రోజా అతను వచ్చి "మీ ఆశీర్వాద బలంవల్ల, మీరు నేర్పిన పాఠాల వల్ల నేనయ్యేయస్ రాంక్‌తో ప్యాసయ్యాను మాష్టారూ...కలెక్టరుగా కూడా ఆర్డర్స్ వచ్చాయి...ఇదంతా మీ చేతి భిక్ష..." అని తనతో చెప్పినప్పుడు— ఆర్కిమెడిస్ 'యురేకా' అంటూ ఎగిరినప్పటి సంతోషం, కూలివాడికి లాటరీలో లక్ష రూపాయలు లభించినప్పుడు

కలిగే ఆనందం—ఇవన్నీ తన కళ్ళలో కనిపించిన ఆ సంతృప్తి ముందుకు సాటిరావని పించింది. తను నాటి, ప్రతిరోజూ తన చేతులతో నీళ్ళుపోసి ప్రాణప్రదంగా పెంచుకొన్న పూలమొక్క, పెరిగి మొగ్గతొడిగి పూలు పూసి నవ్వుతూంటే అంతకంటే ఆనందం ఆ తోట మాలికేముంటుంది ?

"మేష్టారుగారూ ... వరంగల్ లో కలెక్టర్‌గా ఎల్లుండి జాయిన్ కాబోతున్నాను. అక్కడి వాళ్లు నా కొరకై 'రిసీవింగ్ మీటింగ్' ఏర్పాటు చేస్తున్నారు. అక్కడికి మీరు తప్పకుండా రావాలి... నేను బాధ్యతలు స్వీకరించే ముందు మీ ఆశీర్వాద బలాన్ని ప్రత్యక్షంగా పొందాలి...అది నా ఆశ ..."

అని భాస్కరం ఆ రోజన్నప్పుడు తను ఎంత పొంగి పోయాడో! ఆర్ద్రమైన తన రెండు కళ్లు అందుకు సాక్ష్యం. నోట మాట రావడానికే కష్టమైపోయింది.

"బాబూ ... భాస్కరం ... అంతకంటే ఆనందం, ఈ ముసలి మేష్టారుకు ఏముంటుంది చెప్పు? ప్రత్యక్షంగా ఆ సన్మానం నీకు జరుగుతున్నా, పరోక్షంగా ఆ గౌరవం, అభిమానం, నాకూ దక్కుతాయి. అది ఎవ్వరికీ తెలియక పోయినా నీ హృదయానికి తెలుసు, నా మనస్సుకు తెల్సు. తప్పకుండా వస్తాను బాబూ...నా ఆశీర్వాదం నీ వెంట ఎప్పుడూ వుంటుందిరా..."అని అనురాగంతో తన కాళ్లను చుట్టేసిన భాస్కరం చేతుల్ని ఆప్యాయతతో ముద్దించుకొన్నప్పుడు—నిండిన ఆనందంతో గుండె బ్రద్దలవుతుందేమోనని పించింది.

ఆ మరుపురాని మధుర ఘడియ మళ్లీ గుర్తుకు రాగానే మేష్టారు గారికి చెంప మీద ఎవరో చెళ్లున చరిచినట్లని పించింది.

కన్నకొడుకు కాకపోయినా భాస్కరాన్ని తను చిన్నతనం నుండీ పెంచిన వాత్సల్యం, తన ఆశలకూ, ఆశయాలకు అనుగుణంగా పెరిగాడనే మమకారం అతని పైన అనుబంధాన్ని పెంచాయి. సంతానం లేదనే వూహ తమ వృద్ధ దంపతుల కలల్లోకి కూడా రాకుండా చేసాయి.

"మేష్టారుగారూ... నిరుడు ఉప్పెనలా వచ్చిన తుఫానుకు నా వాళ్లంతా నీటి పాలయ్యారు. మీ ఇంట్లో పని చేస్తాను... నాలుగు మెతుకులు పెట్టి నాలుగు ముక్కలు నేర్పండి... నాకు చదువుకోవాలని ఆశగా వుంది..." అని పది సంవత్సరాలకు పూర్వం పదిహేనేళ్ల వయసులో అనాధగా తన ఇంటి గడప తొక్కినప్పుడే మేష్టారుగారు, అతనిలో పట్టుదల ప్రాణం పోసుకున్న 'మనిషి'ని చూసాడు. స్వతహాగా చదువుకోవాలనే ఆకాంక్ష వున్న ప్రతివారికీ స్వాగతం పలికే మేష్టారుగారి అమృత హస్తాలు— అభ్యర్థింపుతో చూసే భాస్కరానికి ఆ ఇంట్లో స్థానం కల్పించాయి.

మేష్టారుగారి వాత్సల్యం, ఊపిరిగా పెరిగాడు భాస్కరం. మేష్టారుగారి భార్య— పార్వతమ్మ ఆమరాగంలో 'అమ్మ'ను దర్శించాడు

అనాధ భాస్కరం అనుకోని విధంగా ఎదిగాడు. పట్టుదల మనిషి ప్రగతికి ప్రాణం పోస్తుంది అని నిరూపించాడు. కలెక్టర్‌గా ఓ జిల్లా అధికారిగా మేష్టారుగారి ఆశలకు రూపం కల్పించాడు.

ఆ భాస్కరమేనా, ఈ రోజు తన గుండె బద్దలయ్యేట్టుగా ప్రవర్తించింది?

రైలు గొంతు చించుకొని అరచుకుంటూ సాగిపోతూనే వుంది. కాల ప్రవాహం వయస్సును మింగేసినట్లుగా చెట్లనూ, పుట్టలనూ వెనక్కు విసిరేస్తూ వెళ్లిపోతోంది అర్ధరాత్రి కావస్తున్నా ఆ కంపార్టుమెంటులో కన్ను మూత పడనిది రామనాధం గారి కొక్కరికే. ఈ రోజు జరిగిన సంఘటనను గుర్తు చేసుకొంటూంటే గుండెల్లో వెలితి...

బడి పంతుల ఉద్యోగం నుండి రిటైర్డ్ అయిన రామనాధంగారు ప్రతి నెలా తన పెన్షన్ డబ్బులు కలెక్టరాఫీసులో తీసుకోవడం ఆనవాయితీ... ఆఫీసుకు వెళ్లినప్పుడల్లా భాస్కరాన్ని కలసికొని క్షేమ సమాచారం కనుక్కోవడం అలవాటు. కలసిన మేష్టారిగారితో ఎంత పనైనా ప్రక్కకునెట్టి మనస్ఫూర్తిగా మాట్లాడేవాడు భాస్కరం. మేష్టారుగారు ప్రతినెలా మొదటి తారీఖు ఎప్పుడొస్తుందా అని ఎదురు చూసేవాడు. తీసుకొనే పెన్షన్ డబ్బుల కొరకై కాదు— భాస్కరాన్ని కలవడం కోసం.

ఎప్పటి మాదిరే గత నెల కూడా భాస్కరాన్ని కలవడానికి పోయినప్పుడు అతని ప్రవర్తనలో కనిపించిన మార్పుకు కలత చెందారు మేష్టారుగారు.

"మేష్టారుగారూ... బావున్నారా" అని ఎప్పుడు కనిపించినా పలుకరించే భాస్కరం తను ప్రేమతో మాట్లాడినా మౌనం వహించి తిరస్కారంగా చూసాడంటే... మేష్టారు గారికి భాస్కరం తన నుండి దూరమవుతున్నాడేమో ననిపించింది. అప్పటి కెలాగో సర్ది పెట్టుకొని వెళ్లారు.

"మీరనవసరంగా బాధపడుతున్నారు. మన భాస్కరం అలాంటి వాడు కాదండీ... పనుల వత్తిడి వల్లనో దేనివల్లనో వాడలా ప్రవర్తించి వుంటాడుగాని మిమ్మల్ని దైవంగా భావించే భాస్కరం దూరమవుతాడంటే భక్తుడికీ, భగవంతుడికీ మధ్య అగాధ మేర్పడినట్టే! నా మాట వినండి... మీరు మనస్సు పాడుచేసుకోకండి."

బాధతో కృంగిపోయే భర్తతో పార్వతమ్మ అన్నప్పుడు ఆవిడ మాటలు నిజమేనేమో అనుకున్నారు మేష్టారుగారు.

భర్తను సముదాయించాలనే తాపత్రయంతో అలా అన్నదేగాని పార్వతమ్మలోకూడా అంతర్మధనం ప్రారంభమయింది చిన్నతనం నుండి భాస్కరం ఆలనా పాలనా తను

### మార్పు తెచ్చిన మహిళలు!

హాంబర్గ్‌లోని జైలులో మగవార్డర్ల కొరత ఏర్పడంతో ఆడవారిని వార్డర్లుగా నియమించారు. అనుకోకుండా దీనివలన అద్భుతమైన ఫలితాలు ఏర్పడ్డాయి. ఆశ్చర్యంగా ఖైదీల ప్రవర్తనలోనే మార్పు వచ్చింది. అందరూ గడ్డాలు చేసుకుని శుభ్రంగా కనిపించడం మొదలు పెట్టారు. అసభ్యంగా మాట్లాడడం తగ్గింది. జీవితకాలం శిక్ష అనుభవిస్తున్న వారిలోనే ఈ మార్పులు ఏర్పడ్డాయని తెలిస్తే మరీ ఆశ్చర్యపోతారేమో! వారిలో విరక్తి కూడా తగ్గింది. అయితే వార్డర్లుగా పని చేయడం స్త్రీలకు సులభమైన విషయం కాదు. సైకాలజీ, క్రిమినల్‌లా, అడ్మినిస్ట్రేషన్లలో 15 నెలలపాటు శిక్షణ పొందాలి. తుపాకులు ఉపయోగించటం కూడా నేర్చుకోవాలి. ఉద్రేక సమయాల్లో, లేక తప్పించుకుని పోయే ప్రయత్నాలలో ఖైదీలు వీరిపై తిరగబడే అవకాశాలు లేకపోలేదు.

## శరన్మేఘం

స్వయంగా చూసుకొనేది. భాస్కరం తనను 'అమ్మా' అని ఆప్యాయంగా పిలిచినప్పుడు పురిటిలోనే గర్భశోకాన్నమభవించిన తన ప్రేగు కదిలినట్లనిపించేది. పెంచిన ప్రేమ ఎంత బలవత్తరమైందో దేవకికి కాదు— కృష్ణుణ్ణి పెంచిన యశోదకు తెలుసు.

అలాంటి భాస్కరం తమపట్ల చూపే అనాదరణ ఆమెను కృంగదీసింది. అతని నుండి వాళ్ళాసించింది మేడలూ మిద్దెలూ గాదు, రత్నాల రాశులు గాదు. అలాంటి కోరికే వాళ్ళకు వుండివుంటే భాస్కరం తను కలెక్టరుగా జాయినయినరోజే తమను తనతో రమ్మన్నాడు. తనతోనే వుండమన్నాడు. కాని తాము వెళ్ళలేదు— క్రొత్తగా పెళ్ళయిన జంట అనుభవించే ఆనందం దూరం నుండే చూసి సంతోషిద్దామని. భాస్కరం నుండి ఆ వృద్ధదంపతులాశించింది కేవలం ఆప్యాయత, అనురాగం.

గతనెలంతా ముళ్ళమీదున్నట్లే వుంది మేష్టారుగారికి! మన్నుదిన్న మంజెరలా నడిచాయి ముప్పై రోజులు. మళ్ళీ ఈ రోజా ఆఫీసుకెళ్ళారు రామనాథంగారు. పెన్షన్ డబ్బులు తీసుకోవడం కంటే ముందు భాస్కరాన్ని కలిసికొని మాట్లాడాలనే ఆతురత.

కాని ఆయనగారి దర్శనం కలగడమే గగనకుసుమమైంది. తను వచ్చి వేచివున్నానని ఓ చీటీని కూడా ప్యూనుతో పంపించాడు, సమాధానం లేదు. ఉదయం పది గంటల నుండి సాయంకాలం నాలుగ్గంటలవరకు కాలం మంచులా కరిగిపోయింది. ఆఫీసు మూసి వేస్తారనగా బయటి కొచ్చాడు భాస్కరం. వెంట భార్య కూడా వుంది. మేష్టారు గారికి — ఎడారిలో నీళ్ళు కన్పించినంత ఆనందం! ఎన్నో రోజులుగా ఆకలితో వున్న కళ్ళకు పంచభక్ష్య పరమాన్నాలు కన్పించినప్పుడు కలిగే ఆనందం!!

చాలా రోజులుగా తప్పిపోయిన గారాల కొడుకు కన్పించినప్పుడు తండ్రి ఎదలో కలిగే ఆనందం!!!

"బాబూ...భాస్కరం..."

ఆ ఆనందాలన్నీ రామనాథంగారి గొంతులో ఏకమయ్యాయి.

మేష్టారుగారి పిలుపుకు భాస్కరం ఖరీదైన నీలి కళ్ళద్దాలు ఒక్కసారి ఆయన వేపు తిరిగాయి. ఆ నల్లటి కలర్ వెనక వున్న చూపుల్లో ఎలాంటి భావం వుందో గమనించలేక పోయారు రామనాథంగారు.

"మీటింగ్ టైం దాటిపోయింది ... త్వరగా బయల్దేరండీ..."

క్షణంసేపు నిల్చున్న భాస్కరం వేపు విసుగ్గా చూసింది ఆయన సతీమణి. ఆవిడ గోల్డ్ ఫ్రేమ్ కళ్ళద్దాలలోని కళ్ళు—మేష్టారు గారిని హీనంగా చూసాయి.

భార్య మాటలకు బద్ధుడుగా ఆఫీసు

మెట్లపై బూట్లు టక టక లాడించు కుంటూ ఆవిడ వెంట నడిచాడు భాస్కరం.

మేష్టారు గారి కళ్ళు వర్షాకాలపు మేఘాలయ్యాయి. కాని వాటిలో వురుము లేదు .. మెరుపులేదు ... నిండుగా నీళ్లతో ప్రశాంతంగా వున్నాయి. గతించిన తన అరవయ్యేళ్ళ అనుభవంలో అలాంటి నిరాశను ఎన్నడూ ఎదుర్కొనలేదు మేష్టారుగారు. ఆయన కింకా ఎక్కడో ఆశ మెరుస్తూనే వుంది. అతనికి తెలియకుండానే కాళ్ళు భాస్కరం ఎక్కుతూన్న తెల్లటి ఫియట్ కారు వద్దకు నడిచాయి.

"భాస్కరం. నేను...మాష్టారుని...ఒక్క నిముషం ఆగుబాబూ..."

ఆ గొంతులోని అభ్యర్థన — రాళ్ళు, మంచులా మార్పు చెందుతాయా? అన్నట్లుంది.

"ఎవరయ్యా నువ్వు ?... లెగు... లెగు ...వారెవరనుకుంటున్నావు ... ఈ జిల్లా కలెక్టరు...తెలుసా..."

విసురుగా అన్న కలెక్టరు ప్యూను మాటలకు– కలెక్టరు మొగం కోపంతో కంద గడ్డ అవుతుందేమో ననుకున్నాడు. ప్యూను చెంప చెళ్లు మంటుందేమో ననుకున్నాడు. కాని . ఇదివరలో అనుకున్న వాటన్నింటితో ఇది కూడా ఏకమై పోయింది.

కలెక్టరుగారు కారెక్కారు.

మేష్టారు గారి కళ్ళు తప తప మని వర్షించాయి.

కారు కదిలింది...వెళ్లిపోయింది...

మేష్టారుగారు నిస్తబ్దుడిలా నిల్చుండి పోయారు ...

చెట్టంత కొడుకు చెంప మీద కొట్టినా అంత బాధ పడకపోవును కాని– తను పెంచి పెద్దజేసిన చెట్టు, పూలు పూస్తున్నా ఆ పూలల్లో సుగంధాన్ని ఎవ్వరో కొల్లకొడుతూ వుంటే కృశించి పోయింది మేష్టారుగారి హృదయం !

అక్కడి నుండి స్టేషన్‌కు ఎలా వచ్చారో, రైలు ఎప్పుడు ఎక్కారో రామనాథంగారికి గుర్తులేదు ప్రతినిముషం భాస్కరం తనను చేసిన ఎగతాళికంటే పది సంవత్సరాల పాటు తనపై కనబరచిన ప్రేమ,భక్తి, అనురాగాలు గుర్తుకువచ్చి గాయంపై ముల్లు గుచ్చు కున్నంత బాధ...

శూన్యంలోకి చూసే ఆ నిస్సారమైన చూపుల్లో భావం, భాస్కరం పైని కోపాన్ని సూచించడంలేదు అతనిపై జాలి కరుణను వెల్లగక్కుతున్నాయి.

రైలు ఆగింది.

ఇంట్లో గడపలోకి అడుగు పెట్టగానే, భర్తకోసం వెయ్యి కళ్లతో ఎదురు చూసే పార్వతమ్మకు ప్రాణాలు వచ్చాయి.

"భాస్కరం కలిసాడండీ ... బాగా మాట్లాడాడా ... నన్ను గుర్తు చేసాడా ... ఎందుకు మాట్లాడడూ ... తప్పకుండా మాట్లాడుతాడు...వాడు నా కొడుకండీ ... ఈ చేతులతో పెంచాను..."

పార్వతమ్మలోని ఆ ఆనందం, ఆ ఆవేశం ఆవిడతో కల్సి జీవించిన నాలుగు దశాబ్దాల్లో ఎన్నడూ చూడలేదు మేష్టారు గారు ఆవిడ గొంతులోని ఆతురతకు మేష్టారు గారి పెదవులపై సన్నటి మందహాసం... ఆ చిరు నవ్వులోని భావం ఆవిడ కర్థమైంది.

"ఏవండీ ... వాడు కలవలేదా ... చెప్పండీ..."

"వాడిక మనకు లేడే ... పార్వతీ ... నా అరవయ్యేళ్ల జీవితానుభవం ముందు వాడి అధికారం పెత్తనం చలాయించిందే ... అనురాగం ముందు 'హోదా' విజయం సాధించిందే ... కలెక్టర్ గదూ ... ప్రేమ, ఆప్యాయతల్ని కారు చక్రాల క్రింద నలిపేసాడు."

రామనాధంగారి మాటలకు పార్వతమ్మ గుండె చెరువయ్యింది.

"ఏవండీ... వాడలా మారడానిక్కారణం ...అదండీ... వాడి భార్య, బంగారం లాంటి భాస్కరాన్ని పూర్తిగా మార్చేసింది. పేద వృద్ధ జీవితాలకు దూరంగా తరిమేసింది. కాని ఈ పేద తనంలోని ప్రేమతో పెరిగాడనీ, ఆ ప్రేమ తోడే వాడు పెద్ద వాడయ్యాడని దానికి తెలియదండీ ... తెలియదు...పెళ్లిలోనే గమనించాను మన మంటే ఈసడింపు, అసూయ.. పోనీలెండి... మన భాస్కరం చచ్చిపోయాడనుకుందాం."

వృద్ధ దంపతుల ఇద్దరి రోదననూ గమనిస్తున్న గుడిసెలోని గుడ్డి దీపం హేళనగా నవ్వింది.

* * *

ఆ పల్లెటూళ్లో ఆ రోజు ప్రజలంతా హడావుడిగ వున్నారు హరిజనుల కొరకై కట్టబడిన క్రొత్త ఇళ్లకు పదుచు కన్యలకు మల్లే ముస్తాబు చేస్తున్నారు కలెక్టరుగారిచే ప్రారంభించబడటానికి అన్ని హంగులూ పూర్తయ్యాయి. ఇళ్లకు ప్రారంభం చెయ్య బోయే కలెక్టరు, ఆ వూళ్లోనే పెరిగి చదువుకొన్న భాస్కరం కావడం ఆనాటి ఆ కార్యక్రమానికి మరో ప్రత్యేకత.

కలెక్టరు భాస్కరం తనవూరు వస్తున్నాడని విన్న రామనాధం మేష్టారుగారి



ఆనందానికి అవధి లేదు కలెక్టరాఫీసులో ఆ రోజు ఆ సంఘటన జరిగిన్నాటి నుండీ ఆయన పూర్తిగా క్షీణించిపోయారు. ఎప్పుడూ భాస్కరం గురించే తలంపు. అతడు తనుండి దూరమైపొయ్యాడనే బాధే. రాత్రి నిద్రలో అతని గురించే పలవరింతలు.

మేష్టారుగారి శరీరారోగ్యం దెబ్బతిన్న పార్వతమ్మ చివరి ప్రయత్నంగా భాస్కరానికి ఒక పుత్తరం రాయించింది. కాని జవాబు లేదు. దాంతో మరింత వ్యాకులత చెందారు.

తన వూరు వచ్చిన భాస్కరం తన ఇంటికి వచ్చి తనను తప్పక పలకరిస్తాడనీ, మునుపటి ప్రేమను ప్రకటిస్తాడని నమ్మకం మేష్టారుగారికి. ఇంత జరిగినా ఇంకా అతనొస్తాడని, పరామర్శిస్తాడని ఆశిస్తున్నాడంటే, పార్వతమ్మ భర్త ఓపికకు ఆశ్చర్య పడింది.

ఊరి ప్రజలంతా స్వాగతం పలికారు భాస్కరానికి, అతని భార్యకూ. ఆ సమావేశానికి వెళ్లాలని మేష్టారుగారికి ఎంత ఉత్సాహంతో! కాని... వంట్లో సత్తువలేదు. భర్తనలా వదిలేసి పార్వతమ్మ గూడా వెళ్లలేక పోయింది.

# శరన్మేఘం

కలెక్టరుగారు ఆ రాత్రి అక్కడ వుండవల్సిన కారణంగా ఆ వూరి సర్పంచిగారింట్లో బస ఏర్పాటయింది. పెట్టుకున్న ఆశలన్నింటినీ గంగపాలు చేసి భాస్కరం, భార్యతోసహా సర్పంచిగారు ఏర్పాటు చేసిన ప్రత్యేక గదిలో విశ్రాంతి తీసుకుంటున్నాడు— సీలింగ్ ఫాన్ అందజేసే చల్లగాలిలో.

అర్ధరాత్రి అయినా నిద్దురావడం లేదు రామనాధంగారికి. పార్వతమ్మ భర్త మంచం దగ్గర కూర్చొని కునికిపాట్లు పడుతోంది. తలుపుచప్పుడైనా మేష్టారుగారికి—భాస్కరం వచ్చాడనే ఆశ. గాలికి గుడిసె ద్వారానికున్న ఎండుటాకులు గలగలమన్నా అది భాస్కరం అడుగుల చప్పుడు మాదిరే అనిపిస్తోంది.

ఇంతలో...ప్రజల్లో కోలాహలం. పెద్దగా అరుపులు వినవచ్చాయి. అవి క్రమంగా అధికం కాజొచ్చాయి. పార్వతమ్మ వీధి గడప దగ్గరికొచ్చింది.

"మనవూరిబడికి నిప్పంటుకుందమ్మా... దాని ప్రక్కనే వున్న సర్పంచి గారిల్లు గూడా తగులబడుతోందట. మన కలెక్టర్ భాస్కరం గోరూ... ఆయనగారి భార్య అందులోనే వున్నారంట. అందరూ అటే పోతున్నారు" అని పార్వతమ్మతో చెప్పి పరుగెత్తుక పోతున్నాడో పాలేరు.




అది విన్న రామనాధంగారి గుండెల్లో రాయి పడింది. "భాస్కరం..."— నీరసంగా వున్నాగాని ఆ అరుపు గుడిసె గోడలకు గుద్దుకొని ప్రతిధ్వని ఇచ్చింది. బయటున్న పార్వతమ్మ ఒక అడుగున లోనికొచ్చింది.

"బాబూ... భాస్కరం..." అంటూ లేచి, చేతికర్ర నందుకొని వీధిలోకి అడుగు వేసారు మేష్టారుగారు. దిక్కుతోచని స్థితిలో ఆయన వెనకే పరుగుతీసింది పార్వతమ్మ.

శరీరంలోని శక్తంతా పాదాల్లోకి వచ్చి చేరింది మేష్టారుగారికి. మంటలు నాగుపాము కోరల్లా బుసలు కొడుతున్నాయి "అయ్యో. అయ్యో... ఎలా... భాస్కరం ,ఆయన భార్య మంటల్లో... మంటల్లో... ఎలా... అయ్యో..."

అందరి గొంతుకలూ కలిసి ఒకదానినొకటి తాకుతున్నాయి.

మేష్టారుగారికి ఏమీ తోచడంలేదు.

"భాస్కరం..." అంటూ మంటల్లోకి అడుగులు వేసారు మేష్టారు. భాస్కరాన్ని కాపాడుదామనే పయత్నంలో తనకు లేనిశక్తి గుర్తుకు రాలేదాయనకు.

"భాస్కరం...భాస్కరం...భాస్కరం..." ఆ వృద్ధ గొంతుక మంటల హోరులో కల్సిపోయింది. కాని తను మంటల్లోకి అడుగు పెట్టడం, భాస్కరం, భార్యతో సహా ఎవ్వరి సహాయముతోనో బయటకు క్షేమంగా తీసుకురాబడటం ఒకేసారి జరిగిందన్న విషయం పాపం ఆ ముసలి గుండె ఎరుగదు.

"భాస్కరం బాబూ ... రామనాధం మేష్టారుగారు మిమ్మల్ని కాపాట్టం కోసం మంటల్లో దూకారు బాబూ..."

విన్న భాస్కరానికి తల కొట్టేసినంత పనైంది.

బయటికి తీసుకొచ్చారు మేష్టారు గారిని ... శరీరం పూర్తిగా కాలిపోయింది. భాస్కరం క్షేమంగా వున్నాడని తెలుసుకొన్న ఆ కాలిపోయిన కళ్లు కూడా కాంతిగ మెరిశాయి.

"భాస్కరం..." భాస్కరం తల నిమిరారు మేష్టారుగారు.

"వేష్టారూ..." భాస్కరానికి కన్నీళ్లాగ లేదు.

"నన్ను క్షమించండి వేష్టారూ ..." ఆ కన్నీళ్లు కాలిన మేష్టారు శరీరానికి చల్లగా తగిలాయి.

"బాబూ...భాస్కరం...లే.. లే. ఎందు కేడుస్తావురా. నా కిప్పుడెంత ఆనందంగా వుందో తెలుసా నా భాస్కరం నన్ను మళ్లీ "మేష్టారూ..." అని ఆప్యాయంగా పిలిచాడు. నా పైన ప్రేమతో కన్నీటి చుక్కలు రాల్చాడు. అవి చాలు బాబూ ... నేను కోరుకున్న దదేరా ... ఈ ముసలి మేష్టారుకు కావల్సినవి అవేరా ... ఏ మేష్టారైనా విద్యార్థి నుండి కోరుకొనేవి డబ్బూ, దర్పం కావు బాబూ – అనురాగం, ఆప్యాయత. నిండు మనసుతో మేష్టారు కొరకై రాల్చే రెండు కన్నీటి బొట్లు. అంతే—అదే ఆ విద్యార్థి గురువు కందించే గురుదక్షిణ...నా గురుదక్షిణ నాకందించావు. పార్వతీ . చూడు ... మన భాస్కరం మళ్లీ మన వాడయ్యాడు. ఆనందంగా లేదూ..."

మేష్టారు గారి గొంతుక తడబడుతోంది. ఎంతో ప్రయత్నంతో తప్ప ఆ మాటలు రావడంలేదు. భాస్కరాన్ని దగ్గరికి తీసుకుని —ప్రేమగా ముద్దించు కున్నాడు.

"భాస్కరం ...నువ్వు... కలకాలం ... సంతోషంగా వుండాలి ... సంతో...షం...గా వుం...డా...లి."

ఏడుస్తూ నిల్చున్న పార్వతమ్మని భాస్కరం చేతుల్లో పెట్టి చివరి శ్వాస తీసారు రామనాథం మేష్టారు గారు.

తనను క్షమించమన్నట్లుగా చూస్తున్న భాస్కరం భార్యను, అక్కున చేర్చుకొని భోరున ఏడ్చింది పార్వతమ్మ.

ఆ అర్ధరాత్రి ఆకాశంలోంచి ఓ తార నేల రాలింది. తన లోని నీటి నంతా వర్షం రూపంలో భూమి కందజేసిన శరన్మేఘం ఆకాశంలో తృప్తిగా నిట్టూర్చింది.

### అంకితం

తన జీవిత కాలంలో ఆర్జించుకొన్న విజ్ఞానాన్నంతా విద్యార్థులకు నిస్వార్థతతో పంచి ఇచ్చి జీవితపు చివరి అంచుల్లో కాలం గడిపే ఉపాధ్యాయులంతా శరన్మేఘాలు. వారందరికీ నా యీ కథ అంకితం — రచయిత.



## మాయ అద్దం !

ఫోనిక్సుకు చెందిన అరిజోనా నగరంలోని వో భవనంలోని వో పోర్షనులో నివసిస్తున్న వో ముగ్గురు సుందరీమణులు తాము బాత్‌రూములో నగ్నంగా స్నానంచేసేవేళ అక్కడున్న నిలువెత్తు అద్దం కిస్సు కిస్సున నవ్వుతూన్నట్టూ, నిట్టూర్పులు విడుస్తున్నట్టూ అనుమానించారట. తీరా చూస్తే అది అద్దం కాదట. ఒక వైపు పాదరసం పూయబడిన గాజు అద్దమట. అవతల వైపు వాటాలో వాళ్ళు ఆ అద్దంగుండా యీ బాత్‌రూములోని సుందరీ మణుల సౌందర్యమంతా చూడవచ్చునట. ఈ కేసు విచారించిన న్యాయాధిపతి అవతలింటివారికి 87 వేల డాలర్లు అపరాధం విధించి, ఆ డబ్బు సుందరాంగిలకు చేరేలా తీర్పు నిచ్చారట!

## యువకునిలో గర్భసంచి !

చిదంబరంకు చెందిన తిల్లై నాయకం అనే 22 ఏళ్ళ కుర్రాడికి పుట్టిననాడే రెండు వృషణాలకు బదులు ఒకటి వున్నదట. ఆతని తల్లిదండ్రులు శక్తిమేరకు డాక్టర్లకు చూపి, వదిలేశారట. ఆతనికి 22 ఏళ్ళు వచ్చాక వో రోజు ఆ స్థానంలో విపరీతమైన నొప్పివచ్చి మెలితిరిగి పోయాడట. దాంతో ఆతని తలిదండ్రులు పాండిచ్చేరి జిప్మర్ ఆసుపత్రిలో చేర్చారట. అక్కడ డాక్టర్ జనార్ధన్ పరీక్షలో రెండో వృషణం గర్భంలోనే చిక్కుకున్నట్టు కనిపెట్టి శస్త్ర చికిత్స చేశారట. ఆతని కడుపు కోసిన డాక్టరు నిశ్చేష్టుడై పోయాడట. లోపల స్త్రీలకు వుండే గర్భసంచి వున్నదట. ఆ గర్భ సంచిలో యీ రెండో వృషణం చిక్కుకున్నదట. తన నేర్పుతో ఆయన యీ గర్భసంచిని ఛేదించి, తీసేసి, రెండో వృషణాన్ని కూడా వుండాల్సిన స్థానంలోకి తీసుకవచ్చి, తన ఆపరేషను జయప్రదం చేసుకున్నారట.

## రాజకీయాలలో జయలలిత !

ఒహనాటి అగ్రనటి జయలలిత యిటీవల వోనాడు జామ్మని తమిళనాడు ప్రభుత్వ పార్టీ అన్నా డి. యం. కె. కు నలభై వేలు విరాళంయిచ్చి గమ్మునూరుకున్నదట. ఆనక ఆమెను ముఖ్యమంత్రి యం. జి. ఆర్. విశేషంగా గౌరవిస్తున్నారనీ, ప్రతి విశేషానికి ఆహ్వానిస్తున్నారనీ జనులన్నారు. ఇప్పుడు ఆమెకో మంత్రి పదవేసిద్ధంగా వున్నదనీ అని, అంతతో ఆగక యం జి. ఆర్ తరువాత జయలలితే ముఖ్యమంత్రి అవుట తథ్యము సుమతీ అంటున్నారు. ఈ విషయం చూచాయగా ఆయనే సూచించారనీ అంటున్నారు.

## పరీక్ష తప్పి ఆత్మహత్య !

సేలం స్వామినాథపురానికి చెందిన 17 ఏళ్ళ మాదేశ్వరన్ యస్సెసెల్సీ పరీక్ష తప్పినందు వల్ల వూరంతా తిరిగి, చివరికి యింటి వెనుకనూతిలో పడి ఆత్మహత్య చేసుకున్నాడట. ఆ తండ్రి వూరంతా వెతికి, నీరసంతో యింటికి వచ్చి చూసేసరికి తన యింటి వెనుక నూతిలోనే కొడుకు శవం తేలుతోందట. తలిదండ్రులు పరీక్షలు తప్పిన పిల్లలను అవమానకరంగా తిట్టక, వోదార్చి మళ్ళీ సరిగా చదివి ఫస్టున ప్యాసవమని ప్రోత్సహిస్తే తప్ప యీ రకం ఆత్మహత్యలు ఆగవు!

## విమానాశ్రయంలో మానభంగం !

విజయవాడకు చెందిన వో15 ఏళ్ళ అమ్మాయి తన తండ్రి జబ్బునయమడానికి చేయించాల్సి వున్న వైద్యానికి డబ్బు కోసం చందాలడుగుతూ హైదరాబాదు వెళ్ళి, అక్కడ విమానాశ్రయానికి వెళ్తే ధనికులు దొరుకుతారని, వెళ్ళేసరికి గేటువద్ద లోపలకు వదల లేదట. ఈ కథ చూసిన వో యిద్దరు యువకులు అమ్మడూ నీకు మేము సహాయం చేస్తాం అని ఎయిరోడ్రోం పై భాగానికి తీసుకుపోయి, అక్కడ తవ కామవాంఛ తీర్చుకుని చక్కాపోయారట.

## చిత్రహింస భరించలేక ఆఫీసరు భార్య ఆత్మహత్య !

ఢిల్లీ భారత్ హెవీ ఎలక్ట్రికల్స్‌లో పనిచేసే సురిందర్ మాలిక్ అనే వో ఆఫీసర భార్య గీతా మాలిక్ మీద కిరసనాయిలు పోసుక నిప్పంటించుకుని, ఆసుపత్రిలో చనిపోతూ తన భర్త, అత్తమామలూ పెట్టే బాధల భరించలేక తానా పని చేసినట్టు పోలీసులకి వాఙ్మూల మిచ్చి కన్నుమూసిందట. ఆమె పూనా రోడ్డులోని వో స్కూలులో టీచరుగా పని చేస్తున్నదట. భర్త, అత్తమామలూ అనునిత్యం ఆమెను చిత్రవిచిత్రహింసలు పెట్టేవారట. ఆమె వాఙ్మూలం వల్ల పోలీసులా ముగ్గుర్నీ అరెస్టు చేశారట.

## కలెక్టరాఫీసులో పునర్వివాహం !

తిరుచ్చి కలెక్టరాఫీసులో జూన్ 9 వ తేదీన కలెక్టరు మిస్. శాంత షీలా నాయర్ ప్రజల విన్నపాలు విని, వాటిని గురించి విచారించే సమయంలో యిద్దరు పిల్లలతో కమలమ్మ అనే వో విధవరాలు వచ్చి తాను సింగారం అనే వోహతన్ని పునర్వివాహం చేసుకోదల్చుకున్నట్టు, ఆధారమెవరూ లేనందున జంకుతున్నట్లు, వో అర్జీతో సహా విన్నవించు కున్నదట. సింగారం కూడా అదే కోర్కెను అర్జీలో రాసి తెచ్చి సిద్ధంగా వున్నాడట. దాంతో కలెక్టరు గారు వో క్షణంలో తన ఆఫీసును కల్యాణ మందిరంగా మార్చేసి, వారిద్దరికీ పెళ్ళి చేసి, డిస్ట్రిక్ట్ వెల్ఫేర్ ఫండులోంచో మూడొందలు బహూకరించారట—అబ్బురము!



**ఇంటర్వ్యూల్లో పేపరికార్డర్లు!**

తమిళనాడులో బి. కామ్ చదువుకు సీట్లు బాగా అమ్ముడుపోతున్నాయట. కొన్ని ప్రయివేటు కాలేజీలు మూడు వేల నుంచి మూడు వేల అయిదొందలు లంచంగా తీసుకుని ఒక్కో సీటూ ఇస్తున్నారట. ప్రభుత్వ విద్యాశాఖమటుకూ ఇదంతా ముడియాదు. వేం నూటొక్క జాగ్రత్తలూ వహిస్తున్నాము. ఇంటర్వ్యూలలో టేపురికార్డర్లని కూడా పెడ్తాము అంటున్నారట. దొంగల బాధను ఆపడానికి నిమ్మ చెట్టుకు మడి చీర కట్టిందట్ మామ్మగారు. అలా ఉందీ కథ.

**బంగారం తెచ్చిన ప్రమాదం!**

మద్రాసు సెంట్రల్ స్టేషనులో జూన్ 29న రైలు దిగిన విజయ అనే ఆమె, ఆమె తండ్రితో సైకిలు రిక్షా ఎక్కి తమ నివాసానికి బయల్దేరారట. దారిలో రివ్వున మరో మూడు ఖాళీ రిక్షాలు వచ్చి యీ రిక్షాను ఆపి, మొత్తం నలుగురూ కలిసి కత్తులు చూపించి, 25 కాసుల బంగారం ఆ విజయ ఒంటిమీదిది తాళితోసహా ఒలుచుకుని అడ్డొచ్చిన ఆమె తండ్రిని కత్తితో పొడిచి పారిపోయారట — కాపోయినా పాతిక్కాసులు బంగారం మెళ్లో ధరించి రిక్షాలోనా పోయేది? టాక్సీ అయితే యింకా ప్రమాదం కాదా! ★

"నాకు ఆ సంబంధం యిష్టం లేదు. రేపు వాళ్లని పెళ్లి చూపులకి రానవసరంలేదని నాన్నగారిని చెప్పమను"! అంది రాధ మల్లెపూల మాల కడుతూ.

రంగనాయకమ్మ నోట మాట రాలేదు కాసేపు. కూతురు ఏమంటున్నదీ అర్థం కాలేదు. రెండు నిమిషాల తర్వాత తేరుకొని, "ఎందుకని?" అనడిగింది.

"నాకు యిష్టంలేదు గనుక."

"అదే- ఎందుకు యిష్టంలేదని అడుగుతున్నాను. ఇంతవరకూ నువ్వు ఆ అబ్బాయిని చూడలేదు. ఆ అబ్బాయి నలుపయినా బాగున్నాడని మీ నాన్నగారు చెబుతున్నారు. మనకు లేదు. ఇలా బీదవాళ్ల యింట్లో పుట్టడమే నువ్వు చేసుకున్న పాపం. కట్నం తక్కువయినా అమ్మాయి అందాన్ని చూసి చేసుకొన్నవాళ్ళు చాలామంది వున్నారు కానీ, నీ దురదృష్టం ఏమిటోగాని అలాంటివాళ్లు ఎవ్వరూ మనకి దొరకలేదు. అది మన దురదృష్టం. మీ నాన్నగారు యీ వయసులో నీ పెళ్లి గురించి ఎలా తిరుగుతున్నారో, ఎంత బాధ పడుతున్నారో నువ్వు చూస్తూనే వున్నావు. కొన్ని కొన్ని విషయాల్లో సర్దుకుపోక తప్పదమ్మా. ఈ జీవితాని కింతేనని సరిపెట్టుకోక తప్పదు. అదృష్టం వుంటే కటిక దరిద్రుడు కూడా మహారాజావచ్చు..."






అయినా, రేపు అబ్బాయిని చూసిన తర్వాత ఆలోచించవచ్చులే" అంది రంగనాయకమ్మ.

"అబ్బాయి నలుపని కాదు. ఎంత అందవికారంగా వున్నా నాకు అభ్యంతరం లేదు."

"మరి?"

"ఆ అబ్బాయి పనిచేసేది ఒక బట్టల షాపులో. అదేమీ పర్మినెంటు ఉద్యోగం కాదు. అతనికి వచ్చేది రెండు వందల యాభై రూపాయలని నాన్నగారే చెబుతున్నారు. ఆ వచ్చే జీతంతో అతని తల్లిదండ్రులతో కలిపి నలుగురు బ్రతకాలి. అదెంత కష్టమో నాకు తెలుసు."

రంగనాయకమ్మకి రాధ చెప్పినదానిలో ఎంత నిజముందో అర్థమయింది. కాని, ఎక్కువ కట్నం యిచ్చుకోలేని తమలాంటి వాళ్ళకి యీ రోజుల్లో యింతకన్నా మంచి సంబంధం ఆశించడం 'ఆశించడమే' అవుతుందనీ తెలుసు. ఒకసారి రాధకేసి చూసింది. అపరంజి బొమ్మలా మెరిసిపోతోంది రాధ. ఏ ఆఫీసర్‌కో భార్య కావలసిన అందం, కళ అన్నీ వున్నాయి రాధలో. కాని అంత మంచి సంబంధాలు తెచ్చే స్తోమతలేదు తమకి. రంగనాయకమ్మ బాధగా నిట్టూర్చింది.

"చూడమ్మా, మనపరిస్థితి నీకు తెలుసు. గొప్ప సంబంధాలు కొనుక్కునే స్తోమత

"ఆ అదృష్టమే వుంటే నాకూ అందరిలాగే మంచి సంబంధమే దొరికేది. అదృష్టం మీద నాకు నమ్మకం లేదమ్మా. బీదరికం ఎంత భరించరానిదో మనకి తెలుసు. వాళ్లు మనకన్నా బీదవాళ్లు. ఆ కష్టాలు నేను జీవితాంతం భరించలేను. నాకు పెళ్లి అవసరం లేదు. బ్రతకడం కష్టమనిపిస్తే ఆత్మహత్య అయినా చేసుకొంటాము. అంతే గానీ..." రాధ కళ్లల్లోంచి నీళ్లు జలజలా రాలాయి. గొంతు పూడుకుపోయింది.

రంగనాయకమ్మకి గుండెల్ని ఎవరో కోసినట్లనిపించింది. ఆ సంబంధం చేసికొంటే తన కూతురు ఏమాత్రం సుఖపడేదీ ఆమెకి

తెలుసు. కాని, ఏమిటి చెయ్యడం? చేతుల్లో తల దాచుకుని తనూ ఏడిచింది.

బయట చీకటి పడింది. రంగనాయకమ్మ పైకి లేచి లైటు వేసింది. రాధ తలమీద ఆప్యాయంగా చెయ్యివేసి, "అనవసరంగా ఆలోచించి మనసు పాడుచేసుకోకమ్మా! మన చేతుల్లో ఏదీ లేదు. విధి ఎలా నడిపిస్తే అలా నడవక తప్పదు. వున్నదాంతో తృప్తి పడడం కన్న మించిన సంపద లేదంటారు. ఈ సంబంధం నీకు యిష్టంలేదని చెబితే నాన్న గారు మండిపోతారు. ఆయన యీ సంబంధ మైనా కుదిరితే చాలని వెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటున్నారు. కన్న కూతురి జీవితం పాడుచేయాలని ఏ తండ్రీ అనుకోడమ్మా. పరిస్థితులకి తల వంచక తప్పదు. లేచి స్నానం చెయ్యి" అంది.

* * *

ఆకాశం నిర్మలంగా వుంది. చంద్రుడు చల్లని వెన్నెలని జల్లుగా భూమిపైకి కురిపిస్తున్నాడు. వుండి వుండి గాలి తెరలు తెరలుగా చల్లగా తాకుతోంది. జడలో మల్లె పూల వాసన తియ్యగా గాలిలోకి పాకుతోంది. ఇవేవీ రాధమీద పనిచెయ్యడం లేదు. అర్ధరాత్రి వెళ్లిపోతున్నా నిద్ర రావడంలేదు. మనసంతా తుఫాలో అల్లకల్లోలమయిపోతున్నసముద్రంలా వుంది. ఆలోచనతో మెదడు మండు వేసవిలో పేదవాడి గుడిసెలా కాలిపోతోంది.

తెల్లవారితే పెళ్లచూపులు. ఆ అబ్బాయికి తను కచ్చితంగా నచ్చుతుంది. ఆ అబ్బాయికే కాదు— ప్రతివాళ్లకీ నచ్చేటంత అందంవుంది తనకి. ఆ అందమే తనకి అదృష్టం తెస్తుందని ఎన్నో కలలుకంది. తమకిపెద్దగా కట్నం యిచ్చుకునే శక్తి లేకపోయినా, ఏ ఆఫీసరో తన అందాన్ని కళ్లకద్దుకొని ఎగరేసుకు పోతాడని తియ్యటి కలలు కంది. కాని, అవన్నీ కలలుగానే మిగిలిపోతాయని ఆ కలల్లో కూడా అనుకోలేదు! పక్కింటి పార్వతికి పోయిన సంవత్సరం పెళ్లయింది. కట్నం తక్కువయినా, అమ్మాయి బాగుందని బ్యాంకులో పనిచేసే ఓ క్లర్కు పెళ్లి చేసుకొన్నాడు. ఎదురింటి ఏసురాజ్యంకి మంచి సంబంధమే దొరికింది. వాళ్లిద్దరికన్నా తను యింకా అందగత్తె. వాళ్లిద్దరూ ఎప్పుడూ తన అందానికి అసూయపడుతుండే వాళ్ళు. అటువంటిది వాళ్ళకే అంత మంచి సంబంధం దొరికినప్పుడు తనకి అంతకన్నా మంచి సంబంధం దొరుకుతుందని ఆశించింది.

కాని, జరగబోతున్నది ఏమిటి? నిజంగా, ఆ బట్టలషాపులో పనిచేసే అబ్బాయేగాని తనని పెళ్లి చేసికోవడం జరిగితే— తనలాంటి అందగత్తె దొరకడం అతను పూర్వజన్మలో చేసిన పుణ్యమే అయ్యుండాలి. ప్రపంచంలోని ప్రతిదీ డబ్బువల్లే జరుగుతుంది. డబ్బులేని వాడు ఎందుకూ పనికిరాడు. అలాంటిదిఅతన్ని చేసుకొని తను ఏం సుఖపడుతుంది? ఆ చేస్తున్న వుద్యోగం కూడా వూడిపోతే అప్పుడు తమ గతి ఏమవుతుంది? అదేమీ గవర్నమెంటు వుద్యోగంకాదు. షాపు ఓనరుకి కోపంవచ్చినా, పని చేసేవాడికి కోపం వచ్చినా ఉద్యోగం ఎగిరి పోతుంది. అప్పుడు ఆ చిన్న జీతం కూడా రాదు. ఆ జీవితం సుడిగాలిలో దీపంలాంటిది. తను ఊహించుకొన్న జీవితం అది కాదు.

తను కాలేజీలో చదివే రోజులు గుర్తు కొచ్చాయి. తనని అందరూ 'కాలేజీ బ్యూటీ' అని, 'మెరుపు తీగ' అని అంటుంటే తను ఎంతగానో వుప్పొంగిపోయేది. తనని ప్రేమిస్తున్నామంటూ ఎంతమందో వెంటపడేవాళ్లు. కాని పెళ్లి విషయం అడిగేసరికి వెనక్కితప్పు కొనేవాళ్లు అవును— పెళ్ళికి కావల్సింది కట్నాలు కానుకలేగాని, అందచందాలు కావని అప్పట్లో తనకి తెలీదు. బి. ఏ. అయిపోయిన తర్వాత యింకా చేదు నిజాలు చాలాతెలిశాయి. చివరికి తన డిగ్రీ గురించి చెబితే, యీ బట్టలషాపు కుర్రాడు కూడా తనని పెళ్ళి చేసికోడని నాన్నగారు తన 'డిగ్రీ' విషయం వాళ్లకి చెప్పలేదు. నిజంగా ఆడదిగా పుట్టడం వింత యిదో యిప్పుడు అర్థమవుతోంది తనకి. రాధ నవ్వుకుంది- ఆత్మజ్ఞానం పొందిన మహర్షిలాగ!

రాధ గుండె నిండా వూపిరి పీల్చుకొంది. తను అమ్మ చెప్పినట్లు పరిస్థితులతో సర్దు బాటుచేసికోలేదు. ఏదిఏమైనా ఆ సంబంధం చేసికోకూడదు. నాన్నగారు తన్నినా, తిట్టినా సరె...

* * *

రాధ చాప మీద కూర్చుంది.

ఎదురుగా కుర్చీల మీద పెళ్లికొడుకు, పెళ్లికొడుకు తల్లీ, తండ్రీ మరో యిద్దరు ఆడవాళ్లు కూర్చున్నారు.

రాధ తల యెత్తి పెళ్లికొడుకుని చూడ లేదు. చూడాలన్న ఆశగాని, అవసరం గాని లేదనిపించింది.

"అబ్బాయిని చూడమ్మా" అంది పెళ్లి కొడుకు తల్లి.

'చూడనవసరంలేదు' అని చెప్పాలనిపించింది రాధకి. కాని, కోపమంతా దిగమింగుకొని, తల యింకా కిందికి వంచుకొంది.

"మా అమ్మాయికి సిగ్గు ఎక్కువమ్మా. అమ్మాయి అబ్బాయిని చూడనవసరంలేదు. మేము ఎంత చెబితే అంత" అన్నారు రాధ నాన్నగారు.

రాధకి ఏడుపు వచ్చినంత పనయింది. తన పరిస్థితికి తన మీద కోపం వచ్చింది. ఏ దేవుడో, ఏ దేవతో జానపద సినిమాల్లోలాగా వచ్చి తనను ఆదుకోకూడదూ ?

"ఇంక అమ్మాయిని లోపలికి తీసుకెళ్లండమ్మా" అంది పెళ్లికొడుకు తల్లి రాధ కేసి ప్రేమగా చూస్తూ.

రాధ లోపలికి వెళ్లింది.

"అమ్మాయి బంగారు బొమ్మలా వుందమ్మా. అమ్మాయి మాకు బాగా వచ్చింది. మాకు చాల సంతోషంగా వుంది" మళ్లీ పెళ్లికొడుకు తల్లి.

రాధ గుండెల్లో రాయి పడింది.

"దగ్గరలో ముహూర్తం చూసి పెట్టుకొందాం" అన్నాడు పెళ్లికొడుకు తండ్రి.

రాధ నాన్నగారి మనసులో సముద్రమంత ఆనందం. రాధ మనసులో ఆకాశ మంత చీకటి. రంగనాయకమ్మగారి మనసులో రెండూ చోటు చేసుకొన్నాయి.

రాధ కళ్లలోంచి నీళ్లు కారుతున్నాయి. అవి కన్నీళ్లు ! 'నాకీ సంబంధం యిష్టం

"అద్దెగది"

ఎవరది నా గది
తలుపులను తట్టుతున్నది ?
"నేనే"
ఎవరు నువ్వు ?
"ఆకలిని"
ఏంకావాలి నీకు ?
"అతి తక్కువ అద్దెకు
అందమైన ఓ గది"
అయితే వెళ్లు
"ఎక్కడికి ?"
కటిక పేదల కడుపుల్లోకి

— వీరపల్లె వీణావాణి

# సర్దుబాటు

లేదు' అని అరవాలనిపించింది. కానీ, ఏదో శక్తి రాధ గొంతు నొక్కింది. ఆ శక్తికి చాల పేర్లు—బీదరికం, విధి ఎట్సెట్రా – ఎట్సెట్రా.

''ఇంక సంబంధం ఖాయం అయి పోయింది గనుక, ఏ విషయంలోనూ దాపరికం వుండకూడదని నా వుద్దేశ్యం. మా అబ్బాయి గురించి కొన్ని విషయాలు చెబుతాను – అన్నం పెట్టలేని డిగ్రీ గురించి చెప్పుకోవడం కూడా అవమానమని, మా అబ్బాయి తన డిగ్రీ గురించి ఎవ్వరికీ చెప్పవద్దని కచ్చితంగా చెప్పడం వల్ల మీకు యింతవరకూ చెప్పలేదు కాని, యిప్పుడు సమయం వచ్చింది గనుక చెబుతున్నాను. మా అబ్బాయి ఎం. ఏ పాసయ్యాడు. అదీ ఫస్టుక్లాసులో ఉద్యోగం కోసం నానా కష్టాలూ పడ్డాడు. దొరక లేదు. దానికి కారణం రికమండేషన్లు గాని, లంచం కట్టడానికి వేలకి వేలు డబ్బుగాని మా దగ్గర లేకపోవడం మాత్రమే! తనకి తగిన వుద్యోగం దొరకందే చెయ్యననేవాడు. పైసా కట్నం యివ్వకపోయినా, అమ్మాయి కురూపి అయినా, తనకి వుద్యోగం యిప్పిస్తే చాలు—పెళ్లి చేసికొంటా నన్నాడు. బీద యింట్లో పుట్టిన తనకి తన చదువే ఒక సంపద అనుకున్నాడు. తన చదువే తనకి మంచి భవిష్యత్తు నిస్తుందనుకున్నాడు.కాని, అవన్నీ కలలుగానే వుండిపోయాయి. మా పక్కింట్లో వుండే పార్వతీశానికి, ఎదురింట్లో వుండే ఏసుపాదానికి అమ్మాయి నిచ్చినవాళ్లే అష్టకష్టాలు పడి మంచి ఉద్యోగాలు యిప్పించుకొన్నారు. నాలుగుసార్లు బి. ఏ. తప్పిన వాళ్లకి అంత మంచి ఉద్యోగాలు యిప్పించే అత్తమామలు దొరకగా, ఎం. ఏ. ఫస్టుక్లాసులో పాసయిన తనకి యింకా పెద్ద వుద్యోగం యిప్పించే వాళ్లే దొరుకుతారని కలలు కన్నాడు. ఆ కలలు కలలుగానే మిగిలి పోతాయని వాడు ఆ కలల్లోకూడా అనుకోలేదు. కాని, జీవితంలో 'సర్దుబాటు' లేందే లాభం లేదని మేము వాడిని ఒప్పించి ఆ బట్టల షాపులో చేర్పించాము. చివరికి పెళ్లికి కూడా మేము ఒప్పించాము...'' అంటూ చెప్పుకు పోతున్నాడు పెళ్లికొడుకు తండ్రి.

రాధ ఆలోచిస్తోంది ... బీద యింట్లో పుట్టిన తను తన అందమే తనకి సంపద అనుకొంది అలాగే బీద యింట్లో పుట్టిన అతను తన చదువే తనకి సంపద అనుకున్నాడు. మంచి వుద్యోగస్తుడయితే- అతను కురూపి అయినా చేసుకునేందుకు తను యిష్టపడింది. అలాగే, అతను కూడా మంచి వుద్యోగం యిప్పించగలిగితే ఎంత కురూపి అమ్మాయినయినా చేసికోడానికి యిష్టపడ్డాడు. అందులో తన కంటే చాల తక్కువలో వుండే తన పక్కింటి పార్వతికి, ఎదురింటి ఏసురాజ్యానికి మంచి వుద్యోగస్తులే భర్తలుగా దొరికారు గనుక, వాళ్లిద్దరి కంటే ఎంతో అందగత్తె అయిన తనకి యింకా మంచి వుద్యోగస్తుడు భర్తగా దొరుకుతాడనుకొంది అలాగే అతను కూడా బి. ఏ నాలుగుసార్లు తప్పిన అతని పక్కింటి పార్వతీశానికి, ఎదురింటి ఏసుపాదానికి మంచి వుద్యోగాలిప్పించిన అత్తమామలు దొరికి నప్పుడు, వాళ్లకన్నా ఎక్కువ చదివిన తనకి యింకా మంచి వుద్యోగం యిప్పించే వాళ్లు దొరుకుతారని ఆశించాడు. తను తన కలలు 'కలలు' గానే వుండిపోతాయని ఆ కలల్లో కూడా అనుకోలేదు. అలాగే అతనూ తన కలలు 'కలలు'గానే వుండిపోతాయని ఆ కలల్లో కూడా అనుకోలేదు పెద్దవాళ్ల మాటలు విని 'సర్దుబాటు' చేసికొని, బట్టల షాపులో చేరాడు తిండి పెట్టలేని డిగ్రీ గురించి చెప్పుకోవడం అవమాన కరమని అనుకొన్నాడు. డిగ్రీ వుందని చెబితే అంత వరకూ చదువు లేదనుకున్న యీ సంబంధం కూడా చెడిపోతుందని తన తండ్రి దాచాడు. కాని, కొడుకు గొప్పతనాన్ని, దురదృష్టాన్ని కడుపులో దాచుకోలేని పెళ్లికొడుకు తండ్రి యిప్పుడు తన కొడుకు ఎం. ఏ. చదివాడని బయట పెట్టాడు. ఎం. ఏ. చదివిన అల్లుడు దొరికాడనే ఆనందంతో, తన కూతురు కూడా బి ఏ. పాసయిందని తన తండ్రి వాళ్లకి యీ పాటికి చెప్పేసే వుంటాడు.

పెళ్లివాళ్లు వెళ్లిపోయారు. వాళ్లని సాగనంపడానికి రాధ నాన్నగారు బయటికి వెళ్లారు.

రంగనాయకమ్మ లోపలికి వచ్చింది. రాధకి ఆ సంబంధం యిష్టంలేదని నిన్ననే చెప్పింది. ఈ రోజు అబ్బాయిని కన్నెత్తి కూడా చూడలేదు – అంటే అమ్మాయి నిశ్చయంలో మార్పులేదని భయపడింది రంగ

నాయకమ్మ. ఆ సంబంధాన్ని రాధ నాన్నగారు నిశ్చయించేశారు. ఇప్పుడు యిది కాదంటే యింట్లో నరకం ప్రత్యక్షం అవుతుంది. రంగనాయకమ్మ మనసులో దేవుడిని ప్రార్థించుకొంటూ నెమ్మదిగా రాధ భుజం మీద చెయ్యి వేసింది భయంగా.

"నేను కూడా అతని లాగే జీవితంతో సర్దుబాటు చేసికొంటానమ్మా" అంది రాధ.

రంగనాయకమ్మ ఆశ్చర్యంగా కూతురి ముఖంలోకి చూసింది.

రాధ నవ్వుతోంది. ఆ నవ్వులో ఏదో ఆనందం, తృప్తి కనిపించాయి. ☼




**13-8-1982 శుక్రవారం మొదలు**
**19-8-1982 గురువారం వరకు**

★మేషం : బంధువులకు ఏదో మేలుచేయవలసి రావచ్చు. వ్యాపారం భారీ మార్గాన నడిచే మార్గం గల వారం. రచనా విధానం కొందరకు సర్వానుకూలదాయకం. స్త్రీలకు : సుఖ శాంతులు, లబ్ధికి అవకాశం గల వారం.

★వృషభం : కోరి బంధు విరోధం తెచ్చుకోవలసిన పరిస్థితులు ఉంటాయి. అధికార వర్గాన్ని ఒక కంట కనిపెట్టవలసిన పరిస్థితులుంటాయి. ఆదాయంలో కూడా లోపం లేక పోవటం కూడా గమనించగలరు. స్త్రీలకు : విద్యా యోగ్యత, ఉద్యోగానుకూలతకు ఆవకాశంగలదు.

★మిథునం : గ్రహించండి. సర్వవిధాలా ఉత్సాహ పూరితమైన వారం. నాల్గ రకాలా ఆదాయం అంది పుచ్చుకొన్నట్లు సంభవం. ఏకోణంలోనుండి చూచినా ధనానికో, అవకాశాలకో మీకు లోపం కనిపించదు. స్త్రీలకు : స్థిర చరాస్తులను అభివృద్ధి పరచుకొనుటకు, నూతన వస్తు సేకరణకు అవకాశం గల వారం.

★కర్కాటకం : గత కొన్ని వారాలకన్నా అన్నివిధాల మిన్నగా ఉండే వారం. భారీ వ్యాపారంలో అనుకూల అవకాశం ఉన్నది. పత్రికా ప్రకటన యందుగాని, రచనా విధానమందుగాని, మీకు ప్రత్యేక స్థానం లభించే అవకాశం ఉన్నది. స్త్రీలకు : నూతనోత్సాహంతో కార్యసాధనకు అవకాశం గల వారం.

★సింహం : అయిన వారిదో, అధికారులదో ప్రోత్సాహానికో అవకాశం గలవారం. కావలసిన వారు సమయానికి విమ్ముల ఆదుకొనుటకు ఆస్కారం గల వారం. ధనాదాయమున్నది. స్త్రీలకు : విందు వినోదాలు, విలాస యాత్రలు, స్వల్పాదాయం గల వారమే.

★కన్య : స్వజనులతోనో, కుటుంబ సభ్యులతోనో తగదా తంటాలుంటాయి. పోగొట్టుకొన్న వస్తువుల భోగట్టా తెలిసే అవకాశం ఉన్నది. అనవసరంగా ఇతరులతో పేచీలు రాగలవు. స్త్రీలకు : కోరిన వస్తుసేకరణ, ఆదాయం, ఉద్యోగావకాశాలకు అనుకూలతకు తగిన వారంగా గ్రహించాలి.

★తుల : ధర్మాచరణకు అవకాశం గల వారం. కొందరకు రాజకీయంగా సదవకాశాలు ఏర్పడనున్నవి. విలువగల వస్తుసేకరణకు అవకాశాలున్నాయి. స్త్రీలకు : ఆదాయం అధికం కావటం, దూర ప్రాంతాలకు పోయే అవకాశం చాలమంది విషయంలో చెప్పవచ్చు.

★వృశ్చికం : సుఖశాంతులకు, ధనలబ్ధికి, నూతన వ్యాపారానుకూలతకు, రాజకీయంగా, వ్యాపారరీత్యా మేలు చేకూరుటకు అవకాశం గల వారం. స్త్రీలకు : నూతన ఉద్యోగ ప్రయత్నాలు ఫలవంతం కావటం, నూతనోత్సాహం కనిపించటం గమనించనున్నారు. ఆదాయం కూడా అంతో యింతో అధికం కావటం కూడా గ్రహిస్తారు.

★ధనుస్సు : అధికంగా వ్యాపారం జరగటానికి, ఆదాయంలో వృద్ధి కనిపించుటకు, వ్యవసాయ రంగాన అభివృద్ధి కనిసించుటకు అనువైనవారమే. అమూల్య వస్తుసేకరణకు అవకాశం ఉన్నది. — స్త్రీలకు: వృత్తిలో అభివృద్ధి, నూతనంగా కొందరకు చేసే ఉద్యోగంలో ప్రయత్నాలు ఫలించటానికీ అవకాశమున్నది.

★మకరం: దూరప్రాంతాలకు కొందరు ప్రయాణించే ప్రయత్నాలు ఫలిస్తాయి. అన్ని రంగాలలో అభివృద్ధికి పోయే మార్గం ఉన్నది. స్థిరచరాస్తులు పెంపొందే మార్గం గలవారం. స్త్రీలకు : నూతనోత్సాహంతో కార్యానుకూలత సంభవం.

★కుంభం : సంఘంలో పలుకుబడి వృద్ధికావటం, వివిధ రంగాలలో ముఖ్యంగా నాటక, చిత్రరంగాన వికాసం కనిపించటం గమనించనున్నారు. బంధువర్గీయుల తాకిడికి కూడా కొందరి విషయంలో చెప్పవచ్చు. స్త్రీలకు : నూతనంగా ఉద్యోగావకాశం అభివృద్ధికి అనుకూలత గల వారమే.

★మీనం : ఉద్రేకంతోగాని, తొందరపాటుతో గాని, లేని అవకాశాలకు ప్రాకులాటతోగాని, మీ పనులు నెరవేరవు. పరిస్థితులుకూడా విషమిస్తాయి. అందుకే నిదానం ప్రధానం అన్నారు. స్త్రీలకు : అధికంగా రచనా వ్యాసంగంలో, ఉన్నత విద్యాభ్యాస ప్రయత్నాలలో అనుకూలత ఏర్పడగల వారం, గ్రహించాలి.

—విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి




(గత సంచిక తరువాయి)

"సునీ అంటే ?"

"సునందా రోజ్ !" వత్తివత్తి అన్నది సుజాత.

"ఓ. కే. ఓ. కే. ఊ. చెప్పమ్మా పాపా ?"

"సునీ పుట్టినరోజు పండగ. నన్ను వెళ్లనీయకుండా మా అమ్మ దొడ్లో బాదం చెట్టు దగ్గరే కూర్చోపెట్టింది. ఆ రోజంతా అమ్మ ఏడుస్తూనే ఉంది. నేనూ ఏడ్చాను. నిద్రలో లేపి నాన్న నా నోట్లో కేక్ పెట్టాడు. ఊసేశాను. నాన్నంటే నాకు కోపంగా ఉంది. అమ్మంటే కూడా నాకు కోపంగానే ఉంది. నా కొత్త గౌను చింపేసిందిగా మరి. నాన్న అమ్మను కొట్టాడు. అందుకే అమ్మ నా గౌను చింపేసింది అందుకని నాన్నమీదనే నా కోపం అంతాను. అమ్మ నన్ను మళ్ళీ నిద్రలేపి పాలన్నం పెట్టింది. అప్పుడు చెట్టుకింద లేము. ఇంట్లో వున్నాము. మా పుస్సీక్కూడా అన్నం పెట్టింది. పుస్సీ బ్లాక్ అన్నంతిని మూతి నాక్కుంది. నా వళ్ళోవచ్చి కూర్చుంది. అమ్మ నన్ను తీసుకెళ్ళి మంచంమీద పడుకోబెట్టింది పుస్సీ నా వళ్ళో పడుకొంది. అమ్మ వళ్ళో నేను పడుకున్నాను. ఎంత సేపు నిద్రపోయానో తెలియదు. మధ్యలో పెద్దగా అరుపులు వినిపించినై. మెలకువ వచ్చింది. లేచి కూర్చున్నాను. కళ్ళు నులుపుకు చూశాను అమ్మ పరుగెత్తుతూ కనిపించింది. మేరీ ఆంటీ అరుస్తూ అమ్మ వెనకే పరుగెత్తుకొచ్చింది. అమ్మ జుట్టు ఆంటీ పట్టుకుని గుంజుతూ వుంది. అమ్మ చేతిలో బంగారపు గొలుసు వేలాడుతూంది. మెరుస్తూంది. అది సునీ గొలుసు. నాన్న సునీకి తెచ్చి యిచ్చాడు. అమ్మ చెప్పింది అది అసలు నాదేనంట ! నాన్న సునీకి ఇచ్చాడంట ! నాన్న మీద నాకు కసి పుట్టింది. మేరీ ఆంటీ అమ్మా జుట్లు పట్టుకుని పీక్కుంటున్నారు. పుస్సీ బ్రౌనీ పిల్లలు పోట్లాడుకుంటున్నట్టుగా ఉంది. నాకు భయం వేసింది. అంతలో నాన్న పరుగెత్తుకొచ్చాడు. నాన్న అమ్మ రెండు చేతులు విరిచి పట్టుకున్నాడు ఆంటీ తన చీర సగంవిప్పి పవిటకొంగు అమ్మ నోట్లో కుక్కింది. మేరీ ఆంటీ అమ్మ మెడ చుట్టూ చేతులు వేసింది అమ్మ కళ్ళు పొడుచుకు వచ్చాయి. పొడుచుకు వచ్చిన కళ్లు నన్నే చూస్తున్నాయి. అమ్మ కీస్‌మని అరిచింది ! అమ్మ కళ్లు నన్ను చూస్తూ అట్టాగే ఉండి పోయినై. నేను పెద్దగా అరిచాను. రెండుచేతుల్తో కళ్లుమూసుకుని దిండులో తలదూర్చి బోర్లా పడుకున్నాను. అలా ఎంత సేపు పడుకున్నానో తెలియదు. మళ్లీ కళ్లు తెరచి చూసే సరికి మేరీ ఆంటీ నాన్నా ఇద్దరూ కలిసి అమ్మను మోసుకు పోతున్నారు. ఎక్కడికో తీసుకుపోతున్నారు. పక్కమీద లేచి కూర్చున్నాను. అప్పుడే నాన్న నన్ను చూశాడు. నాన్న ముఖం చూస్తే భయం వేసింది. నాన్న కళ్లు అదోలావున్నాయి. గజగజ వణికిపోయాను. కళ్లు మూసుకుని మళ్లీ దిండులో తల దూర్చాను.

అమ్మను వంటగదిలోనుంచి దొడ్లోకి తీసుకెళ్లారు. అమ్మను బాదంచెట్టు కిందకు తీసుకెళ్లారనుకొన్నాను. ఆ రోజంతా అమ్మ బాదంచెట్టు కిందే ఉందిగా. అందుకే మళ్ళీ అమ్మను బాదం చెట్టు దగ్గరికి తీసుకెళ్ళి పడుకోపెట్టారనుకొన్నాను. నాన్నకీ, ఆంటీకి అమ్మను ఇంట్లోకి రానియ్యడం ఇష్టం లేదనుకొన్నాను.

కాసేపటికి నాన్న వచ్చి నా పక్కలో పడుకొన్నాడు. నాకు భయంవేసింది. సర్కస్‌లో పులి తప్పించుకొని వచ్చి నా పక్కలో పడుకొన్నంత భయం వేసింది. తర్వాత నాకేమయిందో నాకు తెలియదు.

ఎప్పుడో ? ఎంతసేపటికో తెలియదు.

మ్యావ్ మ్యావ్ అంటూ పుస్సీ నన్ను లేపింది. దాని మెత్తటి జుట్టు నా బుగ్గలకు ఆని గిలిగింతలు పెట్టింది. కళ్ళు తెరిచి చూశాను. నాన్న పక్కకు తిరిగి పడుకొని ఉన్నాడు. పుస్సీ మంచంమీద నుంచి దూకి తోకఎత్తి ఆడించింది. అట్టా చేసిందంటే అది తన వెంటరమ్మని పిలుస్తుందన్నమాట. మెల్లగా చప్పుడు గాకుండా మంచం దిగాను. పుస్సీ ముందు నడిచింది. దాని వెనకే వెళ్ళాను. పుస్సీ నన్ను బాదం చెట్టు పక్కనున్న బావి దగ్గరకు తీసుకువెళ్ళింది.

బావి దగ్గిరకు వెళ్ళగానే ఒక్క గంతేసి బావి గట్టెక్కింది. పుస్సీ బావిలోకి చూసి అరిచింది. మళ్ళీ నన్ను చూసి అరిచింది. రెండు చేతులు గట్టుమీద ఆనించి బావిగట్టు ఎక్కాను. బావిలోకి చూశాను.

బావిలో అమ్మ పడుకొని ఉంది ! లోపలనుంచి అమ్మ నన్ను పిలుస్తున్నట్టుగా ఉంది "అమ్మా !" అని పెద్దగా పిలిచాను. అమ్మ దగ్గరకు వెళ్ళి పోయాను. ఊపిరి ఆట్టంలేదు ముక్కులోకి గొంతులోకీ నీళ్ళుపోతున్నాయి. నీళ్ళలో మునిగి పోతున్నాను. బావిలో అడుక్కిపోతూన్నాను కాళ్ళూ చేతులు నీటిలో కొట్టుకొంటున్నాయి. ఎట్లావచ్చానో తెలియదు నీటిపైకొచ్చాను. అమ్మ చెయ్యి దొరికింది. అమ్మ చెయ్యి పట్టుకొని పైకి పాకాను. అమ్మ పొట్టమీదకు ఎక్కాను. బావిలో నీళ్ళు వెచ్చగా ఉన్నాయి. కాని అమ్మ వళ్ళు చల్లగా ఐసుగడ్డలా ఉంది. అమ్మ కళ్ళు తెరిచి అట్లాగే చూస్తూంది. బావి అంచుమీద పుస్సీ పెద్దగా ఏడుస్తూవుంది. దాని ఫ్రెండు బ్రౌనీకూడా వచ్చినట్టుంది. రెండు కలిసి గోలగా అరుస్తున్నాయి. ఏడుస్తున్నాయి. నల్లపిల్లీ, చారలపిల్లీ అప్పుడప్పుడూ పోట్లాడుకునేవి. కరచుకునేవి. గీరుకొనేవి. ఇప్పుడు రెండూ కలసి ఏడుస్తున్నాయి. అమ్మకోసం ఏడుస్తున్నాయి. అమ్మను అన్నం పెట్టమని ఏడుస్తున్నాయి. బావిలో ఉందిగా అమ్మ. అన్నం ఎట్లా పెడుతుంది ? మేరి ఆంటీ, నాన్నా కలసి అమ్మను బావిలో పడుకో పెట్టారు. అట్లాయితే అమ్మ చచ్చిపోదూ? అమ్మ చచ్చిపోయిందా ? చావంటే ? చావంటే ఇదేనా ? అమ్మను బిగ్గరగా పిలిచాను. అమ్మమీద బోర్లాపడి అమ్మను వాటేసుకొన్నాను మెత్తగా వుండే అమ్మ వళ్ళు రాయిలా ఉంది. వెచ్చగా వుండే అమ్మ చల్లగా వుంది. పిలిస్తే అమ్మ పలకడంలేదు. అమ్మ చచ్చి పోయింది. పుస్సీ దా ! అమ్మను బతికించు. బ్రౌనీ దా ! అమ్మను బతికించు. అమ్మ లేకపోతే నీకు అన్నం ఎవరు పెడ్తారూ ? పుస్సీరా — బ్రౌనిరా — పుస్సీదా —" సుజాత హృదయ విదారకంగా ఏడుస్తూంది. చిన్నపిల్లలా — పసిపాపలా ఏడుస్తోంది. ఆ ఏడుపుతో గది నిండిపోయింది. ఆనంద నిలయం ఆస్పిటల్ ఆవరణంతా నిండిపోయింది. గుండెలు

**జరిగిన కథ — 24 :** శివప్రసాద్‌కి ఇంతకుముందే పెళ్లయిపోయిందనీ, ఆమె పేరు సునందనీ, పుష్కర స్నానాలకు వెళ్లి కృష్ణానదిలో మునిగిపోయిందనీ, అప్పట్నుంచీ పిచ్చివాడయ్యాడని చెప్తాడు శరత్ సుజాతకు. తనకింకా పెళ్లి కాలేదనికూడా చెప్తాడు. ప్రసాద్‌కి పిచ్చి అని నమ్మించి సుజాతను మద్రాసు తీసుకొచ్చి అసలు పిచ్చిదైన ఆమెకు అసలయిన ట్రీట్‌మెంట్ సాగిస్తుంటాడు శరత్. సుజాత తండ్రిని పిల్చుకురమ్మని శరత్ శివప్రసాద్‌ని పంపుతాడు సుజాత వేష భాషల్లో, హావభావాల్లో రోజాను అనుకరిస్తుంటుంది. క్లినిక్ థెరపీ రూంలో సుజాత బల్లమీద పడుకొనివున్నది. డాక్టర్ రోజా రీడింగ్స్ నోట్ చేసుకొంటూవుంటుంది. డాక్టర్ శరత్‌బాబు సుజాతను హిప్నటైజ్ చేస్తుంటాడు. క్రమంగా సుజాత మస్తిష్కం, వ్యక్తిత్వం శరత్ వశమవుతాయి. శరత్ అడిగే ప్రశ్నలకు సుజాత తండ్రి పరబ్రహ్మరావ్ ఆమె చిన్నతనంలో జరిగిన సంఘటనలు చెప్తుంటాడు. సుజాత, ఆమె తల్లి ఇద్దరూ బావిలో పడి మరణించారని ఆయన చెప్పడంతో 'అబద్ధం' అని అరుస్తుంది సుజాత. హోటల్ గదిలో పరబ్రహ్మరావ్ చెప్పిన సంఘటనలన్నీ అప్పటివరకూ టేప్ ద్వారా వినిపిస్తాడు శరత్. అసలు అప్పుడు ఏం జరిగిందో ఇప్పుడు చెప్తున్న సుజాత కధనాన్ని కూడా టేప్ చేస్తుంటాడు డాక్టర్ శరత్‌బాబు.



తరుక్కుపోయే సుజాత ఏడుపు సముద్రపు హోరు స్పృతి కలుపుతూంది.

"పు.పు.స్సి. దా — దా — అమ్మ — అమ్మను— బతికించవూ — "

"సుజాతా ! సుజాతా !" శరత్ బాబు పిలుస్తున్నాడు. అతడి కంఠం ఉద్వేగంతో వణికి పోతూంది.

మసక మసక చీకటిగా గుబులు గుబులుగా వున్న ఆ గది వాతావరణాన్ని చీల్చుకుంటూ పెద్ద కేక విన్పించింది. కేక ఒక్కటే మూడు గొంతులుగా విన్పించింది ! ఆ వెర్రికేక భయానకంగా విన్పించింది. డాక్టర్ శరత్ బాబు కళ్ళముందే పిడుగులు పడినట్టయి పోయాడు. కాళ్ళూ చేతులూ ఆడలేదు క్షణకాలం తన ఉనికినే మర్చిపోయాడు. కొద్ది క్షణాల్లోనే తేరుకొన్నాడు. సర్వశక్తులను కూడతీసుకొన్నాడు. కుర్చీలోనుంచి విరుచుకొని నేలమీద పడిపోయిన డాక్టర్ రోజా దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. అప్పుడతనికి అర్ధమైంది. కేకలో మొదటి గొంతు సుజాతదని ! ఆ వెర్రికేకలో రెండో గొంతు డాక్టర్ రోజాదని ! మరి ఆ మూడో గొంతు ఎవరిది ?

శరత్ బాబు రోజా ముందు మోకాళ్ళమీద కూర్చొని గది కలయచూశాడు.

ఆ గదిలో ఉన్న మిగతా ఇద్దరూ నర్సు సుభద్ర, శివప్రసాదు. కొండరాయిలో చెక్కిన బొమ్మల్లా గోడలకు ఆనుకొని నిలబడివున్నారు. తలుపు దగ్గర వార్డ్ బాయ్ కొండపల్లి బొమ్మలా నిలబడివున్నాడు. రెండ్రో కుర్రాడు బయట ఆవరణలో గేటుకేసి పరుగెత్తుతున్నాడు.

సుభద్ర కళ్ళు ఏడ్చి ఏడ్చి ఉబ్బిపోయివున్నాయి. శివప్రసాదు చంపలమీద జారిన కన్నీరు ఇంకా ఆరలేదు.

"నర్స్ ! హరీ అప్ ! ప్రసాద్ ఇలా రా ?" డాక్టర్ శరత్ బాబు ఆజ్ఞాపించాడు.

సుభద్ర, డాక్టర్ శరత్ బాబు కలిసి రోజాను లేపి కూర్చోపెట్టారు. ఆమె కళ్ళు తెరచి బాస్ కేసి చూసింది. ఆ చూపులు అర్ధరహితంగా ఉన్నాయి.

"ప్రసాద్ ! నువ్వు మీ మామగారికి — అదే పరబ్రహ్మరావుకు ఫోన్ చేసి వెంటనే రమ్మను టేక్సీ వేసుకుని రమ్మను !" అని శివప్రసాద్ కి చెప్పి శరత్ బాబు మళ్లీ సుజాత దగ్గరకొచ్చాడు

ఇంకా కుమిలి కుమిలి ఏడుస్తోనేవుంది సుజాత

"పాపా ! ఎందుకమ్మా ఏడుస్తావ్ ? మీ అమ్మ ఎప్పుడో చచ్చిపోయింది. నువ్వు ఏడవటం మీఅమ్మకు ఇష్టం ఉండదు. నువ్వు కొత్త బట్టలు వేసుకుని నగలు వేసుకొని ఆడుతూ పాడుతూ హాయిగా తిర గాలని మీ అమ్మకుంటుంది. కాని నువ్వేమో ఏడు స్తున్నావ్ ! తప్పుకాదూ. అమ్మకు ఇష్టంలేని పని చేయకూడదు."

"అయితే నేనేడవను. ఏడుపు మానేశాను. ఇప్పుడు అమ్మకు ఇష్టంగా ఉందా ?"

"చాలా సంతోషంగా ఉంది. విను పాపా. వింటున్నావుగా. నిన్ను బావిలోనుంచి బయటకు తీశారు. అమ్మ చచ్చిపోయిందని నీకు తెలిసిపోయింది. నువ్వు మెలమెల్లగా పెద్దదానివయిపోతూన్నావు. మీ నాన్నా నువ్వూ ఇంకో ఊరెళ్లిపోయారు. అప్ప ట్నుంచి నీకు మేరీ ఆంటీ, సునీత కన్పించ లేదు. మీ నాన్న నీ హైస్కూలు చదువయిపోయాక కాలేజీలో చేర్పించాడు. తర్వాత పెళ్లి చేశాడు . ..." డాక్టర్ శరత్ బాబు సుజాతకు చెప్పకుపోతున్నాడు.

ఈలోపల ప్రసాదు ఆఫీసురూంలోంచి ఉడ్ లాండ్ హోటలుకు ఫోన్ చేశాడు.

"ఉడ్‌లాండ్స్ !" ఆపరేటర్ గొంతు పలికింది.

"రూం నంబరు 301 ఇవ్వండి !" అడిగాడు ప్రసాద్ ఒక నిముషం తర్వాత "సారీసార్ రూంలో రెస్పాన్సు లేదు. ఫోన్ ఎవరూ ఎత్తడంలేదు !" అంది ఆపరేటర్.

"రిసెప్సన్ ఇవ్వండి !" అన్నాడు ప్రసాదు.

రిసెప్సనిష్టు లైనులోకి వచ్చాడు. 301 గది తాళంచెవి కీ బోర్డుమీదే ఉందని, ఒక గంట క్రితమే ఆ పెద్దాయనకి ఇచ్చి బయటికి వెళ్ళాడని చెప్పాడు. శివప్రసాదు హడావుడిగా తిరిగి థెరపీ రూంలోకి పరుగెత్తు కొచ్చాడు. స్ప్రింగ్ డోర్ తెరచుకొని గది మధ్యదాకా వచ్చి ఆగిపోయాడు. అతడి కళ్ళల్లో కోటి దీపాలు వెలిగాయి —

"అడుగో నీ భర్త శివప్రసాద్ ! నిన్ను మనసారా ప్రేమిస్తున్న నీ భర్త. నీకోసం నిద్రాహారాలు మాని పరితపించుపోతూన్నాడు. నీకోసం తన జీవిత సుఖాన్నే వదులుకోవడానికి సిద్ధమయాడు జన్యు శాస్త్ర ప్రతిభావంతుడయిన నీ భర్త నీకోసం అంతర్జాతీయ కీర్తినే వదులుకోవటానికి సంసిద్ధు డయాడు. గత పది నెలలుగా నరకబాధను అనుభ వించాడు. మానసిక సంక్షోభంలో తల మునకలై పోయాడు. తన మేధాసంపత్తినంతా ఒత్తిచేసి ప్రేమజ్యోతిని వెలిగించుకొన్నాడు నీకోసం నిరీక్షిస్తు న్నాడు. ." శరత్ బాబు కంఠం గంభీరంగా సాగిపోతూంది అతని కంఠధ్వని తరంగాలు గదంతా వ్యాపించిపోతూన్నాయి

సుజాత మెల్లగా బల్లమీదనుంచి దిగింది· అలనల్లన గోదారిలా నడిచింది. ఉదయ భాస్కరుడిని చూసి అప్పడే వికశించిన పద్మంలా ఉన్న ఆమె వదనం నూతన కాంతుల్ని వెదజల్లుతూంది. చంద్రుడి రాకతో విచ్చుకొంటున్న నల్లకలవల్లా వున్నాయి ఆమె కనుపాపలు. నిర్మలమైన ఆమె చూపులు ఎదురుగా నిలబడివున్న శివప్రసాదు మీద దృఢంగా నిలిచి ఉన్నాయి. హఠాత్తుగా ఆమె నడకలో వేగం హెచ్చింది. కొండచెరియల్లోనుంచి మైదానంలోకి పరుగులు తీస్తున్న శలయేరులా సుజాత భర్తను సమీపించింది. పందిరిగుంజకు అల్లుకొన్న గుమ్మడితీగలా అతడ్ని చుట్టుకుపోయింది. భర్త బాహాబంధనంలో ఇమిడిపోయింది

— కాలం నిలిచిపోయింది. ఎంతసేపో ఏమో?

"ప్రసాద్ ? మీ మామగారెక్కడ ?"

సెన్సార్ కత్తెరలా శరత్ బాబు మాట వాళ్ళిద్దరి మధ్యకొచ్చి నిలిచింది ! ప్రసాదు సుజాతను వదలి ఒక అడుగు ముందుకు వేశాడు.

సుజాత చెక్కిళ్ళమీద ఎర్రగులాబీలు పూశాయి. అలవోకగా తలవంచుకొని శరత్ బాబును చూసింది సుజాత.









"థాంక్యూ డాక్టర్ !" సుజాత పెదవులపై మందహాసం చిందింది.

"మీరు కృతజ్ఞతలు చెప్పాల్సిన అవసరమేమీ లేదు. నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తించాను. డాక్టరుగా, మీ శ్రీవారి స్నేహితుడిగా" నిర్లిప్తంగా అన్నాడు శరత్‌బాబు. ఏదో పోగొట్టుకున్నట్టుగా సుజాతకేసి చూశాడు.

"చేతులెత్తి నమస్కరించడం కంటే యీ నిరుపేద చెల్లెలు అన్నయ్యకు ఇంకేమివ్వగలదు !" చేతులు జోడించి శరత్‌బాబుకు పాదభివందనం చేసింది సుజాత.

"సుజాతా ! ఐ హేటిట్ ! చెల్లెలు అన్నపాదాల మీదపడటం బూర్జువా సంస్కారం. లే !" అంటూ శరత్‌బాబు సుజాతను పట్టుకొని లేవదీశాడు.

"ఏదీ ? ప్రశాంతమైన నీ మొహం చూపించు నాకు. కళకళలాడే నీ ముఖం నన్ను చూడనీయ్. ఆనందజ్యోతులు వెలిగే చెల్లెలి కళ్ళల్లోకి అన్నయ్యను ఓ సారి మనసారా, తృప్తిగా చూసుకోనీయి !" శరత్‌బాబు కంఠం ఉద్వేగంతో పూడిపోయింది. కళ్ళు ఆర్ద్రమైనాయి. సజల నేత్రాలతో సుజాతను నిండుగా చూస్తూ, లిప్తకాలం లోకాన్నే మరిచి పోయాడు డాక్టర్ శరత్‌బాబు.

"పరబ్రహ్మరావు — అదేలే మా మామగారు హోటల్లో లేడట ! గంట క్రితం బయటికి వెళ్ళాడట!"

శరత్‌బాబు తపోభంగమయినట్టు ప్రసాదుకేసి చూశాడు.

"బహుశః ఇక్కడికే వస్తున్నాడేమో? పోతే-" శరత్‌బాబు మాటమధ్యలోనే ఆగిపోయింది! వగర్చు తొంటూ పరుగెత్తుకొంటూ వచ్చిన వార్డ్‌బాయ్‌కేసి చూశాడు.

"సార్ ! సార్ ! సముద్రంలో పడ్డాడు. సముద్రం లోపలికి లాగేసింది !" రొప్పుతూ చెప్పాడు వచ్రాడు.

"ఎవర్ని ?" ఆదుర్దా, చిరాకు మిళితమై వున్నాయి శరత్‌బాబు కంఠంలో.

"ఆయనే సారూ ! ఇంతకుముందు ఈ తలుపు పక్కనే నిలబడ్డాడే ఆయనే ! ఆ ముసలాయనే. లోపలకు వెళ్తానంటే అయ్యగారు పనిలో ఉన్నారని, చెప్పాను. లోపలకు వెళ్ళనీయలేదు. అరగంటసేపు

## మనసు కధ

యీ తలుపు దగ్గరే నిలబడ్డాడు. లోపలనుంచి వినపడుతున్న మాటలన్నీ వింటూ ఇదిగో ఇక్కడే నిలబడ్డాడు. గదిలో పెద్దగా కేకలు వినిపించినయ్ చూడండి. అప్పుడు యీ ముసలాయన కూడా పెద్దగా గావుకేక పెట్టాడు ! జుట్టు పీక్కుంటూ పరుగుతీశాడు ! అప్పుడనుకొన్నాను. ఆయనెవరో మన పేషంటేనని ! వెంటబడ్డాను. గేటు దాటి బీచి రోడ్డెక్కాడు. ఇసుకలో పరుగుతీసి, నేరుగా సముద్రంలోకి నడిచాడు. నేను నీళ్ళ దగ్గరకి వెళ్ళేసరికి —" వార్డ్‌బాయ్ గుక్కతిప్పుకోవడానికా అన్నట్టు ఆగిపోయాడు.

సుజాతా, డాక్టర్ రోజా, శివప్రసాదూ, డాక్టర్ శరత్‌బాబూ — అంతా నిశ్చేష్టులయి వార్డ్‌బాయ్‌కేసి చూస్తూ అలాగే ఉండిపోయారు. నర్సు సుభద్ర మాత్రం చిరాకు పరాకులుగా వింటూన్నదల్లా ఒక అడుగు ముందుకువేసి, వార్డ్‌బాయితో "ఆమా ! ఆ పెద్దాయన మన పేషంట్‌దా అని ఎప్పిడి ప్రూఫ్ అబ్బా ! " అన్నది.

"యూ — కీప్ క్వైట్ !" నర్సును కసిరాడు శరత్‌బాబు.

"నేను నీళ్ళ దగ్గరకెళ్ళేసరికి" వార్డ్‌బాయ్ ఊపిరి పీల్చుకొని మళ్ళీ అందుకొన్నాడు. "ఆ పెద్దాయన్ను అలలు లోపలకు లాగేసుకొన్నాయ్ !"

## 30

మద్రాసు పోర్టులో సైక్లోన్ రాకకు సూచనగా రెడ్‌లైట్స్ వెలుగుతున్నాయి. బంగాళాఖాతంలో మూడువందల కిలోమీటర్ల దూరాన వాయుగుండం ఏర్పడింది. గంటకు తొంభై కిలోమీటర్ల వేగంతో వానగాలులు వీచే సూచనలున్నాయి. రాగల ఇరవై నాలుగంటల్లో వాయుగుండం కేంద్రం మద్రాసు — కడలూర్‌ల మధ్య తీరం దాటవచ్చు — రేడియోలో ప్రత్యేక ప్రసారాలుచేసి, తీరప్రాంత ప్రజలకు హెచ్చరికలు చేయబడ్డాయి.

రాత్రి పదకొండు దాటింది. అడయార్ బీచ్‌లో పెట్రొమాక్స్ లైట్లు, టార్చిలైట్లు వేసుకొని ఆనందనిలయం స్టాఫూ, పనివాళ్ళు వెదుకు తున్నారు. శరత్‌బాబూ, శివప్రసాదు పక్క పక్కనే నడుస్తున్నారు. వాళ్ళకు కాస్త దూరంలో డాక్టర్ రోజా, సుజాతా గాలికి ఎగిరిపోతూన్న చీర కుచ్చిళ్ళు పట్టుకొని, పైటలు నడుం చుట్టూ దోపుకొని ఇసుకలో కాళ్ళకు చెప్పులు లేకుండా నడుస్తున్నారు సముద్రం భయంకరంగా ఘోష పెడుతోంది. తాటి చెట్టంత ప్రమాణాన అలలు లేచి నురుగులు కక్కుతూ విరిగిపడుతున్నాయి. బ్యాటరీ లైట్ కాంతి ఒడ్డుకు తాకి విరిగిపోతున్న అలల నురగల మీద ప్రతిఫలిస్తోంది. అందరి కళ్ళూ విరుగుతూన్న అలలమీదే కేంద్రీకరించబడివున్నాయి. ప్రతి అలకూ ఓ శవం గొట్టుకొస్తున్నట్టు వాళ్ళకు భ్రాంతి కలుగుతూంది ! కళ్ళు చీల్చుకొని వెతుకుతున్నారు.

"ఇంతకీ ఆయన పరబ్రహ్మరావేనంటావా ?" ప్రసాదు పక్కనే నడుస్తున్న శరత్‌బాబును అడిగాడు.

"కాకపోతే మరీ మంచిది !" ముభావంగా తూచినట్టు అన్నాడు శరత్‌బాబు.

"ఆ ముసలాడు పరి స్కౌండ్రల్ ! ఇలా చస్తాడంటే నాకు నమ్మకంలేదు ! ఇలా చచ్చేవాడయితే ఎప్పుడో చచ్చి ఉండాల్సింది !" కసిగా అన్నాడు ప్రసాద్.

"మెల్లగా ? వెనక సుజాత వింటుంది !"

శివప్రసాదు క్రరున వెనక్కు తిరిగి ఓసారి చూశాడు.

"వినపడదు ! వాళ్ళు చాలా దూరంలోనే వున్నారు. ఆ ముసలాడు — "

"ఏం ఇప్పుడు ఇలా చావకూడదనేమీ లేదుగా?"

"ఏమో ? మీ హాస్పటల్‌కు వచ్చే పిచ్చివాడెవడయినా కావొచ్చుగా ?"

"కావొచ్చు!" కొట్టి విరిచినట్లు అన్నాడు శరత్‌బాబు.

"పరబ్రహ్మరావు యీపాటికి హౌరా మెయిల్ ఎక్కుంటాడు. ఆముదాలవలసలో ఆ వెధవముండతో కాపురం వెలగొపెడుతున్నాడు. వాడు ఆత్మహత్య చేసుకొంటాడంటే నేను ఒక్కనాటికి నమ్మను !"

"ఇప్పుడు మీ మామ కనిపిస్తే నువ్వే చంపేట్టున్నావేంరోయ్ !" వచ్చే నవ్వాపుకొంటూ పెదవి నొక్కుకొన్నాడు శరత్‌బాబు.

"మామ ? ఏంట్రా పెద్ద జోకులేస్తున్నావ్. వాడు నాకు మామట్రా ? వాడి పేరు తలుచుకొంటూంటేనే నాకు—" ఆవేశంతో ఊగిపోతున్నాడు ప్రసాదు.

"నీ భార్య తండ్రి నీకు మామ కాక ఏమవుతాడ్రా? పిచ్చి ఫూల్!" శరత్‌బాబు స్నేహితుడ్ని కావాలనే ఏడిపిస్తున్నాడు. ప్రసాదులో రగులుతున్న అగ్నిగుండపు పొగలు శగలు అలాగయినా కొంతవరకు బయటపడి చల్లారిపోతాయని ఆశించాడు శరత్‌బాబు.

"ఆ పరబెమ్మిగాడ్ని ఇలా చావనివ్వకూడదు. కోర్టుకు లాగి ఉరిశిక్ష వేయించాలి!"

"నీళ్ళలో మునిగి చావాల్సి ఉన్నవాడ్ని ఉరి తీయలేము. ఉరి తీయబడి చావవలసినవాడ్ని నీటిలో ముంచి చంపలేము ఇంగ్లీషులో ఇదో సామితె!"

"సామతెల మాటకేంగాని నాకీ సంగతి చెప్పు!" శరత్‌బాబు ముందుకొచ్చి ఆగాడు.

"ఏమిటదీ?" ఆగి శరత్‌బాబు ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వు డాక్టర్ రోజాను ప్రేమిస్తున్నావా?"

"ఇదే ప్రశ్న నీ భార్య నన్నోసారి అడిగింది. తేడా అల్లా అప్పుడామెకు మనస్థిమితం లేదు. నీకిప్పుడు —"

"మస్థిమితం లేదంటావ్?" అంటూ ముందుకు నడిచాడు ప్రసాద్.

"ఛా ఛా! అలా ఎందుకంటాను?" శరత్‌బాబు స్నేహితుడి పక్కనే నడవసాగాడు. ఒడ్డుకు తాకుతున్న అలలకేసి చూస్తూ నడుస్తున్నారు.

"డాక్టర్ రోజా నిన్ను ప్రేమిస్తున్నదిరా శరత్!"

"నీకెలా తెలుసు?"

"ఆమె చెప్పింది!"

## మనిషి

పంచేంద్రియాల్ని కాదు
ప్రపంచాన్ని
రాయిలా నిలిపేవాడు
రుషి
రాయిలా పడివున్న
ప్రపంచాన్ని
అహల్యగా మలచేవాడు
మనిషి

డా॥ సి. నారాయణ రెడ్డి

"ఏమని?"

"నిన్ను — అంటే విన్నేరా ఫూల్. నిన్ను ప్రేమిస్తున్నానని చెప్పింది!"

"నాతో ఎందుకు చెప్పలేదు?"

"అబ్బ! ఏం ప్రశ్న వేశాడండి! ఏం తెలివి? ఏం తెలివి? మళ్ళీ చూడబోతే పెద్ద డాక్టర్. గ్రేట్ సైకియాట్రిస్ట్. ప్రఖ్యాత మానసిక విజ్ఞాన శాస్త్రవేత్త మరి! హిప్నటైజ్ చేసి అడగకపోయావా? ఆమె మనసులో ఏముందో?"

"ఒరేయ్! చాలా ఘోరంగా మాట్లాడుతున్నావ్. నా వృత్తిని, విజ్ఞానాన్ని నా స్వార్థం కోసం వినియోగించుకోమంటావా? అది క్షుద్ర విద్యలు నేర్చినవాడు చేసేపని!"

"మరేమిట్రా శరత్! మహామేధావివే కావొచ్చు నువ్వు. ప్రేమ విషయాల్లో మాత్రం మంద బుద్ధివిరా. ఏ ఆడపిల్లయినా నిన్ను ప్రేమించానని ముందే మగాడితో చెప్తుందటరా? ఆమె ఇచ్చే సూచనలను మగవాడు అందుకొని చొరవ తీసుకోవాలి. తెలిసిందా?"

"మరి రోజా నాకు అలాటి సూచనలు ఏమీ అందివ్వనుకూడా లేదే?"

"ఓరేయ్! నిజంగా ఫూల్‌వురా. నువ్వు ఆమెకు బాసువు. నీ ముందు రోజా ప్రేమ చూపులు చూసి, వేడి నిట్టూర్పులు విడవగలదా? ఒకవేళ నీ మనసు తెలుసుకోకుండా తెగించి చెప్పిందనుకో. ఒకవేళ ఆమె అంటే నీ కిష్టంలేదనుకో. అప్పుడామె పరిస్థితి ఎంత చులకనైపోతుంది? అందులో తను ప్రేమించేవాడి దృష్టిలో తేలిక అయిపోవడానికి ఏ ఆడదీ ఒప్పుకోదు, చావనైనా చస్తుందిగాని."

"ప్రసాద్! ఈ సైన్సు ఎప్పుడు చదువుకొన్నావురా?" డాక్టర్ శరత్‌బాబుకు గుండెల్లో గూడు కట్టుకొన్న చీకట్లేవో తొలిగిపోతూన్నట్టు ఉన్నాయి.

"ఇటీజ్ ఎ సైన్సాఫ్ లౌవ్! ఇది వొకచోట చదువుకుంటే వచ్చేదికాదు. ఇది మన మనస్సుల్లోనే నిక్షిప్తమయి వుంటుంది. మన మనస్సును మనం చదువుకోవాలి. తర్వాత ఎదటి మనసును తెలుసుకోవాలి. ఎందరో వ్యాధిగ్రస్తుల మనసులు చదివి చదివీ నీ మనసు మొద్దుబారిపోయింది. నీ మనసును

నువ్వు తెలుసుకునే స్థితిలో లేవు. నువ్వు డాక్టర్ రోజాను ప్రేమిస్తున్నావు. కాని —''

''ప్రసాద్! ఏమిట్రా నాకు ఆటోసజిషన్ చేసేస్తున్నావా ?'' నవ్వుతూ అన్నాడు డాక్టర్ శరత్‌బాబు.

''నీకు సైకాలజీ, సైకోథెరపీ భాష తప్ప మరొకటి అర్థం కాదు! రోజా నిన్ను ప్రేమిస్తున్నది. రోజాను నువ్వు ప్రేమిస్తున్నావ్. నథింగ్ మోర్. నథింగ్ లెస్. ఇటీజ్ దట్ సింపుల్ !''

శరత్‌బాబు తనకు తెలియకుండానే ప్రసాదు చెయ్యి పట్టుకొని గట్టిగా నొక్కాడు.

''యూ ఆర్ రైట్! అబ్ సల్యూట్లీ రైట్. నేను రోజాను ప్రేమిస్తున్నాను !''

ప్రసాద్ ఆనందానికి ఎల్లలు లేవు. ఎదురుగా ఉన్న సముద్రాన్ని దాటిపోయింది.

''ముహూర్తం వారం రోజుల్లోపునే పెట్టేస్తాను. మీ పెళ్ళి మా దంపతుల చేతులమీదుగానే జరగాలి.''

''తొందరేముంది? సుజాతా నువ్వూ న్యూయార్క్ నుంచి తిరిగొచ్చాక మా పెళ్ళిని గురించి ఆలోచిద్దాం !''

న్యూయార్క్‌లో అంతర్జాతీయ సంస్థ ఆధిపత్యాన జరుగుతున్న అంతర్జాతీయ జన్యు శాస్త్రజ్ఞుల కాన్ఫరెన్సుకు శివప్రసాదు భారతదేశం తరఫున ప్రతినిధిగా ఎన్నిక చేయబడ్డాడని నాలుగు రోజుల్నాడే కేబుల్ వచ్చింది. పది రోజుల్లో న్యూయార్కుకు బయలుదేరవలసి ఉంది. సుజాతను కూడా తీసుకొని అమెరికా వెళ్ళడానికి అంతకుముందే శరత్‌బాబుతో చర్చించి నిర్ణయించుకొన్నాడు. ఆమె మానసిక రుగ్మత నయం కాకపోతే అమెరికాలో ప్రయత్నించాలనీ, ఇక్కడే శరత్‌బాబే నయం చేయగలిగితే ఆమె మానసిక వుల్లాసం కోసమైనా సుజాతను తనతో న్యూయార్క్ తీసుకెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు ప్రసాదు.

''శరత్ అలాక్కాదురా ? నా యీ ఒక్క కోర్కె మన్నించరా. నా కోసం ఎంతో చేశావ్. ఇదొక్కటీ నన్ను చేయనియ్. ఈ నెల ఇరవైన మా ప్రయాణం, ఇంకా పదిహేడు రోజులుంది. వచ్చే వారంలో మీ పెళ్ళయిపోవాలి. మీ ఇద్దరికి హనీమూన్— మాకు అఫీషియల్ ట్రిప్. నాలుగు టికెట్లూ నేను





కొంటాను. అమెరికాలో మీ హనీమూన్ ఖర్చంతా నాదే !'' పరవశుడై చెప్పుకుపోతూన్నాడు ప్రసాద్ ఇసుకలో నడుస్తూ.

''ఓరేయ్ ప్రసాద్ ! ఈ వచ్చింది మీ మామే అయితే అప్పటికి — అదే నువ్వు పెళ్ళి చేయిస్తానంటున్నావే అప్పటికి మీ మామగారి దినంకూడా వెళ్ళిపోదురా ?''

''లండి కొడుకు! చచ్చికూడా సాధిస్తున్నాడేంరా వీడు ?''

''సార్ ! డాక్టర్ సార్ ! ఇదిగో ఇక్కడ శవం ! శవం గొట్టుకొచ్చింది !!'' వార్డ్‌బాయ్ బిగ్గరగా అరిచాడు.

ఐదు నిముషాల్లో సముద్రపొడ్డున ఆ శవం కోసమే గాలిస్తున్న వాళ్ళంతా చుట్టూ చేరారు. పెట్రొమాక్స్ లైట్ రివ్వున వీస్తున్న గాలికి గప్ గప్‌మని ఓసారి అని ఆరిపోయింది. వార్డ్‌బాయిస్ చేతుల్లో ఉన్న రెండు బ్యాటరీ లైట్ల వెలుగులో— జువ్వలపాలెం మాధ్యమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుడుగా రిటైరయిన శ్రీమాన్ లేటు పరబ్రహ్మరావుగారు కారుమేఘాలు కమ్ముకొన్న ఆకాశానికేసి గుడ్లు మిటకరించుకొని చూస్తూ అడయార్ బీచ్ ఇసుకలో నిశ్చింతగా పడుకొని ఉన్నాడు ! ముందుకు తోసుకువస్తున్న సుజాతను ప్రసాద్ గట్టిగా పట్టుకొన్నాడు.

డాక్టర్ రోజా శరత్‌బాబును తోసుకొని ముందుకు వచ్చింది. ఉప్పనీళ్ళు తాగి ఉబ్బివున్న శవంమీదకు వంగిచూసింది !

''అంకుల్ !!!'' డాక్టర్ రోజా ఆర్తనాదం విడిచిన శబ్దతరాంగాలు, వుద్వేత్తుగా ఎగిరెగిరి పడుతూన్న తుఫాను నాటి సముద్రపు అలలుమీదగా దేశ దేశాంతరాలకు ఖండ ఖండాంతరాలకు వ్యాపించాయి.

''సునీ !'' ఇసుకలో కూరుకుపోతూన్న సునందారోస్‌ను సుజాత పట్టుకొన్నది.

కారుమేఘాలు అలుముకొన్న ఆకాశం ఒక్కసారిగా వెలిగిపోయింది. ఉరుముల ఢమఢమా రావాలకు అంతలావు ఉప్పు సముద్రమూ ఎగిరెగిరి పడింది !

భూదేవి పగిలి దారి ఇచ్చినట్టు కాళ్ళకింద ఇసుకులోకి కూరుకుపోతూ వరిగిపోతూన్న డాక్టర్ రోజాను పట్టుకొన్నాడు శరత్‌బాబు. ఆమెను గుండెలకు హత్తుకొంటూ అడుగుతీసి అడుగు వేశాడు. ఆ కాళ రాత్రి, గాలివానా ముఖాన్ని వీచి వీచి కొడుతుండగా శరత్‌బాబు భుజంమీద వాలిపోయి అడయార్ ఇసుకల్లోనుంచి ఆనంద విలయం క్లినిక్‌లోకి మంత్రముగ్ధలా నడిచింది డాక్టర్ రోజా.

(అయిపోయింది) *

## కోడిగ్రుడ్డుకి టీకాలు !

గ్రుడ్డు పగిలి కోడిపిల్ల బయటికి రాకముందే — కోడిపిల్లకు టీకా మందు ఎక్కించటం సాధ్యమని అమెరికన్ శాస్త్రజ్ఞులు నిరూపించారు కోడిగ్రుడ్డు పెంకు గుండా గ్రుడ్డు లోపలి పిల్లకి ఈ మందు ఎక్కించటం ద్వారా కోడిపిల్లలు బాల్యారిష్టాలకు తట్టుకొనేట్లు చేయవచ్చునని అమెరికా ప్రభుత్వ వెటర్నరి మెడికల్ ఆఫీసరు జగదేవ్ ఎం. శర్మ వెల్లడించారు.

''దీని ఫలితాలు మాకు ఆశ్చర్యం కలిగించాయి. గ్రుడ్లు పొదుగబడి, పిల్ల బయటికి వచ్చేటప్పటికి, ట్యూమర్ వ్యాధి కలిగించే సూక్ష్మక్రిములు దాన్ని సోకే ప్రమాదం ఉన్నది. ఇంతవరకు కోడిపిల్ల గ్రుడ్డు నుంచి వెలికి వచ్చిన తరువాత ఈ టీకా మందు ఇవ్వటం జరుగుతున్నది'' అని శ్రీ శర్మ చెప్పారు.

అండంలోని పిల్లకు టీకామందు వెయ్యాలంటే, కోడిగ్రుడ్డు పెంకుకి ఒక సూక్ష్మ రంధ్రం చేస్తారు. ఆ రంధ్రంగుండా సూది గ్రుచ్చి మందు ఎక్కిస్తారు. తరువాత పారాఫిన్ అనే ఒక జిగురు పదార్థంతో ఆ రంధ్రాన్ని మూసి వేస్తారు. ఒకవేళ రంధ్రాన్ని మూయకపోయినా ప్రమాదం రాదని తేలింది. కోడిపిల్ల గ్రుడ్డు నుంచి వెలికివచ్చిన తరువాత ఇంజక్షన్‌ద్వారాగానీ గాలి చికిత్సద్వారాగాని సూక్ష్మక్రిములు సోకేట్లు చేసి, గ్రుడ్డులో ఉండగా వేసిన టీకామందు పాటవాన్ని పరీక్షిస్తారు. ఎనిమిది రోజులదాకా ఈ పరీక్షలు చేస్తారని శ్రీ శర్మ చెప్పారు.

గ్రుడ్డును పొదగవేసిన తరువాత 18 వ రోజున ఈ టీకామందు వేసినట్లయితే ఫలితాలు సంతృప్తికరంగా ఉంటాయని ఆయన చెప్పారు.

# న్యూట్రముల్ 'మొనగాడ'వండి

# బలానికి దారాసింగ్ చెప్పే పాఠాలు

గట్టితనం పొందే మార్గంలో
న్యూట్రముల్ మీకు సహాయం
చేయనివ్వండి- ఆరోగ్యంగా,
మీరు చేసేవన్నీ గొప్పగా
కనిపించేలా, గొప్పగా చేసేలా
కూడా. న్యూట్రముల్
మొనగాడవడం అంటే అదేమరి.






daCunha/GCM/69/82/TL

అమూల్ వారి
న్యూట్రముల్

అమ్మకందారులు :
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్, గుజరాత్.



# ఆఫీసరు ఆదర్శరావు

కొంతలపల్లి సీతారామారావు



ఆదర్శరావు జీవితంలో అదొక ముఖ్యమైన రోజు. తనతెలివితేటలతో కాంపిటేటివ్ ఎగ్జామినేషన్స్‌లో డైరెక్టుగా ఆఫీసరుగా సెలెక్ట్ అయి డ్యూటీలో చేరిన రోజు.

ఆదర్శరావుకు కొన్ని నిశ్చితాభిప్రాయాలున్నాయి. ఎవరు ఏ పని చేసినా హ్యూమానిటేరియన్ టచ్ ఉండాలంటాడు. అలాగే తను క్రొత్తగా ప్రవేశించే ఉద్యోగంలో ఏ రకంగా ఉండాలో ముందే నిర్ణయం చేసుకొన్నాడు.

తను అందరు ఆఫీసర్లకుమల్లే ఫాల్స్ ప్రిస్టేజి పెట్టుకోడు. తన దగ్గర పని చేసే ప్రతి ఉద్యోగి సంక్షేమం కనుక్కుంటాడు. ఒక మనిషి, తోటి మనిషికి ఎంత సహాయకారిగా ఉండగలడో నిరూపిస్తాడు.

ఈ రకమైన ఆలోచనలతోనే ఆఫీసులోకి అడుగు పెట్టాడు. మొదటగా హెడ్‌క్లర్క్ రంగనాథం రిసీవ్ చేసుకున్నాడు. స్టాఫ్ మెంబర్స్ అందర్నీ వరుసగా పరిచయం చేశాక తన రూమ్ చూపించాడు.

ఆఫీసర్ కూర్చున్న తర్వాత ''సార్ !'' అంటూ కాస్త తగ్గు స్వరంతో పిలిచాడు రంగనాథం.

''తమరు అన్యథా భావించకపోతే, తమరు క్రొత్తవారు గనుక ఆఫీసు పరిస్థితి గురించి చెప్ప వలసిన బాధ్యత నామీద ఉంది. మన ఆఫీసు స్టాఫ్‌లో చాలామంది పనిదొంగలు. మనం ఎంతో స్ట్రిక్టుగా ఉంటే తప్ప వీళ్ళని కంట్రోల్ చేయలేం. తమకు ముందున్న ఆఫీసరుగారు ఎంతో స్ట్రిక్టుగా వున్నా వీళ్లవల్ల మనకు హెడ్‌ఆఫీసునుంచి రిమార్కు వస్తుండేది.''

చిరునవ్వు తలఎత్తాడు ఆదర్శరావు. ''చూడండి మిస్టర్ రంగనాథం! మీతో నేనుకూడా ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను. మీరింకా పరాయి దేశస్థుల పరిపాలనా ప్రభావంనుంచి బయటపడ్డట్లు లేదు. వత్తిడి చేసి, భయపెట్టి చెయించుకోగలిగే పనికంటే, క్రింది ఉద్యోగుల సమస్యలు, కష్టసుఖాలు మనం అర్థంచేసుకుని వారితో వాలంటరీగా ఎన్నోరెట్లు ఎక్కువ పని తీసుకోవచ్చు. అంతేకాదు. ఆఫీసులో నా హోదా గురించి నేను అనవసరమైన ఫార్మాలిటీస్ అబ్జర్వ్‌చేయను! బాసిజమ్ నాఆఫీసులో ఛాయలకు కూడా కన్పడకూడదు. స్టాఫ్‌లో ఎవరికి ఏ సమస్య ఉన్నా నన్ను స్వయంగా కలుసుకొని చెప్పకోవచ్చని అందరికీ ఒక సర్క్యులర్ పంపించండి.'' అంటూ తన భావ పరంపరనంతా వెళ్లబెట్టేశాడు ఆదర్శరావు.

కొంచెం విస్తుపోయినట్లు అనిపించినా ''అలాగే సర్! తమకేదైనా అవసరమైతే పిలిపించండి'' అంటూ వెళ్తూంటే ''ఓల్డ్‌హాగ్'' అనుకున్నాడు ఆదర్శరావు. అదేసమయంలో రంగనాథం తనను గురించి ''పాపం! పిల్లకాకి !'' అని అనుకుంటున్నాడన్న సంగతి తెలీదు.

ఆ మర్నాడు వచ్చిన సర్క్యులర్ చూసి ఆఫీసులో ఒక పెద్ద కలవరం బయలుదేరింది.

''ఆహా! ఎన్నాళ్ళకు మనకో మంచి ఆఫీసరు వచ్చాడురా!''

''హి ఈజ్ యాన్ ఎక్స్‌ట్రీమ్లీ నైస్‌బ్లైక్''

''ఎవరండి సబార్డినేట్ల కష్టసుఖాలు ఇంత యిదిగా కనుక్కునేది''.

లీలగా తనదాకా తేలివస్తున్న ప్రశంసలను విని పరమానంద భరితుడైనాడు ఆదర్శరావు. ఆఫీసు మేనేజ్‌మెంటులో తను ఒక క్రొత్త అధ్యాయాన్ని సృష్టిస్తాడు. తన క్రింది ఉద్యోగస్తులందరూ తనకు బ్రహ్మరథం పడ్తారు. యావత్తు అఫిషియల్ ప్రపంచానికే తను మార్గదర్శకుడౌతాడు.

స్టాఫ్ మెంబర్సు అంతా ఆఫీసరు యిచ్చిన అవకాశాన్ని రెండుచేతులా వాడుకుంటున్నారు. ముందుగా నాంది పలికింది ఏ. వన్ సీటు చూసే ఏకాంబరం. ఓ శుభముహూర్తం చూసి ఆఫీసరుగారిని దర్శించుకున్నాడు.

''అయ్యా! నేను గత రెండు సంవత్సరాల నుంచి ఒక నెల రోజులు శలవు యిప్పించ వలసిందిగా ఆఫీసరుగారిని ప్రార్థిస్తూ యున్నాను. కాని తమ ముందు ఆఫీసరుగారు నా సీటులో ముఖ్యమైన పనులు ఉన్నాయని నేను శలవు పెడ్తే పని పడకా పడిపోతుందని మంజూరు చేయలేదు. నా కూతురు పెళ్ళీడుకు వచ్చింది. శెలవు పెట్టి సంబంధాలు చూసుకోవాలి. అసలు శెలవే ఇవ్వకపోతే నా కూతురు గతేం కాను ! తమరి హయాంలోనైనా నాకు న్యాయం చేయండి '' అంటూ కళ్లనీళ్ల పర్యంతం అయ్యాడు.

జాలివేసింది ఆదర్శరావుకు. ''పాపం ఈ మనిషి భార్యా బిడ్డల బాగోగులు కూడా పట్టించుకోకుండా ఆఫీసుకే అంకిత మౌతున్నాడేమో !'' అనిపించింది

''ఆల్‌రైట్ ! అలాగే శాంక్షన్ చేస్తాను. అప్లై చేయండి. మీరు వచ్చేంతవరకూ మీసీటులో పని ఏ–టు గారిని చూడమని ఆర్డర్సు వేస్తాను.''

''అయ్యా ! చిత్తం !'' ఊపిరి పీల్చుకొని బయట పడ్డాడు ఏకాంబరం.

పాపం ! అతనంతగా వాపోవడంలో ఉద్దేశ్యం లేకపోలేదు. తన సీటు ఎప్పుడూ ఎరియర్స్‌లో ఉంటుంది. అందులో ఆనెలలో హాఫ్ యియర్లీ రిటర్న్సు పంపాలి. తను ఏదో విధంగా ఒక నెల రోజులు బైట పడ్డాడంటే, ఆ పని ఎవరికో ఒకరికి అప్పగించి తను తిరిగి వచ్చేసరికి పూర్తి చేయించి ఉంచుతారేమోనని ఆశ.

ఇక ఏ–టు చూసే ఏడుకొండలు రెండు రోజులపాటు ఏ–వన్ సీటుకీ తన సీటుకీ తిరుగుతూ చాలా హడావుడిగా కన్పించాడు. సవ్యసాచిలా అక్కడా యిక్కడా రోజంతా ఏదో వ్రాస్తున్నట్లు ఉండేవాడు. ఇదంతా చేస్తూ ఆఫీసరుగారి దృష్టిలో పడ్డాను అని రూఢి చేసుకున్నాక హాయిగా గాలి పీల్చాడు. ఊహించినట్లుగానే ఆఫీసరునుంచి పిలుపు వచ్చింది.

''వెరీగుడ్ ! మిస్టర్ ఏడుకొండలూ ! మీరు శ్రమపడి మీ పనేగాక ఇంకో సీటు పనికూడా చేయటం చూశాను. ఆఫీసులో యిలాంటి కోఆపరేషన్‌ఉంటే మనం సాధించలేనిది ఏమీ లేదు. ప్లీజ్ కీపిట్ అప్''

''అమ్మయ్య ! రెండురోజుల కష్టం ఫలించి పంట చేతికొచ్చింది. ఇక అనుభవించటమే తరువాయి'' అనుకొన్నాడు ఏడుకొండలు.

''సార్ చిన్న రిక్వెస్టు.'' అన్నాడు అతి వినయంగా వినిపించీ వినిపించనట్లు.

''యస్ ! చెప్పండి.''

''సార్ ! మా నాన్నగార్కి వృద్ధాప్యం వల్ల ఆరోగ్యం బాగుండటం లేదు. రోజూ ఉదయం సాయంకాలం కూడా వచ్చి చూపించుకోవాలని డాక్టరుగారు చెప్పారు. కొద్ది రోజులపాటు నాకు ఉదయం ఒక గంట సాయంకాలం ఒక గంట పర్మిషన్ యిప్పిస్తే తమకు చాలా ఋణపడి ఉంటాను. నేను ఆఫీసు అవర్స్ అయిన తర్వాత ఎంతసేపైనా సరే కూర్చుని నా పని నేను కరెంటుగా పెట్టుకుంటాను.'' మనసులో మాట వెళ్ళగ్రక్కేశాడు.

''ఓ. కె. మీ పని మీరు చేసుకుంటానంటే నా అభ్యంతరం ఏముంది. ఐ వాంట్ వర్క్.''

అనుమతి లభించింది ఏడుకొండలకు. ''సార్ మీలాంటివారు.........''

మధ్యలోనే త్రుంచేశాడు ఆదర్శరావు. ''నో !నో ! అదేమీ లేదు. వెళ్ళిరండి'' అన్నాడు, ముఖంలో సంతోషం గర్వం వెల్లివిరుస్తుండగా.

ఇక మర్నాడు నుంచి ఏడుకొండలు స్వేచ్ఛాజీవి అయినాడు. అందరూ పది గంటలకు వస్తే తను పదకొండు గంటలకు వస్తున్నాడు ఒక గంట ముందుగా నాలుగ్గంటలకే వెళ్లి పోతున్నాడు. మిగతా టైములో ఎప్పుడు వస్తున్నాడో ఏంపని చేస్తున్నాడో ఎవరికీ తెలియట్లేదు.

మిగతా వాళ్లందరికీ కడుపు మంటగా ఉంది. తమ కళ్ళెదుటే తమ తోటివాళ్లిద్దరు పని మానేసి హాయిగా తిరుగుతుంటే తామంతా ఏమీ చేతకాని వాళ్లలాగా చూస్తూ ఊరుకోవాలా ?






## ఎస్. వి. ఎమ్. _ కోరుకొండ

నా వయస్సు 18 సంవత్సరములు. గత నాలుగు సంవత్సరములుగా నాకు రొమ్ములు గట్టిగా రాళ్ళవలె వుండి పెద్ద ఉసిరికాయ సైజులో వున్నవి. ఒక్కొక్కసారి బాధగూడా వుంటున్నది. చాలామంది డాక్టర్లకి చూపించాను. కొందరు ఆపరేషన్ చెయ్యాలని, కొందరు మందులతోనే తగ్గుతాయని అన్నారు. హోమియోపతి వైద్యము గూడా తీసుకొన్నాను. కాని ఫలితం కనిపించలేదు. నాకు చాలా సిగ్గుగా, బాధగా వున్నది. మీ అభిప్రాయం తెల్పండి?

★ ఫైబ్రో ఆడినోమా అనబడే వాపులు రొమ్ము భాగంలో ఏర్పడతాయి. ఈ వాపులకి శస్త్ర చికిత్స చాలా ఉత్తమమైన మార్గం. మందులవల్ల తగ్గే అవకాశం ఉండదు.

## సిహెచ్. ఎమ్. _ నరసాపురం

నాకు 1964వ సంవత్సరం లెప్రసీ వచ్చింది. మందులు వాడితే తగ్గింది. 1970లో పెండ్లి అయినది 1971 లో టి. బి. వచ్చింది. ఎక్కువగా పనిచేస్తే రక్తం పడుతుంది. 1974లో బాబు పుట్టాడు. నా వ్యాధులు బాబుకి వ్యాపిస్తాయా?

★ టి. బి. ఉన్నవారికి రోగం ముదిరిపోతే శ్రమ పడకపోయినా రక్తం పడే అవకాశం ఉన్నది. మీరు నిపుణులైన వైద్యులవద్ద (టి. బి. రోగ స్పెషలిస్టులు) చికిత్స చేయించుకోవటం అవసరం. మీ వ్యాధులు బాబుకి సంక్రమించే అవకాశం ఉండదు. అయినా ముందు జాగ్రత్తగా బాబు ముఖంలో ముఖం పెట్టి ముద్దు పెట్టటం వంటివి చేయటం మానాలి.

## ఎవ్. ఎవ్. ఆర్. _ పాలకొల్లు

వరిబీజము మందులకు తగ్గుతుందా? ఏ మందులు ఏ విధంగా వాడాలో తెలుప ప్రార్థన.

★ వరిబీజం మందులకి పూర్తిగా తగ్గే అవకాశం లేదు. ఫైలేరియా రోగంవల్ల ఏర్పడిన దైతే హెట్రజాన్ వంటి మందులు వాడితే పెరుగుదల ఉండదు.

ఈ రోగాన్ని పూర్తిగా నయం చెయ్యాలంటే శస్త్రచికిత్స మంచి మార్గమనే చెప్పవలసి ఉన్నది.

## కె ఎస్. - తిరువూరు

నా వయస్సు 15 సంవత్సరములు. నాకు చిన్నప్పటినుండి ముక్కునుండి రక్తం వస్తుంది. ఇది తగ్గాలంటే ఏమి చెయ్యాలి?

★ ముక్కులోపల ఉన్న రక్తనాళాల నిర్మాణంలో అవకతవకలు ఉన్నప్పుడు ఇలా జరిగే అవకాశం ఉన్నది. ముక్కు లోపలి భాగాన్ని పరీక్షిస్తేగాని ఎందువల్ల రక్తం వచ్చేదీ తెలియదు.

కాటరైజేషన్ ద్వారాగాని, చిన్న శస్త్రచికిత్స ద్వారాగానీ నివారణ లభిస్తుంది.

బాగా రక్తస్రావం జరిగే సమయంలో నెత్తురు ప్రవాహం ఆగటానికి అడ్రినలిన్ ద్రవంలో ముంచిన దూదిని ముక్కులో ఉంచటం మంచిది.

## ఎస్. కె. _ కర్నూలు

నాకు ఆరు నెలల నుండి కడుపులో నెప్పిగా వుంటోంది. కడుపునెప్పి ఎక్కువగా వున్నప్పుడు విరోచనములు అగును. మల, మూత్ర పరీక్షలు చేయించుకున్నాను. ఏమీలేదు అన్నారు. రెండు వారముల క్రితం మరల నెప్పి వచ్చినది. ఈసారి కుడివైపు నాభి దగ్గర వచ్చినది. మందులు వాడు చున్నాను ఇది నాల్గవ కోర్సు అయినా కడుపులో నెప్పి వుంటూనే వున్నది.

★ మల పరీక్ష ఒకసారి చేసి అందులో ఏమీ లేదని తెలిసినంత మాత్రాన రోగం లేదని తీర్మానిం చటం పొరపాటు. కనీసం మూడుసార్లైనా పరీక్ష చేయించటం అవసరం. అప్పటికీ ఏమీ తేలనప్పుడు ప్రోక్టోస్కోపీ, సిగ్మాయిడోస్కోపీ చేయించవలసి ఉంటుంది. ఈ పరీక్షలవల్ల అమీబియాసిస్ ఉన్నదీ లేనిదీ తెలిసిపోతుంది ఈ పరీక్ష ఫలితాన్ననుసరించి చికిత్స చేయించుకోవలసి ఉంటుంది

అమీబియాసిస్ లేదని నిర్ధారణగా తెలిసిన తర్వాత, అల్సరేటివ్ కొలైటిస్ మొదలయిన రోగాలకి గాను పరీక్ష చేయించుకొని మందులు వాడాలి ●

---

# ఆఫీసర్ ఆదర్శరావ్

అంతా కూడ బలుక్కున్నారు. ఒకరి తర్వాత ఒకరుగా ఆఫీసరుగారి దర్శనం చేసుకుంటున్నారు.

ప్రతివాడూ తన సీట్లో పని ఎక్కువ అంటు న్నాడు ప్రక్క సీటువాడికి పని తక్కువ. తన సబ్జక్టు కొంచెం ట్రాన్సఫర్ చేయమంటున్నాడు. పనిచేయలేక చచ్చిపోతున్నాను అంటున్నాడు. ఆరోగ్యం పాడౌతున్నది అంటున్నాడు, ఏడుస్తున్నాడు.

ఆదర్శరావుకి ఏమి చేయాలో పాలుపోవటం లేదు. ఎవరినీ కాదనలేక పోతున్నాడు. ఎవరికీ గట్టిగా చెప్పలేక పోతున్నాడు. ఆఫీసులో పని ఏమీ జరగటంలేదు. అంతా ఎరియర్సులో పడిపోతున్నది.

పరిస్థితి యిలా ఉండగానే, హెడ్డాఫీసు నుంచి పులిమీద పుట్రలా ఒక మెమో వచ్చింది. ఈ బ్రాంచి నుంచి వచ్చే రిపోర్టులు, రిటర్నులు సరిగా రావటంలేదని, ఏక రస్పాండెన్సుకీ జవాబు రావడం లేదనీ, పరిస్థితి చక్కబడకపోతే తీవ్రమైన చర్య తీసుకోవలసి వస్తుందనీ.

ఇక బయట పడక తప్పలేదు ఆదర్శరావుకి. మెంబర్సు అందరినీ పిలిచి మీటింగు పెట్టాడు.

''ఫ్రెండ్స్! ఇన్నాళ్ళూ నేను మీ సమస్యలను సాధ్యమైనంతవరకూ అర్థం చేసుకోటానికి ప్రయ త్నించి నా చేతనైన సాయం చేస్తూ వచ్చాను. ఇప్పుడు మన ఆఫీసు పనితీరు మీద హెడ్డాఫీసునుంచి ఏడ్వర్సు రిమార్కులు వచ్చాయి. ఇది నాకు పర్సనల్ గా ప్రిస్టేజి యిష్యూ. ఇప్పుడు మనం అంతా కలిసికట్టుగా పనిచేసి ఈ పరిస్థితి నెదుర్కోవాలి. రాత్రింబవళ్ళు కష్టపడి, నీది నాది అనే భేదం లేకుండా ఆఫీసు పని అంతా కరెంటు చేయాలి. దీనికి మీ పూర్తి సహాయ సహకారాలు నేను కోరుతున్నాను.'' అని సభ్యుల రియాక్షన్ కోసం ఆతురతగా ఎదురు చూడసాగాడు.

ఎంతసేపైనా ఎవరూ ఏమీ మాట్లాడటం లేదు. ఇక శలవు అవసరం అయిపోయిందని తెలుసుకొని ఆ రోజే జాయిన్ అయిన ఏకాంబరం తనని కాదన్నట్లు ఎటో చూడసాగాడు. ఏడుకొండలు టైము చూసుకుంటున్నాడు, డాక్టరు దగ్గరికి వెళ్ళే టైమయిందే అన్నట్లుగా. రంగనాథం చేయి అడ్డం పెట్టుకొని ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు. తనొక్కడే ఎంతసేపూ ఏం మాట్లాడాలో తెలియక మీటింగు ఎలాగో ముగించేశాడు ఆదర్శరావు.

ఆ తర్వాత కొద్ది రోజులకే ఆదర్శరావుకు ఆ బ్రాంచి నుంచి ట్రాన్స్ఫర్ ఆర్డర్సు వచ్చాయి. ఎక్కడో ఏజెన్సీ ప్రాంతంలో పనిష్మెంటు పోస్టింగు వేశారు.

ఆర్డర్సుతోపాటు ఆదర్శరావుకు ఒక కాన్ఫిడెన్షియల్ మెమోకూడా వచ్చింది. ఆదర్శరావు తన విధి నిర్వహణలో ఎఫిషియన్సీ ఇంప్రూవ్ చేయాలనీ, లేని పక్షమున అది అతని అసమర్థతగా భావించి ఈ ఉద్యోగానికి అనర్హుడని నిర్ణయించి తగిన చర్య తీసుకోబడుతుందనీ దాని సారాంశం.

ఆ తర్వాత ఆదర్శరావు ఆఫీసులో ఎవరికీ ముఖం చూపించలేదు. కొన్నాళ్ళ తర్వాత ఆదర్శరావు పని చేస్తున్న బ్రాంచి నుంచి ఒక అసిస్టెంటు ఆఫీసు పనిపై ఆదర్శరావు ఇదివరకు పనిచేసిన బ్రాంచికి వచ్చి, ఏదో మాటల సందర్భంలో ''అబ్బో! ఆయనా! కర్కోటకుడు, జాలి, దయ ఏకోశానా ఎరుగడు. మా రక్తం పిండేస్తున్నాడు'' అని చెప్పాంటె స్టాఫ్ అందరికీ తెరిచిన నోళ్ళు అలాగే ఉండిపోయాయి.



# ఆనందాల పంట
# ...దాన్ని పెంచి పోషించేది జై కిసాన్

జైకిసాన్ అంటే సమృద్ధి, సంతోషాల దూత.
ఉత్తమ పద్ధతిలో తయారైన జైకిసాన్ ఎరువులు
అత్యంత పోషణనిచ్చేవి—అవి నీటిలో ఇస్తే
కరిగి మొక్కలకు వెంటనే అందుతాయి.
ఫలితం—బలమైన వేళ్లు, ఏపుగా పెరిగే
మొక్కలు. ఈ రోజే జనప్రియమైన జైకిసాన్
ఎరువులు తెచ్చుకోండి, మీ అదృష్టాన్ని
పండించుకోండి ప్రతి పంటకీ, ప్రతి నేలకీ
అనువైన ఉత్తమ ఎరువులు—జైకిసాన్ ఎరువులు.

**జై కిసాన్ యూరియా 46.4 % నత్రజని**
**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0**
**జై కిసాన్ సంపూర్ణ 19:19:19**
**జై కిసాన్ సౌభాగ్య 14:35:14**
**జై కిసాన్ డయంఫాస్ 18 46·0**

**ఉత్తమ పద్ధతిలో 'ఉపయోగిస్తే ఉత్తమ ఫలితాలు :**
జైకిసాన్ ఎరువులు అద్భుత ఫలితాలు
ఇవ్వాలంటే వాటిని తగిన విధంగా ఉపయో
గించాలి. అంచేత, ఈ రోజే, మీకు దగ్గరలోని
జువారి వారి పసుపు పచ్చని దుకాణానికి
వెళ్లండి. ఎరువుల్ని సరిగా ఉపయోగించే పద్ధతి
తెలిపే ఉచిత కరపత్రాన్ని పుచ్చుకోండి. ఆ
దుకాణంలో మీకు, మట్టి పరీక్ష ఫలితాలను
అనుసరించి అన్ని పంటలకూ కావలసిన అన్ని
రకాల సలహాలూ లభిస్తాయి. ఈ రోజే మీ
పంటపీ మట్టిపీ బట్టి మీ ప్రియమైన జైకిసాన్
ఎరువు ఎంచుకోండి, సరైన పద్ధతిలో
ఉపయోగించి పుష్కలమైన పంట
పండించండి . . . మీ కలలు నిజం చేసే
ఎరువులు మీ ప్రియమైన జైకిసాన్ ఎరువులు.
అవి దొరికే చోటు—జువారి వారి పసుపుపచ్చ
దుకాణం !

## జై కిసాన్ ఎరువులు-అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ

జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు·
సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగపూర్, పుణే, జువారినగర్.









సీరియల్

# ధర్మో రక్షతి రక్షితః

ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ

3

(గత సంచిక తరువాయి)

దీక్షితులుగారు ఊళ్ళో వర్తకుడింటికి పెళ్ళికెళ్ళి తిరిగొచ్చేసరికి అరుగుమీద చాపలు పరచబడి వున్నాయి. ఇద్దరు వ్యక్తులు కూర్చుని వున్నారు.

అందులో ఒకాయనకు అరవై యేళ్ళుంటాయి. ఆయన్ని చూడగానే పోల్చుకున్నారు దీక్షితులుగారు. ఆయన్ని గోదావరిశాస్త్రిగారంటారు. పెళ్ళి సంబంధాలు కుదురుస్తారు. ఆయన ప్రక్కన మరొకాయన కూర్చుని వున్నాడు. ఆ వ్యక్తికి నలభై యేళ్ళుంటాయి.

దీక్షితులుగారు గేటు తీసుకుని రాగానే ఇద్దరూ నిలబడ్డారు. "నమస్కారం. కూర్చోండి...ఎండన పడివచ్చారు. మజ్జిగ ఏదైనా పుచ్చుకుంటారా? పలకరింపుగా అన్నారు దీక్షితులుగారు.

"అయ్యా! ఇది అన్నపూర్ణ లోగిలి. ఇంత సేపా? రాగానే పాపతెచ్చి ఇచ్చింది. తమరు దయ చేయండి" అన్నాడు గోదావరిశాస్త్రి.

దీక్షితులుగారు కూర్చుని, శాలువాతీసి ప్రక్క నుంచి అంగవస్త్రంతో చెమట అద్దుకుంటూ ... "అమ్మా! మీనాక్షీ. మంచితీర్థం తే తల్లీ!" అన్నారాయన.

మీనాక్షి తెచ్చిన మంచినీళ్ళు త్రాగి సేద తీర్చుకుని వచ్చినవారికేసి చూశారు.

"ఈయన ధూళిపాళ సోమయాజులుగారని, రాజోలు తాలూకా, మలికిపురం గ్రామ వాస్తవ్యులు. స్మార్తవేత్త. మిమ్మల్ని దర్శించుకుని ... వారి మనసులోని మాట మీకు మనవి చేద్దామని చెప్పి చక్కావచ్చేరు."

"అలాగా! చాలా సంతోషం ... తీరుబడిగా మాట్లాడుకోవచ్చు. ముందు మీరు లేచి జపతపాదు లేమైనా వుంటే ముగించుకుని భోజనాలు చేసిన తరువాత మాట్లాడుకోవచ్చును" అన్నారు దీక్షితులుగారు.

సోమయాజులు చేతులుజోడిస్తూ "క్షమించాలి. మా మీద దయవుంచాలి తమరు. నేనొచ్చిన పనికి, మీ ఇంట భోజనానికి పొత్తుకుదరదు" అన్నాడు.

"సెలవ్వండి."

"మా అమ్మాయి చిరంజీవి సౌభాగ్యవతి సుబ్బలక్ష్మిని తమరి కోడలిగా చేద్దామనే వుద్దేశ్యంతో వచ్చేను" నెమ్మదిగా అన్నాడు సోమయాజులు.

"ఈ చుట్టుప్రక్కల మీకున్న పేరుప్రఖ్యాతులు విని తమరింట పిల్లనివ్వాలని ... నెలరోజులుగా నా చెవి నిల్లుకట్టుకుని పోరుతున్నాడా బ్రాహ్మడు ... ఈనాటికి సందర్భం అయింది."

దీక్షితులుగారు మాట్లాడలేదు.

"మీ పరమేశ్వరశాస్త్రిని చూశాం. కుర్రాడికి పదిహేనేళ్ళుండవచ్చు. మా అమ్మాయికి తొమ్మిదేళ్ళు. వ్యక్తురాలు కాకుండా పెళ్ళి చేద్దామని మా ఉద్దేశం" అన్నాడు సోమయాజులు.

"మీరు వరద హస్తం ఇస్తే బ్రాహ్మణుడు సంతృప్తిగా వెళతాడు" నొక్కి అందుకున్నాడు గోదావరిశాస్త్రి.

"నాకా ప్రథమ పుత్రిక. ముద్దు ముచ్చటలో కానీయండి, పెళ్ళి చేయటం విషయంలో కానీయండి. లోపం జరగదు."

"ఇక కట్న కానుకలంటారా? మీ ఇంట పిల్ల నివ్వాలని ఉత్సాహంతో వచ్చేడు. మీ ఇచ్ఛప్రకారమే జరిపిస్తాడు."

దీక్షితులుగారు నవ్వి "శాస్త్రిగారూ! మీరొచ్చి ఈ విషయం కదిపేదాకా మా పరమేశ్వరుడి పెళ్ళి చేయాలనే వుద్దేశంలో నేను లేను. పైగా నాకు ఓ కూతురుంది. చూశారుగా!" అన్నారు.

"చూడకేం. బంగారు బొమ్మలావుంది."

"ఆ పిల్లకి పెళ్ళి చేయమని మా అమ్మగారు పట్టుబడుతున్నారు. మీరొచ్చేదాకా కుర్రాడి విషయం నేనాలోచించలేదు."

"దానికేముంది? అమ్మాయికి మన హోదాకి తగ్గ సంబంధం చూడమంటే చూస్తాను."

దీక్షితులుగారు నవ్వేరు. నెమ్మదిగా—"గోదావరి శాస్త్రిగారూ! మీరు నన్ను జమీందారుగా భావిస్తున్నా రనుకుంటాను. నాకే భూవసతీలేదు. పిత్రార్జితమైన ఈ లోగిలి, ఊర్లో కాస్తంత మర్యాదా వుంది. పరమేశ్వరానుగ్రహంవల్ల అన్నోదకాలకు లోటు లేకుండా జరిగిపోతుందంతే."

"అయ్యా! వియ్యమంద వచ్చిన వారిదగ్గర తమరింత విప్పి చెప్పాల్సిన పనిలేదు. మీ ఆస్తికోసం ఆ బ్రాహ్మడు రాలేదు. మీ సాంప్రదాయం, మీ పచ్చిలత, మీ విద్యాధనం చూసే వచ్చేడు. మీ విద్యా ధనంకంటే ఈ ఆస్తులు గొప్పవంటారా? ఇక వంశమంటారా...మీ తండ్రిగారు పౌండరీకంతో సహా యజ్ఞాది క్రతువులు చేసిన యాగకర్త. మీ విషయం సరేసరి."

"అభిమానంతో మీరు పలికిన మాటలకు చాలా సంతోషం. ఈ విషయమై నేను ఆలోచించి మీకు వర్తమానం చేస్తాను." అన్నారు దీక్షితులుగారు.

సెలవు తీసుకుని లేచేరు వాళ్ళు.

"శాస్త్రిగారూ! మరొకమాట. మీ ఎరుకన మా మీనాక్షికొక పెళ్ళి సంబంధం చూడాలి."

"మహాప్రసాదం. అంతకంటేనా! ఈ విషయం నా కొదిలేయండి. మీరు అబ్బాయి విషయం ఆలోచించి నాకు వర్తమానం చేయండి."

"తప్పకుండాను."

"వెళ్ళబోయేరు ఇద్దరూను.

"మీరు కతికితే అతకదనుకుంటే...మా శర్మ ఇంట్లో తమకు దేవతార్చన ఏర్పాటు చేస్తాను." అన్నారు దీక్షితులుగారు.

"మేము గ్రామంలోకి రాగానే వారి దర్శనం చేసుకునే వచ్చేం. వ్యాఘ్రేశ్వరశర్మకూ మాకూ బహుకాల స్నేహం. మేము వెళ్ళేది వారింటికే. మిమ్మల్ని శ్రమ పెట్టదలచుకోలేదు" అన్నాడు గోదావరిశాస్త్రి.

"బాగుంది. సెలవు"—అంటూ లోపలకు నడిచేరు దీక్షితులుగారు.

"మన పరమేశ్వరుడికేమిట్రా పెళ్ళిసంబంధం" పంచె తలమీద సర్దుకుంటూ అడిగింది సోమిదేవమ్మ.

"అవునమ్మా" అన్నారాయన.

చేతిలో తాంబూలం ... ఉయ్యాల మీదుంచి, దాంట్లో దక్షిణగా వర్తకుడిచ్చిన నోట్లను...రొంటిని వుంచుకున్నారు.

"ముందు ఆడపిల్లకు చూడరా."

"చెప్పేనమ్మా."

"నేను బతికుండగా ... నా కళ్ళముందు ఒకరి పెళ్ళయినా చూడాలిరా."

"అలాగేలేమ్మా" అన్నారాయన.

"మీకేదో వుత్తరం వచ్చింది" లలితాంబ తెచ్చి, బల్లమీద వుంచింది.

ఇంతలో పరమేశ్వరుడు అటుగా వచ్చేడు.

"ఉత్తరం చదవరా" అన్నారు దీక్షితులుగారు.

పరమేశ్వరుడు చదివేడు —

'శివ స్వరూపులైన అన్నగార్కి ... తమ్ముడు కృష్ణశాస్త్రి నమస్కారములతో రాస్తున్న విన్నపములు.

**జరిగిన కథ—1:** యజ్ఞన్న దీక్షితులు సనాతనుడు. ఆయన భార్య లలితాంబ. వారి సంతానం పరమేశ్వరశాస్త్రి, శ్రీరాముడు, గౌతమ శాస్త్రి, మీనాక్షిలు. పరమేశ్వరశాస్త్రి తండ్రివద్దనే వేదాధ్యయనం చేస్తుంటాడు. శ్రీరాముడు అమలాపురంలో చదువుకొంటావుంటాడు.

ఇక్కడ నేమూ, మీ మరదలు క్షేమముగా యున్నాము. మీరూ, మహాలక్ష్మి సమానురాలైన వదినగారూ, పిల్లలు క్షేమముగానేయున్నట్లు భావిస్తాను. అమ్మవంట్లో ఇప్పుడు తగ్గినట్లు, పధ్యం పెట్టినట్లు మీరు రాసిన ఉత్తరం చూసి ఆనందించేను. శ్రీరాముడు ఐదు ప్యాసయినాడు కదా, వాణ్ణి ఆరవ తరగతిలో చేర్పిస్తే బాగుంటుంది. అమ్మ వంట్లో బాగాలేదన్నప్పటినుంచి వద్దామని ప్రయత్నం. అందువల్ల పంచమీ బుధవారం ఉదయం వస్తాను. అన్ని విషయాలూ సముఖంలో... మనవి చేస్తాను.

ఇట్లు
మీ సోదరుడు
కృష్ణశాస్త్రి.

"కృష్ణుడొస్తున్నాడా ?!" ఆప్యాయంగా అడిగింది సోమిదేవమ్మ.

సోమిదేవమ్మ గంపెడు పిల్లలనయితే కన్నది కాని అందర్నీ దక్కించుకోలేకపోయింది. మిగిలిన సంతానమల్లా ఇద్దరు మగబిడ్డలు, ఇద్దరాడబిడ్డలు. పెద్దవాడు దీక్షితులు, రెండోవాడు కృష్ణశాస్త్రి. కూతుళ్ళిద్దరికీ వివాహాలయిపోయాయి. ఎవరి సంసారాలు వాళ్ళు చేసుకుంటున్నారు. కృష్ణశాస్త్రి కాకినాడలో తాలూకాఫీసులో ఉద్యోగం చేస్తున్నాడు. భార్యపేరు తాయారు.

"అవునమ్మా ... బుధవారం వస్తాడుట. మరదల్ని, పిల్లల్ని కూడా తీసుకొస్తే బాగుంటుంది" అన్నారాయన.

లలితాంబ భర్తకేసి చూసి "ఎవరో మీకోసం వచ్చేరు" అంది.

"నాకోసం రాలేదు. నీకు కోడల్ని తెచ్చారు" నవ్వేరాయన.

"నాకు కోడలా?" ఆశ్చర్యంగా అందామె.

"పరమేశ్వరుడికి పెళ్ళాన్ని తెచ్చేరు. సరేనా? ఏరా? పరమేశ్వరా ?" కొడుకుకేసి తిరగేరు.

పరమేశ్వరుడు తలదించుకుని పెళ్ళికూతుర్లా వెళ్ళిపోయేడు.

"వీడు సిగ్గుపడుతున్నా డేమిటే?" అన్నారాయన భార్యకేసి తిరిగి.

"వీడి కప్పుడే పెళ్ళేమిటండీ?" అంది లలితాంబ.

"అన్నీ నువ్వలాగే అంటావు. వయసుకి తగ్గ ముచ్చట్లన్నారు. ఈ వయసుకు యజ్ఞన్నకు పెళ్ళి కాలేదా? నేను బతికుండగా ఒక శుభకార్యం ... నా కళ్ళముందు జరిపించేవుద్దేశం నీకు లేదనుకుంటాను" అంది సోమిదేవమ్మ.

"సరేలే చూద్దాంలేమ్మా!...రేపు బుధవారం తమ్ముడొస్తున్నాడుగా. వాడితో ఆలోచించి అలాగే చేద్దాం" అన్నారు దీక్షితులుగారు.

## 4

కృష్ణశాస్త్రి వచ్చి అరగంటకే తనొచ్చిన విషయం బయటపెట్టాడు.

"అదికాదన్నయ్యా! వాడికి చదువుకోవాలని వుంది మొర్రో అని ఏడుస్తున్నాడు. అలాంటివాణ్ణి ఇష్టంలేని వేదంలో దింపటం కంటే చదివించటమే మేలు" అన్నాడు.

దీక్షితులుగారు తమ్ముడి మొహంకేసి చూస్తూ, "వస్తూనే వాడి విషయమే ప్రస్తావిస్తున్నావు.



వాడు చదువుకోవటానికి పట్టుబడుతున్నట్లు, నేను కాదంటునట్లు నీకెలా తెలుసు ?"

కృష్ణశాస్త్రి నీళ్ళు నమిలేడు. అన్నగారి మొహంలోకి చూసి తల దించుకుంటూ,







## ధర్మో రక్షతి రక్షితః

''శ్రీరాముడు నాకు ఉత్తరం రాశాడన్నయ్యా. అందులో వాడికి చదువుకోవాలని ఎంత కోరికుందో రాశాడు'' నెమ్మదిగా అన్నాడు.

దీక్షితులుగారు క్షణం ఆశ్చర్యపోయి,

''చదువుకుని ఏం వెలగబెట్టాలా ? ... నాన్న వద్దన్నా చదువుకుని నువ్వు ఏం లక్షలు సంపాదించేవు? రాయడానికి, చదవడానికి కావల్సిన చదువు వచ్చింది... చాలుగా.''

''వాడి అభిరుచి మేరకు వాణ్ణి చదివిస్తే వాడి ఖర్మ వాడు పడతాడు ''

''సరేరా . వీణ్ణి ఎక్కడుంచి చదివించడం?'' విసుగ్గా అన్నారు దీక్షితులుగారు.

''అందుకేగా వచ్చింది వాణ్ణి నా దగ్గరకు పంపు. కాకినాడలో వుండి చదువుకుంటాడు.''

''నీకేం పిల్లలు లేరనా ? వీడినికూడా పెట్టుకోవటం ... ''

''ఉన్నారు కనుకనే అన్నయ్యా ... వీడేం పరాయివాడుకాడు నాకు. వీడూ నా కొడుకే ... చదువుకోవాలని వున్నవాణ్ణి, కాదూ — కూడదూ అని వేదం నేర్చుకోమని ... ''

''మరీ ..వాడు వదిలి వుండగలడా ?''

''అడుగుదాం . ఒరేయ్ శ్రీరాముడూ. .'' పిలిచేడు కృష్ణశాస్త్రి

''ఏం బాబాయి?'' శ్రీరామశాస్త్రి అడిగాడు నెమ్మదిగా

''నా దగ్గరుండి చదువుకుంటావా ?''

తలూపేడు శ్రీరాముడు.

''ఏం అన్నయ్యా. .?''

''నేనేం అనగలనురా...? ఈ వంశంలో రెండో కొడుకు వేదం నేర్వకూడదని శాపమో ఏంటో... సరే అలాగే కానీయ్ చదువుకుంటాను మొర్రో అని వాడూ...చదివిస్తానని నువ్వూ అంటుంటే... నేనేం అంటాను!''

వంటింటి తలుపు దగ్గర నిలబడి వీళ్ళ సంభాషణ అంతా వింటున్న లలితాంబ మొహం వికసించింది.

''రాజోలు దగ్గర మలికిపురంనుంచి మన పెద్దాడికో సంబంధం వచ్చిందిరా ''

''ఎవరికీ ? పరమేశ్వరుడికే?'' కృష్ణశాస్త్రి ఆశ్చర్యంగా అడిగేడు.

దీక్షితులుగారు తలూపేరు.

''ఇంత చిన్నవయసులో వాడికి పెళ్ళేమిటన్నయ్యా ?''

''ఒరేయి...మీ ఇష్టమొచ్చినట్లు మీరు నిర్ణయాలు తీసుకోడానికి పెద్దముండని నేనొకత్తిని బతికున్నానురా...

వేదం చెప్పించరా నాయనా అంటే, వాణ్ణి తమ్ముడి సలహాకు ఒగ్గి ... చదివిస్తానంటున్నావు. నేను బతికుండగా.. నా మనుమలకు ఓ శుభకార్యం జరిపించరా అంటే. .వీల్లేదు—? చిన్న పిల్లలావాళ్ళు ఛీ...ఛీ ..చచ్చేకాలానికి కుక్కమూతి పిందెలని .. ఈనాటికి ఈ యింటికి ఈ దశవచ్చింది. మీ ఇద్దరికీ నేనా వయసుకు పెళ్లిళ్ళు జరిపించలేదూ?'' ఆయాస పడుతూనే అన్నదమ్ములమీదవిరుచుకుని పడిపోయింది సోమిదేవమ్మ.

దీక్షితులుగారు మౌనంగానే వుండిపోయారు.

### ఆనాడు - ఈనాడు

రామరాజ్య వైభవాన్ని  
ఆనాటి ప్రాభవాన్ని  
విద్యార్థిగ విన్నప్పుడు  
ఆలస్యంగా పుట్టానని  
చూడలేక పోయానని  
ఎంతగానో కుమిలిపోయాను  
ఆనాడు నేను —

నేటి వాగ్దానాల వైభవాన్ని  
మన జాతి ప్రాభవాన్ని  
కళ్లారా చూస్తూ ...  
తొందర పడ్డానే  
ముందర పుట్టేశానే — అని  
ఎంతగా నలిగిపోతున్నానో  
ఈనాడు నేను ...

— టి. ఎస్. ఎస్. రంగనాథ్

సంసారం నిర్వహిస్తున్న ఆయన మొదటినుంచీ తామరాకుమీద నీటిబొట్టే. తన నిత్యాగ్నిహోత్రం . తనూ . . అంతే. అందుకే మాట్లాడలేదు.

కృష్ణశాస్త్రి మాత్రం తల్లిని ఒప్పించడానికి విఫలప్రయత్నం చేశాడు.

కాని ఆర్ష సంస్కృతి జీర్ణమైన వృద్ధురాలు వినలేదు. చివరకు అన్నదమ్ములు మధ్యాహ్నం మల్కిపురం వెళ్ళి పిల్లని చూడటానికే నిశ్చయమైంది.

### 5

పరమేశ్వరశాస్త్రికి, ధూళిపాళ సోమయాజులు గారి ప్రథమ పుత్రికకూ వివాహం నిశ్చయమైంది. దీక్షితులుగారింట్లో హడావుడి ప్రారంభమైంది. బంధువులు ... స్నేహితులూ, ఊర్లో పెద్దలూ ... అందరికీ శుభలేఖలు అందించబడ్డాయి. ఐదురోజుల పెళ్ళి ... ఆర్భాటంగానే చేస్తానని మాట ఇచ్చాడు సోమయాజులు.

అన్నదమ్ములు పిల్లని చూడటం.. సుబ్బలక్ష్మి తలొంచుకుని సిగ్గుపడుతూ ఒదిగి కూర్చుంది.

వెనువెంటనే మాటలు జరిగిపోయాయి. ''ఇలాంటి వ్యవహారాల్లో నా కనుభవంలేదు. మా తమ్ముడితో మాట్లాడండి'' అనేశారు దీక్షితులుగారు

కట్నం వేయినూట పదహార్లు ఇవ్వటానికి, అయిదురోజుల పెళ్ళి జరపటానికీ ... ఆడపడుచు .. అత్తగారి లాంఛనాలు నడపటానికి .. నిర్ణయమైపోయింది.

వారం తిరగకుండా తాంబూలాలు ఇచ్చి, లగ్నం చెప్పి వెళ్ళిపోయేడు కన్యాదాత.

వాళ్ళిచ్చేది వేయినూట పదహార్లయినా, బండ్ల ఖర్చులు, బ్యాండుకీ . . భోగం మేళంకి ... పిల్ల ఆభరణాలకి, వివాహం అయితిరిగొచ్చిన తరువాత జరిగే గృహప్రవేశంకి ... భోజనాలకి మిగిలిన బంధువులకు నూతన వస్త్రాలకు నాలుగైదువేలు అయ్యేట్లు తోచింది దీక్షితులుగారికి.

అయితే ఆ విషయంపై ఆయన అట్టే శ్రమ పడనక్కరలేకుండా చేశాడు శేషాద్రి...

శేషాద్రి ... శివరామయ్యలాంటి ప్రముఖులు పూనుకున్న తరువాత కార్యక్రమం నిలుస్తుందా ?

శివరామయ్య మిల్లులోంచి కిచిడీ బియ్యం రెండుబస్తాలు,వరహాలావు దుకాణంలోంచి అపరాలు,

మరికడింట్లోంచి బెల్లం, మరో తోటలోంచి అరటి గెలలు వచ్చి చేరుతున్నాయి.

ఇందులో ఏ ఒక్కరినీ దీక్షితులుగారు అడిగింది లేదు. ఆయన ఏనాడూ ఎవర్నీ చేయి చాచి ఏదీ అడగలేదు. ఈ కార్యక్రమానికీ అడగలేదు. శుభలేఖలు మాత్రం కృష్ణశాస్త్రి సాయంతో గ్రామం అంతా పంచిపెట్టారు.

మర్నాటినుంచి ఎవరికి వీలయిన సరుకు వాళ్ళు చేరవేసి వెళ్ళటం. ఆ గ్రామంలో ఉన్న బ్రాహ్మణ కుటుంబాలు తక్కువ. అందులోనూ మొదటినుంచీ దీక్షితులుగారి వంశం వేదపండితులు కావడంవల్ల వారికా గ్రామంలో ఆదరణవుంటూ వచ్చింది.

కృష్ణశాస్త్రి...మల్కిపురం మరోసారి వెళ్ళి, పుల్‌బ్యాండు, పల్లకీ వాళ్ళని, భోగంమేళం మాట్లాడి...వాళ్ళకి బయానాలిచ్చి వచ్చేడు. శుక్రవారం సాయంత్రం 6 గంటలకు చేరతామని, రాత్రి భోజనాలు ఏర్పాటు చేయమని చెప్పివచ్చేడు.

తెల్లారితే స్నాతకము. బంధువులంతా వచ్చేరు. దీక్షితులుగారి ఏలూరు పెద్దచెల్లెలు, సామర్లకోట చిన్న చెల్లెలు వచ్చేరు. ముందురోజే పెళ్ళికొడుకును చేశారు పరమేశ్వరశాస్త్రిని.

లక్ష్మివారం పుదయం స్నాతకం చేసుకొని... శుక్రవారం భోజనాలుచేసి...మల్కిపురం వెళ్ళడానికి నిశ్చయించారు.

బంధువులొచ్చేశారు. దీక్షితులుగారిల్లు కిటకిటలాడుతోంది. పాతిక మందిపైగా చంటిపిల్లలు... ఇల్లు ఎగరకొట్టేస్తున్నారు. ఆడుకునే పిల్లలు... అరచుకునే పిల్లలు...కరుచుకునే పిల్లలు అంతా గోల...వాళ్ళని గదమాయిస్తూ పెద్దవాళ్ళ కేకలు. అంతా గందరగోళంగావుంది. ఈ గొడవ కాస్త తగ్గించమని, కాస్త నిద్రపోవాలని ఆడవాళ్ళ గోల.

పక్కబట్టలు వేసుకునేసరికి ఎవరో వచ్చి పడుకోవటం...వాళ్ళని లేపలేక విసుక్కుంటూ మరో చోటు వెతుక్కుంటున్నారు కొందరు.

కృష్ణశాస్త్రిని కొంతమంది నూనూగు మీసాల కుర్రవాళ్ళు చుట్టూచేరి ..., అతను కుదిర్చిన మల్కిపురం భోగంమేళం విషయాలు కనుక్కుంటున్నారు. అతను చెప్పే వివరాలతో రేపు కట్టబోయే భోగంమేళం ఎలావుంటుందో ఊహించుకుంటున్నారు.

అర్ధరాత్రి 12 గంటలవరకూ వచ్చే బంధువులు బళ్ళు ఎక్కి వస్తూనే వున్నారు. లలితాంబ వచ్చిన వాళ్ళకి వడ్డనా వార్పులతో సతమతమౌతోంది.

వచ్చిన బంధువులను పలకరిస్తూ ముందేవచ్చిన బంధువులు లేచి కూర్చుంటున్నారు. వాళ్ళ కబుర్లకు పడుకున్నవాళ్ళు లేస్తున్నారు. ఇదో గొలుసులా జరిగిపోతూనేవుంది.

అరుగుమీద మగాళ్ళుచేరి ... రాజకీయాలు కునుకుపాట్లు పడుతూ మాట్లాడుకుంటున్నారు.

ఒంటిగంటకు గాడిపొయ్యి ఆర్పించి లలితాంబ నడుం వాల్చటానికొచ్చింది. దీక్షితులుగారి పడక గురించి అప్పుడామెకు గుర్తువచ్చింది. వీధి సావిట్లోకొచ్చింది. అరుగుమీద గోడకు చేరబడి కునుకుపాట్లు పడుతున్న ఆయన్ని చూడగానే ఆమె హృదయం ద్రవించిపోయింది.

## ధర్మో రక్షతి రక్షితః

"అయ్యో..., లేవండి ..పక్కవేస్తాను" అంది భర్తను లేపి.

దీక్షితులుగారు లేచి ఇంట్లోకొచ్చేరు. లలితాంబ ఇల్లంతా గాలించింది. ఇంటి మొత్తానికి ఆమెకో చాపగాని, దుప్పటి, మంచం, తలగడలాంటిది దొరక లేదు. అన్నీ అంతా ఆక్రమించేసుకున్నారు. ఎవర్నైనా ఏమనాలో ఆమెకేం తోచలేదు. భర్తనయితే లేపి తీసుకొచ్చింది కాని ... ఎక్కడ పడుకోబెట్టాలో ఆమెకు తోచలేదు. నిద్రకళ్ళతోవున్న భర్తను చూసి ఆమె నొచ్చుకుంది. కావిడిపెట్టె తెరచి భర్తకో పంచె ఇచ్చి అరుగుమీద పక్కవేసింది.

అంతా కళ్ళు మూసుకుని ఒక్క కునుకయినా తీశారో లేదో .. పక్క ఊరినుంచి బాకావాడు వచ్చేశాడు. వాడెన్నో పెళ్ళిళ్ళకు హాజరయినదిట్ట .. పెళ్ళివారింట్లో బాకాలు ఊది. .ఉదరగొడితే తప్పించి పెళ్ళివారు తెమలరని అతని విశ్వాసమో ఏంటో. తెల్లారగట్ట వచ్చినవాడు వచ్చినట్లే ... బాకా వూదడం మొదలుపెట్టాడు.

అర్ధరాత్రి దాటేవరకూ భోగం మేళం గురించి ఆలోచిస్తూ కలలు కంటున్న కుర్రకారు ... కుయ్యో మంటూ లేచారు. బయ్‌మని బాకా ఊదుతున్న వాడిమీద కయ్‌మని పడిపోయేరు.

దాంతో వాడు ఉదయం . . మేము సాధన చేసుకోవద్దా — అన్నాడు దాంతో వాడూ వీళ్ళూ శిఖబట్ల గోత్రానికి దిగిపోయేరు. కొందరు పెద్దలు వెళ్ళి సర్దిచెప్పేరు.

ఇంతలో భజంత్రీలు వచ్చేరు వచ్చినవాళ్ళు వాళ్ళ సాధన వాళ్ళు వాళ్ళని చూసి బలగం పెరిగిన మహరాజులా బాకావాడూ అందుకున్నాడు

దీక్షితులుగారు లేచారు .. పెద్దలూ లేచారు పిల్లలు రాగాలు పెడుతూ సన్నాయి అందుకున్నారు. పెళ్ళివారిల్లు నిద్రలేచింది.

స్నాతకం పీటలమీద కూర్చున్నారు లలితాంబ, దీక్షితులుగారు.

పిల్లవాడికి కర్రా, చెంబూ, చెప్పులు గొడుగు ఇచ్చి కాశీకి వెళ్ళిరమ్మన్నారు.

పెండ్లి కుమార్తె తమ్ముడొచ్చి...జేమారిచ్చి . బెల్లంతో గడ్డంకిందకొట్టి ... బావగారిని పెళ్ళికి వొప్పించేడు.

ఏడేళ్ళ కుర్రాడు అలా బావగారిని బ్రతిమాలి పెళ్ళికి ఒప్పిస్తుంటే చూడముచ్చటేసింది. వరుడికి పదహారు లోపు . వామనమూర్తిలావున్నాడు.

స్నాతకం అయిన మర్నాడు వివాహానికి మల్కిపురం బయల్దేరారు పెళ్ళివారు. చిన్నా .. పెద్దా అంతా కలిసి వందమందిదాకా వున్నారు.

దీక్షితులుగారికి ఆ వూళ్ళో పలుకుబడి ఎక్కువే... అందువల్ల పదిబళ్ళు సంపాదించేరు. అయితేనేం. పెళ్ళివారు. బట్టలు అంటే మాటలు కాదు. అయిదు రోజుల పెళ్ళి అయినప్పటికీ—అరవై రోజులుండేటట్లు బయలుదేరారు. దాంతో కొంచెం సర్దుకొనటం... బయల్దేరటం ఒక పూట కాలం గడిచిపోయింది.

మల్కిపురంకి ప్రయాణం—ఇరవై మైళ్ళు. . బండ్లు రాత్రి పది గంటలకు చేరాయి. అన్నమో రామచంద్రా అని పిల్లలు...పెద్దలూ గోల.

పెళ్ళివారు అగ్గగ్గలాడుతూ అడుగులకు మడుగు లొత్తారు. అయిదురోజులూ . . గోలా... హడావుడి.

పరమేశ్వరశాస్త్రి సుబ్బలక్ష్మిని పాణిగ్రహణం చేశాడు అప్పగింతలయ్యేయి.

పెళ్ళికూతుర్ని తీసుకుని తిరుగుప్రయాణ మయ్యేరు. అయిదు రోజుల్లో. వేళకులేని తిండీ . నిద్రలో అలసట ముంచుకొచ్చింది

తిరిగొచ్చిన తరువాత గృహప్రవేశం మిగిలిన తంతులు యధావిధిగా జరిగిపోయేయి

"ఒరేయి దీక్షితులూ .బంధువులంతా వుండనే వున్నారు, ముగ్గురు బ్రహ్మచారులు పనికిరారని గౌతముడికి ఉపనయనమైనా చేశావుకాదు. ఇప్పుడా శంకలేదు కనక ఆ తంతు కూడా జరిపిస్తే బావుంటుందిరా" అంది సోమిదేవమ్మ

ఏడు యేండ్లు దాటుతున్న గౌతమునికి ఉపనయనం చేయలేకపోయాననుకుంటున్న దీక్షితులు గారికా ఆలోచన బాగానే తోచింది. కాని లలితాంబ మాత్రం,

"ఇప్పటికే బోలెడు ఖర్చు అయింది ఇంకా . ఆ లెక్కలేమీ చూసుకోలేదు అనుకున్నదానికి రెట్టింపు అయింది ఖర్చుచేసింది శివరామయ్యగారు; మీ తమ్ముడేకదా.. వాళ్ళని పిల్చి అడగండి" అంది.

కృష్ణశాస్త్రి వచ్చి పద్దుచూసి, " ఐదు వేలయింది అన్నయ్యా—, సంభావనలు ఎక్కువై పోయాయి. నీ పేరు చూడగానే ఎక్కడలేని పండితులూ వచ్చేశారు. సంభావనకే సంచీడు రూపాయి లయ్యేయి."

"పోనీరా .. బ్రాహ్మణ సంభావనల విషయం పదిసార్లు అనుకోకూడదు" అన్నారాయన.

ఇంతలో శివరామయ్య వచ్చేడు.

"అబ్బాయిగారి ఒడుగట ?"

"ఔను . డబ్బుకు రొక్కాయింపు వచ్చిందయ్యా .. "

"అందుకు వెనకతీయకండి.' ఊర్లో వచ్చిన సరుకు, సంరంభాలూ వదిలేస్తే సుమారు రెండువేలు మీరు నాకు ఇవ్వాల్సింది తేలింది. కావాలంటే మరో వెయ్యి పుచ్చుకుని పని నడిపించండి" అన్నాడు శివరామయ్య.

దీక్షితులుగారు తలూపి —

"సరే నోటు రాయమంటావా ?" అడిగేరు.

"అదేంటి దీక్షితులుగారూ ... ఎన్నడూలేంది, నేను వడ్డీకియ్యటంలేదే" అన్నాడు శివరామయ్య.

గౌతమశాస్త్రి ఉపనయనం యధావిధిగా జరిగిపోయింది. బ్రహ్మోపదేశం జరిగింది. మేధా జనం వరకు . నాలుగురోజుల వడుగు పూర్తయిన తరువాత దీక్షితులుగారు పెండ్లికొచ్చిన దంపతు లందరికీ నూతన వస్త్రాలు ఇచ్చేరు. సోమిదేవమ్మ తృప్తిగా నిట్టూర్చింది.

**(ఇంకా వుంది)**




### బి. హెచ్. ఎల్. డి. — కాకినాడ

అతనికి వివాహమైంది. నేనంటే ఇష్టం. నాకూ అతనంటే యిష్టమే. ఇద్దరం గవర్నమెంటు ఉద్యోగులం. నా భార్య అభ్యంతరం చెప్తుదంటున్నాడు. కాని తెలిస్తే ఉద్యోగాలు పోతాయి.

★ శుభం. ప్రేమ కోసం ఆమాత్రం త్యాగం చేయలేరా? కట్టుకున్న పెళ్లాలు 'అభ్యంతరాలు' చెప్పడం 'కోర్టుకు వెళ్లడం' యీ దేశంలో యిలాంటి పన్లకి యిప్పుడే — జరగదు. అంటే 'అవ్వా కావాలి బువ్వా కావాలంటే ఎలా?! ప్రేమించేసుకొండి ఉద్యోగాల సంగతి దేవుడెరుగు?! లేకపోతే — మీకు ఉద్యోగం పోతే అతని ప్రేమా పోతుందా? అదికూడా ఆలోచించుకోండి. నా దృష్టిలో — ఇలాంటి ద్వంద్వ సంబంధాలు చాలా అసహ్యకరమైనవీ, నీతి బాహ్యమైనవీను. ఇటువంటి విషయాలలో మగాడికి బుద్ధి లేకపోయినా ఆడదేనా ప్రలోభాలకి అతీతంగా వుండాలని నేను ఎదురు చూస్తాను .. జీవితంలో ఓ మగాడి పక్క పంచుకోడమే ముఖ్యం కాదు మనిషిగా నైతికబలంతో తలెత్తుకుని సగర్వంగా కూడా తిరగగలగాలి ఆడది.

### జి. కే. — వరంగల్

నా భార్యకు నా తల్లికి ఏమాత్రం సరిపోదు. ఇరువురిమధ్య నలిగాను. ఇప్పుడు నాకొకఅమ్మాయితో పరిచయం ఏర్పడింది. నాకు మనశ్శాంతి కల్గించింది.

★ కథ మామూలే! మీ కామెని 'కూడా' పెళ్లి చేసుకుంటే బాగుండుననిపిస్తూంది అంతేనా? మనసుంటే మార్గం వుంటుందన్నదానికిదో—నిదర్శన బ్రదర్. ఇప్పుడు దార్లు వెతుకుతున్నావన్నమాట. బాగుంది. అదేమిటో — ప్రస్తుతం ఆంధ్రలో చాలా మంది కిదో — సమస్యగా తలెత్తుతున్నట్టుంది — ఉత్తరాలు చూస్తుంటే!! సుఖాన్నున్న ప్రాణం కష్టపెట్టుకోకు ఇప్పుడు భార్యా తల్లీ మధ్య నల్గుతున్న తమరు సవతులమధ్య నల్గి — చివరికి సన్యాసాశ్రమం చేరాలి!

### డి. ఎస్. — దోహాఖతార్

భర్తను భార్య ఎప్పుడు నమ్ముతుంది?

★ మీరున్నచోట ఉంటే తప్పకనమ్ముతుంది!

### వి. ఎస్. ఆర్. — సామర్లకోట

అక్కా! ఆడదానికి అనుమానమే లేకపోతే ఎన్నో సంసారాలు సుఖంగా సాగేవేమో?

★ కించెత్తు అనుమానం అయినవారిమీద వుందంటే వారిపై అక్కర వున్నట్టులెక్క బ్రదర్. ఆడదానికి అనుమానం వుంటే ఆ శిక్ష ఆమె అనుభవిస్తుంది మగవాడికి అనుమానం వుంటే కొంపలు కూలిపోతాయి.

### ఎమ్. ఏ. — రాజమండ్రి

నా భర్త 'నీ మీద ఇష్టంలేదు. నా ఇంట్లో నీకు స్థానం లేద'ని బలవంతాన పుట్టింటికి పంపేశారు. నేను బికాం పాసయ్యాను. బి.ఇడిలో చేరి ముందు నా కాళ్లమీద నిలబడాలనే నిర్ణయానికి వచ్చాను. నా నిర్ణయం సరైనదంటారా? ఆయన మారే అవకాశం వుందంటారా?

★ నీ నిర్ణయం అద్భుతంగావుంది. ఆడదానికి— ఆమె ధైర్యమే రక్ష. చదువు పూర్తిచేసి ఆర్థికంగా ఎవరిమీదా ఆధారపడకుండా వుండడానికి ముందు ప్రయత్నం చేయాలి. ఇక ఆ పైన మీ భర్త మారి వస్తే — మీ షరతులమీద మీ నిర్ణయం మీరు చేసుకోవచ్చు. అయినా — అలాంటి భర్త కోసం — తీసుకున్న నిర్ణయాలు తోసిరాజనకండి. మళ్లా కథ మొదటికొస్తే?

### ఎమ్. ఎస్. ఎమ్. — సికింద్రాబాదు

కాలం అతి విలువైనదంటారెందుకు?

★ ఒక అంగుళం టైము అంగుళం బంగారంతో వెనక్కి కొనుక్కో కలరా?!

### డి. సిహెచ్. — పొన్నూరు

ఇరవై సంవత్సరముల వ్యక్తి సమాజంలో ఎలా బ్రతకాలి?

★ ఇరవై ఏళ్ల వానిలాగ? అంతేకానీ — ఏదో సినిమాలోలాగా — సంసారం యీదాలన్న తాపత్రయంలో పడకాదు. అది చదువుకునే వయస్సు. ఆర్థికంగా కాళ్లపై నిలబడడానికి ప్రయత్నాలు చేసే సమయం. కొద్దికొద్దిగా అమ్మాయిలని చూడాలనిపించినా చదువుమీద ధ్యాస మళ్లించాల్సిన సమయం; ఇదే వయస్సులో పాశ్చాత్య దేశాలలో కుర్రాళ్లు తమ బ్రతుకు తాము చూసుకుంటారు కాని మన యువకులకి తల్లితండ్రుల నీడా కావాలి, పాశ్చాత్య వైఖరి స్వేచ్ఛా కావాలి అనిపిస్తుంది!... అందుకే 'ప్రేమ ప్రేమ' అని తిరుగుతారు. తల్లితండ్రుల ఇష్టప్రకారం కట్నం కానుకలతో కళ్యాణం చేసుకుంటారు... యిష్టంలేని పెళ్లి చేసుకున్నాం అని వాపోతారు. గాని బలంగా తమకేం కావాలో తేల్చుకోలేరు... అందుకే — చదువుకునే వయస్సులో — ఇంకే ఆలోచనలూ రానివ్వకూడదు. డిగ్రీలే ముఖ్యం అనుకుంటూ లక్షలకి లక్షలు తల్లితండ్రులచేత కర్చు చేయించినప్పుడు — వాళ్ల మాటకి కట్టుబడి వుండాలి; యువతకి చదువెంత ముఖ్యమో సంపాదించకల శక్తి అంత ముఖ్యం. అందుకే డిగ్రీల వేటకంటే ఏదో దారిచూపే వృత్తి విద్య నయం. డిగ్రీ తరవాత? అంతా మరీచికే బాధపడి లాభం వుండదు. నేటి సమాజంలో పరిస్థితి అలా వుంది.

### జి. పి. — విశాఖపట్నం

ఏ కులం వాళ్లయినా నానాటికీ ఎందుకు వెనకబడిపోతున్నారో 'ఆరుద్ర'కు తెలుసు అంతేగాని లక్షవత్తుల వ్రతం చేస్తూ రామకోటి రాసుకొనే మీకెలా తెలుస్తుంది?

★ అదేస్వామీ నేనూ అంటుంట!! తెలియకపోతే తెలియచెప్పాలిగాని నా కులాన్నెందుకు ఆడిపోసుకోవడం?! నన్ను అవమానించినా, హింస పెట్టినా— నా లక్షణాల్లాగే నా కులమూ — మారదు. అది మీలాంటి మేధావులు గ్రహించి—ధోరణి మార్చండి. ఫలితం వుంటుంది.





300 గ్రాములు
రూ. 3·20
(స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగాగమనించండి!

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్







### మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది

### కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చు పెడుతున్నారు?
250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ 2 67
(300 గ్రాములకి రూ 3 20) అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు

### ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియు తమిళనాడులలో దొరుకును.

MCA-TDB-51-Te.

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్, బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన
మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు



"అనంత రాగాలు"లో రోహిణి, శుభాకర్




## ఎన్. టి. ఆర్. తాజా చిత్రం

రాజకీయ రంగంలో ప్రవేశించాక ఎన్.టి.ఆర్. అంగీకరించిన తొలి చిత్రాన్ని పల్లవి ఫిలిమ్స్ ఎస్. వెంకటరత్నం, దేవీ ప్రొడక్షన్స్ కె. దేవీవరప్రసాద్, జి.సి. కృష్ణంరాజు కలిసి నిర్మిస్తారు. జూలై 20 నుంచి ఆగస్టు 15 వరకు హైదరాబాద్‌లో ఏకబిగిన చిత్రీకరణ పూర్తయ్యే ఈ చిత్రానికి జూలై 10 న తొలిగీతం ధ్వనిముద్రితమైంది. జయసుధ నాయిక. సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, గిరిబాబు, అల్లు రామలింగయ్య తక్కిన నటవర్గం. పరుచూరి సోదరులు స్క్రిప్టు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, ఎస్. వెంకటరత్నం ఛాయ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కె. బాపయ్య దర్శకుడు.

"ఇల్లంతా సందడి"లో ప్రభ



## "ఈనాడు" చిత్రంకోసం కృష్ణా గార్డెన్స్‌లో బాహ్యంతర స్టూడియో

కృష్ణ హీరోగా పద్మాలయసంస్థ రూపొందించే మరో సంచలనాత్మక చిత్రం "ఈనాడు" కోసం వడపళనిలో అరుణాచలం స్టూడియో పక్కన కృష్ణా గార్డెన్స్‌లో కొన్ని వాడలు వెలిశాయి. సినిమాసెట్స్‌కు మల్లే మోల్డ్స్‌తోకాక ఇటుకలు, పూరికప్పులతో మన ప్రాంతపు సహజత్వంతో నివాసయోగ్యమైన 22 ఇళ్ళను చిత్రకథకు, చిత్రీకరణకు అనువుగా కళా దర్శకుడు కొండపనేని రామలింగేశ్వరరావు తయారు చేయించారు. మూడెకరాలస్థలంలో మే 31 నుంచి జూలై 15వరకు ఈ ఇళ్ళను నిర్మించడానికి దాదాపు రెండులక్షలు వ్యయమైందని చిత్ర నిర్మాణ సారధి జి. ఆదిశేషగిరిరావు తెలిపారు. "ఈ ఓపెన్ స్టూడియోలో మూడువంతుల చిత్రం తయారౌతుంది," అన్నారు డైరెక్టర్ పర్వతనేని సాంబశివరావు. ముప్పైమందికి పైగా ప్రముఖ తారాగణం పాల్గొంటున్న ఈ చిత్రానికి పరుచూరి సోదరుల సంభాషణలు, జె. వి. రాఘవులు సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, కె. రామలింగేశ్వరరావు శిల్పం, కంచెర్ల పూర్ణచంద్రరావు—త్రిపురనేని వర ప్రసాద్ సహ దర్శకత్వం, పెదబాబు సహాయ దర్శకత్వం, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు నిర్వహిస్తున్నారు. "ఆగస్టులో విజయవాడ—గుంటూరులమధ్య పతాక సన్నివేశాలు, ప్రబోధాత్మకమైన రెండు శ్రీ శ్రీ గేయాలు చిత్రీకరించబడతాయి," అన్నారు నిర్మాత జి. హనుమంతరావు. ఈ చిత్రంలో కృష్ణ సరసన నాయిక లేకపోవడం ఒక విశేషమైతే, కృష్ణ మీద బుర్రకథ చిత్రీకరణ మరో విశేషాకర్షణ.

"ఈ చరి



# విశేషాలు

-జి. వి. జి.

## హీరో మోహన్‌బాబు కొత్త చిత్రాలు

వ్యాపారపరంగా – నిర్మాతగా, హీరోగా "ప్రతిజ్ఞ" చిత్రం మోహన్‌బాబుకి పేరు తెచ్చింది. భగీరథీ స్ట్రీట్‌లోని ఆయన అందమైన భవంతిలో చాలామంది నిర్మాతలు కనిపించారు. "మా బోయిన సుబ్బారావు దర్శకత్వంలో నవభారత్ బాబూరావుగారు చిత్రం ఆగస్ట్‌లో ప్రారంభమవుతుంది. ఇందులోనూ, ఆ తర్వాత సెప్టెంబర్‌లో పి. చంద్రశేఖరరెడ్డిగారి దర్శకత్వంలో ఎస్. వి. సుబ్బరాజుగారు నిర్మించే చిత్రంలోనూ నాది రెండు విలక్షణమైన హీరో పాత్రలు. అంగీకరించిన ఇతర చిత్రాల గురించి వచ్చేవారం తెలియజేస్తాను," అన్నారు మోహన్‌బాబు. తొలుత గ్లామర్ విలన్‌గా దాదాపు హీరోలకున్నంత ఫాలోయింగ్ సంపాదించుకున్న మోహన్‌బాబు ఇంతవరకు 155 చిత్రాలకు పైగా నటించారు. "నన్ను విలన్‌గా పరిచయం చేసి, కేరెక్టర్ ఆక్టర్‌గా, సపోర్టింగ్ హీరోగా, చివరికి హీరోగా చేసింది మా గురువుగారు దాసరి నారాయణరావుగారు. ఇంకా కె. రాఘవేంద్రరావు, కె. ఎస్. ఆర్. దాస్, క్రాంతికుమార్, విజయేంద్ర రెడ్డి, ప్రభాకరరెడ్డి, భాస్కర్‌గార్లు ఎన్నో చక్కని పాత్రలిచ్చి ప్రోత్సహించారు. నా అభిరుచికి అనుగుణంగా పాజిటివ్ హీరో పాత్ర ధరించాలనుకుని 'ప్రతిజ్ఞ' నిర్మించాను. పరిశ్రమ, ప్రేక్షకులు, పాత్రికేయులు మొదటినుంచీ నన్ను ఆశీర్వదించారు, ఆదరాభిమానాలందజేశారు, అభినందించారు. అందరికీ నా హృదయ పూర్వకమైన కృతజ్ఞతలు," అన్నారు మోహన్‌బాబు.



అమృతా ఫిలింస్ 8వ చిత్రంలో సుధాకర్, రాజ్యలక్ష్మి

ఏ సినిమాలో అనుపమ, జ్యోతి



## అధ్యక్షులుగా ముగ్గురు తెలుగు చిత్ర నిర్మాతలు.

దక్షిణ భారత చలన చిత్ర వాణిజ్య మండలి అధ్యక్షులుగా ఎల్. వి. ప్రసాద్ ఎన్నికయితే, తెలుగు చలన చిత్ర నిర్మాతల మండలి అధ్యక్షులుగా ఎం. ఎస్. రెడ్డి, ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఆఫ్ సౌత్ ఇండియా అధ్యక్షులుగా జి. హనుమంతరావు ఎన్నికయ్యారు.

నిర్మాతల మండలికి తాతినేని ప్రకాశరావు, కె. క్రాంతికుమార్ ఉపాధ్యక్షులు. కె. ఛటర్జీ, జి. ఆదిశేషగిరిరావు గౌరవ కార్యదర్శులు. ఎం. బాలయ్య కోశాధికారి.

ప్రొడ్యూసర్స్ గిల్డ్ ఎగ్జిక్యూటివ్ కమిటీ సభ్యులుగా ఎన్నికైన పన్నెండుగురిలో పి. పుల్లయ్య, తాతినేని ప్రకాశరావు, ఎం. బాలయ్య, శ్రీకాంత్ సహతా ఉన్నారు.

'ఇల్లాలి కోరికలు'లో శోభన్‌బాబు, జయసుధ

## సినిమా

## భక్త ధ్రువ మార్కండేయ చిత్రం అగస్ట్ విడుదల

"పిల్లలచేత అత్యద్భుతంగా నటింపచేశారు. అసలు ఆరితేరిన పెద్దతారలు నటించిన చిత్రంలా ఉంది. 'మల్లీశ్వరి, విప్రనారాయణ' తర్వాత మీరూ, రాజేశ్వరరావుగారూ కలిసి మధురాతి మధురమైన మ్యూజిక్ ఇచ్చిన చిత్రమిది," అంటూ భరణీ పిక్చర్స్‌వారి "భక్త ధ్రువ మార్కండేయ" చిత్రం ఫస్ట్ కాపీని చూసి, ఎంతోమంది ప్రశంసావర్షాలు కురిపించారు. డాక్టర్ భానుమతీ రామకృష్ణ ఈ చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, సంభాషణలు, సంగీత పర్యవేక్షణ, దర్శకత్వంతోపాటు ఆర్ట్ డైరెక్షన్ కూడా నిర్వహించారు. "ఈ చిత్రాన్ని నిర్మించాలని ఎన్నో ఏళ్ళుగా కలలుగన్నాను, స్వయంగా చిత్రకారిణిని కూడా అవడం వల్ల సెట్స్ కూడా ముందుగా రూపకల్పన చేసుకుంటూ వచ్చాను. పౌరాణిక చిత్రమవడం వల్ల ఎంతో జాగ్రత్తగా సెట్స్‌ను రూపొందించవలసి వచ్చింది," అన్నారామె. ఇటీవల సెన్సార్‌వారిచే 'క్లీన్' సర్టిఫికేట్ పొందిన చిత్రాలలో ఇదొకటి. "ఆగస్ట్‌లో రిలీజ్ చేస్తున్నాం," అన్నారు ప్రముఖ డిస్ట్రిబ్యూటర్ హరికృష్ణ.



'కయ్యాల అమ్మాయి—కలవారి అబ్బాయి'లో మంజుల



## "సాగర సంగమం"

"సంగీత నృత్యప్రధాన చిత్రం," అన్నారు డైరెక్టర్ కె. విశ్వనాథ్. "సిరిసిరిమువ్వ, తాయారమ్మ—బంగారయ్య, శంకరాభరణం, సీతాకోకచిలక" అనంతరం నిర్మాత ఏడిద నాగేశ్వరరావు జూలై 15 న పాటల రికార్డింగ్‌తో ప్రారంభించిన సాగర సంగమం చిత్రంలో కమలహాసన్, జయసుధ, శరత్‌బాబు ప్రభృత తారాగణం. జంధ్యాల సంభాషణలు, ఇళయరాజా సంగీతం, బాలు మహేంద్ర ఛాయ, నండూరి విజయ్ సహదర్శకత్వం నిర్వహిస్తారు.

## ఇతర భాషలలో తెలుగు చిత్రాలు

★ పద్మాలయ సమర్పణలో "గృహప్రవేశం" చిత్రాన్ని హిందీలో వి. వి. కంబైన్స్ నిర్మిస్తుంది. జితేంద్ర, రేఖ, అశోక్‌కుమార్, శశికళ ముఖ్య భూమికలు నిర్వహిస్తారు.

★ "రాధా కల్యాణం" హిందీలో "ఓ సాత్ దిన్"గా బాపు దర్శకత్వంలో తయారవుతుంది.

★ "జస్టిస్ చౌదరి" చిత్రాన్ని తమిళ నటుడు, నిర్మాత కె. బాలాజీ తమిళంలో తీస్తున్నారు. తెలుగులో ఎన్.టి.ఆర్. నిర్వహించిన ద్విపాత్రలలో—తండ్రి పాత్రను శివాజీగణేశన్, కొడుకు పాత్రను శివాజీ కొడుకు ప్రభు నిర్వహిస్తున్నారు.

## కె. ఎస్. ఆర్. దాస్ దర్శకత్వంలో కృష్ణ

శ్రీకాంత్ పిక్చర్స్‌వారు అక్టోబర్‌లో షూటింగ్ మొదలెట్టే చిత్రంలో జయప్రద నాయిక.

1983 మార్చిలో సెట్స్‌కు వెళ్లే త్రిమూర్తి ప్రొడక్షన్స్ చిత్రంలో శ్రీదేవి నాయిక. భమిడిపాటి రాధాకృష్ణ రచయిత. సత్యం సంగీత దర్శకుడు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు.

## నిర్మాత కె. విశ్వేశ్వరరావు చిత్రాలు

'గృహప్రవేశం' చిత్రాన్ని హిందీలో నిర్మించే కె. విశ్వేశ్వరరావు శ్రీ విశ్వజ్యోతి ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో "కొడుకులు — కోడళ్ళు" చిత్రాన్ని బి. భాస్కరరావు దర్శకత్వంలో నిర్మిస్తారు. ప్రభాకరరెడ్డి, జయంతి, కవిత, మేనక, గీత ఆదిగాగల వారుంటారు. వచ్చే ఫిబ్రవరి నుంచి కృష్ణ, శ్రీదేవి, శారద వగైరా తారాగణంతో మరో చిత్రాన్ని మొదలెడతారు.



"ఆ చిత్రంలో నా ఏడుపు బాగుందని పేరొచ్చింది దాన్ని ఎల్‌పీగా విడుదల చేయిస్తున్నాను!"

## జంధ్యాల దర్శకత్వంలో కృష్ణ, చిరంజీవి

"జూన్‌లో మొదలయ్యే నిర్మాత ఎస్.వి. వెంకన్న బాబు చిత్రంలో కృష్ణ హీరో. వచ్చే ఫిబ్రవరిలో సెట్స్‌కు వెళ్లే నిర్మాత ఆదుర్తి ప్రసాద్ చిత్రంలో చిరంజీవి హీరో," అని దర్శక రచయిత జంధ్యాల తెలిపారు.

## నమోదు చేయబడిన చిత్రాల పేర్లు

లక్ష్మి ఎంటర్‌ప్రైజెస్ "మధుర మీనాక్షి", శ్రీ వాణి ఆర్ట్స్ "మేనరికం", ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ "అవార్డ్", శ్రీ వెంకట్ ఫిలిమ్స్ "కదిలింది ఆకలి రథం", శ్రీ శివశంకర్ ఆర్ట్ క్రియేషన్స్ "అమరజీవులు", శ్రీ దేవి రమణ ఫిలిమ్స్ "దైవ దర్శనం", లక్ష్మినారాయణ క్రియేషన్స్ "దొంగల్లో దొర", రమా ఫిలిమ్స్ "ఇద్దరు దొంగలు", హిమ మూవీస్ "కీర్తి సింహాసనం", అనురాధా సినీ ఎంటర్‌ప్రైజెస్ "కురుక్షేత్రంలో సీత", బాబు ఆర్ట్స్ "ఇల్లాలు — ప్రియురాలు", తెలుగు చిత్ర ఇంటర్నేషనల్ "కల్లు కొండయ్య", నారాయణ ఆర్ట్స్ మూవీస్ "హంతకులకు సవాల్", చరిత్ర చిత్ర "సంభవామి యుగే యుగే", పి. ఎస్. ఆర్. పిక్చర్స్ "రోషగాడు".

'రాగం—తానం—పల్లవి'లో

పూజాసక్సేనా, చంద్రమోహన్

## సినిమా



"వయ్యారి భామలు—వగలమారి భర్తలు"లో కృష్ణ, ఎన్.టి. రామారావు

## "పట్నం వచ్చిన పతివ్రతలు"లో పట్నాల పురాణంతో మాలిష్ !

### [ప్రహసనం]

[కొండ(లావు — రావు గోపాలరావు. సబ్ఇన్‌స్పెక్టర్—నూతన్‌ప్రసాద్. సోంబాబు—ధవ్]

తేల్ మాలిష్‌వాలా కొండ(లావు ఆ హోటల్ 110వ నెంబర్ గదిలో సోంబాబు అనే విజయనగరం వాస్తవ్యుడు దిగాడని తెలుసుకొని, ఆ గదిలోకి ప్రవేశించాడు. "గుడ్‌మోర్నింగ్, సోంబాబుగారూ!"

"ఆఁ !" సోంబాబు ఉలిక్కిపడ్డాడు. "నా పేరు నీకెలా తెలుసు ?"

"అదే, బాబూ ! ఆ మీసకట్టు, ఆఫీసు కట్టు, ఆ పులిగోరు పతకం — మీరు ఖచ్చితంగా మా విజయనగరం సోంబాబుగారే!" అంటూ మాలిష్ ప్రారంభించాడు.

"ఇదేమిటోయ్ — నేను అడక్కుండానే తగులు కుంటున్నావ్ ?"

"ఏవిటి అడిగేది ?... అబ్బెబ్బే... అదేం లేదండి, బాబూ ! ఈ లాడ్జికొచ్చినోడు ఎవరైనా మా మాలిష్ చేయించుకోకుండా బయటకెళ్లడానికి వీల్లేదు, బాబూ... ఒక్క మాటంటాను — మీకు తెలిసే ఉంటుంది. మన విజయనగరం ఎలాంటి ఊరు, బాబూ ? విజయనగరంలాంటి ఊరు ఓల్ యిండియాలోనే కాదు; యింగ్లాండులో కూడా లేదని యింగ్లీషు పేపర్లో వేశారంట."

"నిజంగానే !"

"నిజమంటారేంటి, బాబూ ? ఆలిండియా రికార్డు గంటసాల వెంకటేశ్వరరావుదే వూరు, బాబూ ? విజీనగరం... మరి, వీణ... ఫీ... పిడేలు ద్వారం వెంకటస్వామిగారిది యే వూరు, బాబూ ? హాఁ... మన విజీనగరం — ఆ బాబుదీ విజీనగరమే— మనదీ విజీనగరమే."

"ఆగాగవయ్యా, బాబూ ! నాది విజయనగరం అనుకుని తెగ పొగిడేస్తున్నావు. నాది విశాఖపట్నం."

"అమ్మో ! దెబ్బ కొట్టేశావు, బాబూ !" అంటూ కొండ(లావు ఆగి, కొన్ని క్షణాలు నిశితంగా చూసి, మళ్ళీ పాలిష్ చేయడం మొదలెట్టాడు. "యేంట్రా — పెర్సనాలిటీ చూస్తే విశాఖపట్నం పెర్సనాలిటీ... విజీనగరం అంటాడేంటాని యిందాకట్నుంచి మనసు పీకేస్తూండాది. ఆహాఁ ! యేం వూరయ్యా బాబూ మన విశాఖపట్నం !"

"భలేవాడివయ్యా ! మరి యిందాకట్నుంచి విజయనగరం అన్నావు ?"

"అన్నానంటే — పుట్టడం అంటే అక్కడే పుట్టానుగాని విద్య నేర్చుకున్నదంతా విశాఖపట్నమే, బాబూ ! నేనే కాదు. గంటసాల వెంకటేశ్వర్రావు కూడా కీర్తన్లు విజయనగరంలో నేర్చుకున్నా, గొప్ప కచ్చేరీలన్నీ విశాఖపట్నంలోనే చేశాడు. కోడి రామ్మూర్తిగారు కూడా దండేలంటే యింగ్లాండులో తీశారుగాని, కుస్తీలన్నీ విశాఖపట్నంలోనే కొట్టారు. బాబూ ! పంచాయతీ బోర్డు పెసిడెంటల్లో జిల్లా పరిషత్ ఛైర్మన్ యెంత గొప్పోడో మిగతా వూళ్ళ కంటే విశాఖపట్నం అంత గొప్పది."

"ఆఁ. భలే ఉందయ్యా ! నీ మాలిష్ కంటే నీ మాటలు బాగున్నాయయ్యా. ఇదిగో," అంటూ సోంబాబు ఒక రూపాయి ఇవ్వబోయాడు.

"ఛీ—ఛీ ! యేంటీ ? కర్ణుడు పుట్టినూర్లో పుట్టి, రూపాయిస్తారా ?"

"ఏంటీ ! కర్ణుడు విశాఖపట్నంలో పుట్టాడా ?"

"మీకు తెల్దేంటీ ? కర్ణుడు విశాఖపట్నంలో పుట్టకపోతే — ఆ డొనేషన్ దానాలు ఎక్కడ్నుంచొస్తాయండి ?"

"ఏమోగాని, ఇది చెప్పి నన్ను కర్ణుడ్ని చేశావు. అయిదుంచు."

ఆ అయిదు రూపాయలు పుచ్చుకొని కొండ(లావు వెళ్ళి, కాస్సేపటికి తప్పతాగొచ్చాడు.

"ఏమిటయ్యా, బాబూ, మళ్ళీ వచ్చేశావు ?" అన్నాడు సోంబాబు విస్తుపోతూ.

"మళ్ళీ రావడమేంటిరా బక్కనాకొడకా !"

"ఆఁ !" సోంబాబు ఉలిక్కిపడ్డాడు. "ఏంటీ ! నన్ను తిడుతున్నావా ?"

"తిట్టడమేంటిరా — నిన్ను ఉతక్కపోతే ? చెరుకుగడలాంటి పెర్సినాల్టి నువ్వూనూ. యేంటీ ! కర్ణుడిది విశాఖపట్నమా ?"

"నువ్వే కదయ్యా, బాబూ, అన్నావు ?"

సుందర హృదయాల ముందర ఓ అగ్నిపర్వతం!

డి. సత్యనారాయణరాజు సమర్పించు

దాసరి నారాయణరావు

లక్ష్మీగణేష్ చిత్ర

# స్వయంవరం

A

నిర్మాతలు: డి. రామరాజు,
డి. విజయరామరాజు

నిర్వహణ: పి. సుబ్రహ్మణ్యం

సంగీతం: సత్యం



సీడెడ్: స్వర్ణయుగ

SAI KRISHNA ADS




## సినిమా

"ఆఁ...రేయ్... కర్ణుడు పుట్టింది, పెరిగింది, చదివింది – కాకినాడ.".

"ఆఁ!"

"ది గ్రేట్ ఎస్వీ రంగారావుది కాకినాడ. కామెడీకింగ్ చంబలకెవంబ రేలంగి వెంకట్రామయ్యది కాకినాడ. మరి... ఆయన గురువు సుబ్బిశెట్టి ఛాలంజి గండికోట జోగినాధంగారిది కాకినాడ. మాలిష్ ప్రొపైటర్ కొండల్రావ్ —"

"వాడెవడు ?"

"నేనయ్యా. నాదీ కాకినాడ. అందుచేత, కాకినాడంటే కబడ్దార్."

"అలాగే... నా దగ్గర డబ్బులు తీసుకొని, ఆ డబ్బుల్తో తాగి, నన్నే తిడుతున్నావా ?"

"అది మన పాలసీ... యెవడి దగ్గరో డబ్బులు తీసుకుని తాగి, నేనెవడినో తిట్టను... అది సరే... ఏరా, నీ పెర్సనాల్టీకి నేను మాలిష్ చేయాలా ?" అంటూ మీదికి రాబోయాడు కొండల్రావు.

"ఆఁ!" గుడ్డు తేలేశాడు సోంబాబు.

"లేకపోతే, మూడో నెంబరు నొక్కానంటే, కుడిసెయ్యి అవుట్ !"

"అమ్మో !"

"నాలుగో నెంబరు నొక్కానంటే నడుము. అయిదో నెంబరు నొక్కానంటే—అంతే సంగతులు," అంటూ సోంబాబు మెడ పట్టుకొని, "కాకినాడకు జై అను !" అని గద్దించాడు కొండల్రావు.

"కాకినాడకి జై !". అంటూ సోంబాబు ఏడ్పు ముఖం పెట్టాడు.

"కాకినాడ కబడ్దార్ !" అంటూ కొండల్రావు ఆ గదిలోంచి బయటకు నడిచాడు.

* * *

ఆ లాడ్జికి కానిస్టేబుల్స్‌తో వచ్చిన ఇన్‌స్పెక్టరు ఠీవిగా గాలిలో లాఠీ తిప్పుతూ, "రావయ్యా, శివయ్యా, కానిస్టేబుల్స్ ! మన దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉందిప్పుడు. వ్యభిచారం అనేది దాను రాను పెరిగిపోతోంది. మీరీ లాడ్జిలోని ప్రతి రూమూ, ప్రతి తలగడా చెక్ చేసి, ఆడకూతురు కనబడితే చాలు – వాన్ ఎక్కించేయండయ్యా ! వెళ్లండి !" అంటూ హుకుం జారీ చేశాడు.

ఇన్‌స్పెక్టర్ దగ్గరికి "గుడ్‌మార్నింగ్, ఇన్‌స్పెక్టర్ !" అంటూ కొండల్రావు వచ్చాడు.

"దండాలకి, దండలకి లొంగే మనిషిని కాను నేను. ఎందుకంటే దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉంది. లొంగకూడదు," అని ఇన్‌స్పెక్టర్ అంటూండగా హఠాత్తుగా అతని తలమీద కొండల్రావు చెయ్యి వేశాడు. "వాట్ నాన్సెన్స్ ! నా తలమీద చెయ్యి వేస్తున్నావు ?"

"ఇదేంటి, సార్, దేశ పరిస్థితుల్లాగే తమరి తలకాయ కూడా పెనం మీదేసిన పెసరట్టులాగ కుతకుత లాడిపోతున్నదండి."

"నేనిప్పుడు డ్యూటీ మీదున్నాను. డ్యూటీలో ఉండగా మాలిష్ చేయించుకుంటే – అమెరికావాళ్ళు చూస్తే ఏమనుకుంటార్రా, ఇడియట్ !"

"ఎవరూ చూడకుండా ఆ మూల సోఫామీద నేను గవ్‌చిప్‌గా చేస్తానండి. రండి."

"ఉండు. నా టోపీ ఏదీ ?"

"మీరేమీ అనుకోకపోతే ఒక మాట చెబుతాను. మీలాంటి ఖరీదైన తలకాయల్ని కొబ్బరికాయల్లాగ కేర్లెస్సుగా ఒగ్గేయకుండా అప్పుడప్పుడు మాలీష్ చేయించుకోవాలండి. ఎంచేతంటే — మన దేశానికి ఢిల్లీ ఎలాంటిదో మన బాడీకి ఈ తలకాయ అలాంటిది."

"అందులోనూ తూగో తలకాయిది. అంటే, తూర్పు గోదావరిజిల్లా తలకాయ. కాకినాడ మాది. పది ఢిల్లీలతో సమానం."

"అవునాండీ... తలకాయేమో ఢిల్లీ అయితే, ఈ గుండెకాయ – ఇది – హయిద్రాబాదండి. అంటే, స్టేట్ గవర్నమెంటండి. ఈ కడుపులో ఉన్న పేగులన్నీ పార్లమెంటు నెంబర్లండి. ఈ మెదడులో



'గ్రామ కక్షలు' లో శ్రీదేవి

ఉన్న నరాలన్నీ కేబినెట్ మినిస్టర్లండీ... మరి యియ్యన్నీ కరెక్టుగా పని చెయ్యాలంటే..."

"నేను నీచేత మాలిష్ చేయించుకోవాలంటావు. అంతేగా ? ఏంటలా చేతులు నలుపుకుంటావ్ ? డబ్బు కోసమా ? చూడూ – దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉంది. డబ్బులు అడక్కూడదు. తీసుకోకూడదు."

"అయ్యో ! చెప్పడం మర్చిపోయాను, బాబూ ! నిన్న డి. ఎస్. పి. గా మీకు ప్రమోషన్ అయిపోయినట్టు నాకు కలొచ్చింది."

"డీయస్పీగానా ? అంటే – ఏదైనా లీవ్ వేకెన్సీలోనా ? లేకపోతే పర్మనెంట్ వేకెన్సీలోనా ?"

"ఏదో అడుగుదామనుకునేసరికి జీపెక్కి యెళ్లిపోయారు."

"జీప్ ఎక్కి వెళ్ళిపోయానా ? ఆఁ... కలెక్టరు గారింటికి డిన్నరుకు వెళ్ళుంటాను."

"బాబూ ! మీ తలకాయ చాలా గట్టిదండి. జాగ్రత్తగా చూసుకోవాలి," అంటూ కొండల్రావు లేచాడు.

"నా తలకాయకి ఎటువంటి డేంజరూ రాకూడదనే నిద్దట్లోకూడా టోపీ పెట్టుకుని పడుకుంటాను."

"ఆఁ... అది !" అంటూ కొండల్రావు వెళ్ళిపోయాడు.

ఇంతలో కానిస్టేబుల్స్ తిరిగొచ్చి, "సార్, సార్ ! ఆడంగులెవరూ దొరకలేదు, సార్ !" అంటూ చావు కబురు చెప్పినట్లు చెప్పారు.

"వ్వాట్ ! ఒక్కటి కూడా దొరకలేదా ? అంటే — దేశం చాలా క్లిష్ట పరిస్థితుల్లో ఉందన్న మాట ? పదండి. మనమే వేన్ ఎక్కుదాం," అని ఇన్‌స్పెక్టర్ కదలబోతూండగా కొండల్రావు మళ్ళీ నాలుగు చుక్కలు వేసుకొచ్చాడు. "ఏయ్, ఇన్‌స్పెక్టర్! యెళ్ళిపోతున్నావేంట్రా, ఇన్‌స్పెక్టర్?"

ఇన్‌స్పెక్టర్ గుడ్లు మిటకరించాడు. "నన్ను ఏయ్ అంటావురా, ఇడియట్ ! షటప్ !"

"అబ్బా ! నేన్నోరుమూసినా నా కడుపులోని గవుర్నమెంటు సారా నోరు మూయొద్దూ ? అవునూ — నీకు డీయస్పీగా ప్రమోషన్ కావాలా ? బీట్ కానిస్టేబుల్‌గా కూడా పనికిరావు."

"వ్వాట్ ?"

"అవునూ — నీది కాకినాడా ? అయితే, ఏంటి గొప్ప ? నాది బెజవాడ."

"అయితే, ఏంట్రా బెజవాడ గొప్ప ?"

"మా బెజవాడలో ఉన్నన్ని ఈగలు, దోమలు కాకినాడలో ఉన్నాయా ? మీ కాకినాడలో రోడ్డుమీద నడుస్తాయి సిటీబస్సులు. మా బెజవాడలో మనుషుల మీద నడుస్తాయి. ఎంత గొప్పోడయినా — ముక్కు మూసుకోకుండా మా బెజవాడ సైడుకాలవ పక్కన నడవమని చెప్పు — మీ కాకినాడలో నడిచినట్టు."

ఇన్‌స్పెక్టర్ కోపంతో ఊగిపోతూ, "చూడూ ! నిన్నిప్పటికి తొంభైతొమ్మిదిసార్లు అరెస్టు చేశాను. అయినా, నువ్వింకా సీమటపాకాయ పేలినట్లు పేలుతూనే ఉన్నావు. వేన్ ఎక్కించెయ్యండిరా. వందోసారి పూర్తయిపోతుంది," అన్నాడు.

"నాకేం భయంలేదు. కాకపోతే, రేపు తెల్లారేపాటికి బయటకొచ్చేస్తాను. నా వెనకాల ఒక పవర్‌ఫుల్ యూనియన్ వుంది. మర్చిపోయాను. నా సంచి అక్కడుంది. తెచ్చుకుంటాను," అంటూ కొండల్రావు బయలుదేరాడు.

విజయ బాపినీడు నేతృత్వంలో అట్లూరి రాధాకృష్ణమూర్తి, కొమ్మన నారాయణరావు నిర్మించే శ్రీనివాసా ప్రొడక్షన్స్ "పట్నం వచ్చిన పతివ్రతలు" చిత్రానికి మౌళి దర్శకుడు. ★

'ముగ్గురమ్మాయిల మొగుడు'లో
ముచ్చెర్ల అరుణ, చంద్రమోహన్

# "మనిషికి ఓర్పు ముఖ్యం అదే నా విజయ రహస్యం"!

## — ఎల్. వి. ప్రసాద్



"ఇతరుల చిత్రాన్ని నేను డైరెక్ట్ చేసి ఇరవై ఆరేళ్ళకు పైగా అయింది. డి. వి. ఎస్. రాజుగారి పట్ల గల గౌరవంకొద్దీ ఇప్పుడీ బాధ్యతను నిర్వహిస్తున్నాను. రాజుగారు చలన చిత్ర పరిశ్రమకు ఎనలేని సేవ చేశారు. మహోన్నతమైన వ్యక్తి కూడా," అన్నారు దక్షిణ భారత చలన చిత్ర వాణిజ్య మండలి (1982–83) అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికైన ప్రముఖ దర్శక నిర్మాత, స్టూడియో అధిపతి శ్రీ ఎల్. వి. ప్రసాద్. ఈయన రాజుగారు హిందీలో నిర్మించే "న్యాయం కావాలి" చిత్రానికి డైరెక్టరు. "ఒకటి రెండు కేరెక్టర్ రోల్స్ విషయంలో తప్ప నేను స్క్రిప్టులో ఆట్టే మార్పు చేయడంలేదు. తెలుగు చిత్రాన్ని శ్రీ కోదండరామిరెడ్డి ప్రతిభావంతంగా డైరెక్ట్ చేశారు. ప్రజలు బాగా ఆదరించారు కూడా," అన్నారు ప్రసాద్. ఆగస్ట్‌లో సెట్స్‌కు వెళ్లే ఈ చిత్రంలో మిథున్ చక్రవర్తి, రతి అగ్నిహోత్రి ప్రధాన పాత్రధారులు.

అట్టడుగునుంచి అంచెలవారీగా అత్యున్నత శిఖరాన్ని చేరుకున్న ఆదర్శమూర్తి ఎల్. వి. ప్రసాద్.

17–1–1908లో ఒక సామాన్య రైతు కుటుంబంలో జన్మించిన అక్కినేని లక్ష్మీ వరప్రసాదరావు ఉద్యోగాన్వేషణలో ఇంట్లో భార్యాబిడ్డలకు కూడా చెప్పకుండా 1929లో బొంబాయికి బయలుదేరారు. అక్కడొక దర్జీ కొట్టులో కాస్త నిలువ నీడ దొరికింది. పగలు ఆ కొట్టంతా ఊడ్చి, ఆ తర్వాత ఉద్యోగాన్వేషణకు కాళ్ళరిగేలా ఆ మహానగరమంతా తిరిగేవారు. అలసి సొలసి రాత్రి ఎప్పుడో కొట్టుకు చేరుకునేవారు. మొదట వీనస్ పిక్చర్స్‌లో పదిహేను రూపాయల నెల జీతంమీద ఓ ఉద్యోగం దొరికిందిగాని, మొదటి నెల జీతం అందేలోగానే ఆ సంస్థ మూత పడింది. ఆ తర్వాత ఓ కార్నివాల్‌లో రోజుకు రూపాయిన్నర బత్తెంమీద పని... అక్కడ రాత్రి రెండు గంటలదాకా పనిచేసి, ఒక కప్పు టీ తాగి, అయిదు మైళ్ళ దూరం నడిచి, ఆ దర్జీ కొట్టుకు చేరుకునేవారు. ఓ మారు "స్టార్ ఆఫ్ ది ఈస్ట్" అనే మూకీ చిత్రంలో చిన్న వేషం దొరికింది. ఆ రోజుల్లో చిన్నవేషాలు వేసేవాళ్ళు రిఫ్లెక్టర్లు మోయడంలాంటి వెట్టిచాకిరీలు కూడా చేసితీరాలి. ఆ తర్వాత మన దేశంలో తయారైన తొలి టాకీ చిత్రం "ఆలమ్ ఆరా"లో నెలకు 30 రూపాయల జీతంమీద ప్రసాద్ మాటామంతీ లేని నాలుగైదు చిన్నవేషాలు వేశారు. కీ॥ శే॥ హెచ్. ఎం. రెడ్డి తమిళంలో తీసిన తొలి టాకీ "కాళిదాసు"లో పురోహితుని వేషం, "సీతా స్వయంవర్"లో ఓ చిన్నవేషం, తొలి తెలుగు టాకీ "భక్త ప్రహ్లాద"లో చండామార్కుని పాత్ర, "సావిత్రి"లో సత్యవంతుడి మిత్రుని వేషం వేశారు. కొంత కాలంపాటు బొంబాయి 'కృష్ణ సినిమా' థియేటర్‌లో డోర్‌కీపర్ ఉద్యోగం చేశారు. అటుపైన ఒక పంపిణీ సంస్థలో రెప్రెజెంటెటివ్‌గా బొంబాయి రాష్ట్రమంతా తిరిగారు. తన నీతీ నిజాయితీవల్ల ఆ కంపెనీకి మేనేజర్ కాగలిగారేగాని, అది అంతలోనే మూత పడింది. న్యూ ఈరా పిక్చర్స్‌లో ప్రొడక్షన్ మేనేజర్‌గా, రేణు పిక్చర్స్‌లో మేనేజర్‌గా, "స్త్రీ" చిత్రానికి అసిస్టెంట్ కెమెరామన్‌గా పనిచేశారు. హెచ్. ఎం. రెడ్డి 1940లో మద్రాసులో ప్రారంభించిన "సత్యమే జయం, తెనాలి రామకృష్ణ" చిత్రాలకు అసిస్టెంట్‌గా పనిచేస్తూ, "సత్యమే జయం"లో హీరోగా, "తెనాలి రామకృష్ణ"లో కరక్కాయ శాస్త్రి, అప్పాజీగా రెండు వేషాలు వేశారు. "కష్టజీవి" అనే చిత్రానికి దర్శకత్వం వహించే అవకాశం రావడంతో 1942లో మళ్ళీ బొంబాయికి వెళ్లారు. మూడు రీళ్ళతో ఆ చిత్రం మూలపడింది. "సవాల్, లేడీ డాక్టర్, దర్బాన్, నెక్ పర్వీన్" చిత్రాలకు సహాయ దర్శకుడుగా పని చేశారు. "దేవర్" చిత్రానికి స్క్రిప్టు రాశారు. పృథ్వీ థియేటర్స్‌వారి "దీవార్, శకుంతల" నాటకాలలో చిన్న పాత్రలు ధరించారు. 1945లో సారథీవారి "గృహప్రవేశం" చిత్రాన్ని డైరెక్ట్ చేయడానికి (అందులో హీరో కూడా) మద్రాసు నుంచి పిలుపొచ్చింది. దాంతో 'డైరెక్టర్ ప్రసాద్'గా మద్రాసులో స్థిరపడి, "పల్నాటి యుద్ధం, ద్రోహి, మనదేశం, షావుకారు, సంసారం, పెళ్ళిచేసి చూడు, పరదేశి, మిస్సమ్మ (తమిళం, హిందీ కూడా), మనోహర, పెంపుడు కొడుకు, తమిళంలో "మంగయర్ తిలకం, భాగ్యవతి" చిత్రాలకు దర్శకత్వం నెఱపారు. 1955లో లక్ష్మీ ప్రొడక్షన్స్ స్థాపించి "ఇలవేల్పు" తీశారు. ఆ తర్వాత ప్రసాద్ ప్రొడక్షన్స్ పతాకంలో "శారద, ఛోటీ బహెన్, బేటీ బేటే, హమ్రాహీ, ససురాల్, దాదీమా, మిలన్, రాజా ఔర్ రాంక్, జీనేకీ రాహ్, ఖిలౌనా, షాదీకే బాద్, బిదాయ్, ఉదర్‌కా సిందూర్, జయ్ విజయ్, యేకైసే ఇన్సాఫ్, ఏక్ దుజేకేలియే" తయారు చేశారు. ఇవేకాక, అంతకు ముందు తమిళంలో "తాయిల్లా పిళ్ళై, ఇరువర్ ఉళ్ళమ్, ఇదయ కమలం, పిరియవిడై", కన్నడంలో "మనే తుంబిద హెణ్ణు" చిత్రాలు కూడా నిర్మించారు.

ప్రసాద్ స్టూడియోస్‌ను 1965లో, 1976లో ప్రసాద్ కలర్ ఫిలిమ్ లేబరేటరీని నెలకొల్పారు. లేబరేటరీ ఈయన కొడుకు ఎ. రమేష్ నిర్వహణలో దినదిన ప్రవర్థమానమై, ఇప్పుడు 70 ఎం. ఎం., కలర్, స్టీరియో ఫొనిక్ శబ్ద విస్తరణ ప్రొసెసింగ్ ఏర్పాట్లకూ సిద్ధమైంది. హైదరాబాద్‌లో లాబ్ నిర్మాణం త్వరలో పూర్తవబోతోంది.

1980లో ప్రసాద్ కేంద్ర ఫిలిమ్ సెన్సార్ బోర్డు సభ్యులయ్యారు. 1980లో 'ఉద్యోగపత్ర' అవార్డు, మన రాష్ట్ర ప్రభుత్వంచే 'రఘుపతి వెంకయ్య' అవార్డు, 1978–79కి రాజాశాండో మెమోరియల్ అవార్డు, 1982లో రామ్‌నాథ్ అవార్డు పొందారు. చలన చిత్ర పరిశ్రమాభివృద్ధికి విశిష్టమైన కృషి చేసినందుకు ఎన్నో గౌరవ సత్కారాలందుకున్నారు.

చాలాకాలం తర్వాత "అమావాస్య చంద్రుడు" చిత్రంలో నటించి, అత్యద్భుతంగా బహుముఖ ప్రశంసలందుకున్నారు.

ఇప్పుడు ఈయన రెండు హిందీ చిత్రాల నిర్మాణానికి పూనుకున్నారు. చందర్ వోహ్రా దర్శకత్వం వహించే చిత్రంలో ద్విపాత్రల హీరో... అమితాబ్‌బచ్చన్ ఆ కథ విని మెచ్చుకున్నారట. రెండో చిత్రం "విలయతి బాబు"కు జైనేంద్ర జైన్ స్క్రిప్టు రాస్తున్నారు. బహుశా, ఈ రచయితే డైరెక్ట్ చేయవచ్చేమో!

"తిండీ, నిద్రా కంటే కూడా మానవునికి ముఖ్యమైనది ఓర్పు. నా విజయానికి కారణం ఓరిమేగాని, నా శక్తి సామర్థ్యాలూ – నా గొప్పతనమూ కాదని నా ఉద్దేశ్యం," అంటారు శ్రీ ఎల్. వి. ప్రసాద్.

[ జి. వి. జి. ]

PUBLISHED SIMULTANEOUSLY FROM VIJAYAWADA & HYDERABAD

# ఆంధ్రపత్రిక

FOUNDER: DESODDHARAKA K. NAGESWARA RAO

## కొన్ని ఆకర్షణలు










అరణ్య కాండ
* యామిజాల పద్మనాభస్వామి

మన సినిమాలు

ఇది నారీ దృక్పథం




సినిమాలకు స్త్రీ మహారాజపోషకులు



విజయవాడ సినిమా వార్తలు

మద్రాసు సినీ డైరీ

గ్రంథ సమీక్షలు

విద్యారంగం నేటి సమస్య

వారఫలాలు

డాక్టర్ కబుర్లు

ప్రేక్షకుల తీర్పు

ఆయుర్వేద సుభాషితాలు

నమ్మదగిన వార్తలకి, నిజాయితీకల వ్యాఖ్యలకి **ఆంధ్రపత్రిక**

# సీరియల్
# కాలంకరిబొక
## వలివేటి నాగచంద్రావతి

(గత సంచిక తరువాయి)

రహస్యమేమిటంటే నువ్వొకందుకు పోస్తే నేనొకందుకు తాగుతున్నానన్నట్టు విరుద్ధ భావనల్లో వారిద్దరూ ఒకటి కావటం.

పెచ్చరిల్లుతున్న నరాల వత్తిడికి తట్టుకోలేక కేవలం వాంఛా పరితృప్తికి సాధనంగా మాత్రమే సోఫియాని వాడుకుంటున్నానని మురళి తలపోస్తొంటే, సోఫియా వూహాలు ఇందుకు పూర్తి వ్యతిరేకంగా వున్నయ్

వెకిలిదేగానీ వెర్రిబాగులదీ, లోకజ్ఞానం లేనిదీ కాదు సోఫియా చిత్తం వేసే వెర్రిగంతులకి తాళలేక తను పురుషుల్ని కవ్వించే మాట వాస్తవమే. ఆ కవ్వింపుని ఆహ్వానంగా తీసుకుని తనతో పరాచికాలాడుతూ భుజాలు రాసుకుంటూ బులపాటం తీర్చుకుంటుంటారు కొందరు పురుషపుంగవులు. ఇంకా కొంచెం చోటిస్తే వీళ్లు తన చంచలత ఆసరాతో తన సర్వస్వాన్నీ పూర్తిగా ఆస్వాదించి వినోదించ గలరు — అంతేతప్ప ఆ రుచి చూసినవారిలో ఏ ఒక్కరూ తమ జీవితంలోగానీ, హృదయంలోగానీ సగభాగినిగా తనకు చోటివ్వరనే పచ్చినిజం సోఫియాకి బాగా తెలుసును

అందుకే వారికి ఒక అడుగు దూరంలో వుంటూ, అందుబాటులో వున్నట్టే భ్రమింపచేస్తూ వారొక అడుగు ముందుకువేస్తే వెంటనే తానొక అడుగు వెనక్కివేసి తన జాగ్రత్తలో తానుంటూ, "అబ్బే ఇంకొక్క అడుగు వెయ్యాలి మీరు." అన్నట్టు మళ్లీ మురిపిస్తూ అందీ అందకుండా ఆటాడిస్తూ వుంటుందే తప్ప ఇప్పటివరకూ ఎవ్వరిచేతా చిక్కింది కాదు.

ఈ నిగ్రహమే కాకుండా ఆమె కింకో రక్ష ధామస్. ఆ వూరికి పది—పదిహేను మైళ్ల దూరంలో వున్న పట్టణంలో, ఓ ఫాక్టరీలో ఫిట్టరుగా పని చేస్తున్నాడతను.

ఆ పని నామకార్థమే. అతనో పెద్ద రౌడీ అనీ, తనలాంటివాళ్లే అయిన ఒక ముఠాకి నాయకుడనీ ఆ చుట్టుపక్కల వూళ్లలో అందరికీ తెలుసును.

ఓ పెద్ద రౌడీ ఈమెకు అన్న అనే వెరపే లేకపోతే సోఫియా ఈవరకే ఎందరి చేతులో మారి, ఎందరెందరో ఆఘ్రాణించి నలిపి పడేసిన పువ్వయి వుండేది.

అందని పళ్లని, "పులుపు" అంటో ముఖం చిట్లించుకునేవాళ్లు ఒక రకం ఆత్మవంచన చేసుకునేవాళ్లయితే, "తినేసి ఇందాకానే చేతులు కడుక్కున్నాం. మరి వాట్లమీద మనసు లేదు" అని వెగటుగా చేతులు తిప్పేవాళ్లు వేరొక మోస్తరు ఆత్మవంచన చేసుకునేవాళ్లు.

తమ కాంక్ష నెరవేరను అవకాశం లేకపోవటాన కలిగిన తామసంలో, చాటునా మాటునా సోఫియాని చెడిపోయిన మనిషిగా, నీతిమాలినదిగా, సిగ్గులేనిదిగా అభివర్ణించి అక్కసు తీర్చుకునేవాళ్లు ఈ రెండో రకం బాపతే.

ఇలాంటి వాగుళ్లని ఏం ఖాతరు చెయ్యరు సోఫియా ధామస్‌లు.

కానయితే వాళ్లకి హెచ్చరింపుగా, తస్మాత్ జాగ్రత్త అన్నట్టుగా చెల్లెల్ని చూసే నెపంమీద చీటికీమాటికీ ఆ వూరికి విజిట్ చేస్తూంటాడు ధామస్.

"ఎన్నాళ్లని నిన్నిలాగ కావలికాస్తూ వుండ గలను ? పెళ్లి చేసుకో. నా బాధ్యత తీరుతుంది." అంటాడు ధామస్.

పరారయిన చెల్లెలి ఖర్మ ఎలా కాలుతోందో తెలీదు. ఈ చెల్లెకి బతుకయినా ఒక గాటన పడెయ్యాలని అతని ఆరాటం

ఈ ఏకాకితనాన్నించి విముక్తమై గృహిణిగా స్థిరపడాలనీ, తనదైన ఓ సంసారం నీడన బిడ్డా పాపాతో తను కలకలాడాలనే స్త్రీ సహజమైన వాంఛలు సోఫియాకీ ఉన్నయ్.

"నేను కాదన్నానా అన్నయ్యా!" అనేది అన్నకి జవాబుగా.

ధామస్ పెళ్లికొడుకుల్ని తీసుకువచ్చేవాడు. ఫిట్టర్లు... వర్కర్లు. . సెకండరీ గ్రేడు టీచర్లు... అంతా గంతకు తగ్గ బొంతలే. సోఫియా చప్పరించేసేది.

ఈ మోటవాళ్లు పోసే గంజీ కడుగూ తాగి, కలుగులాంటి ఓ కొంపలో చాకిరీ చేస్తూ అదే స్వర్గమనుకుంటూ తృప్తిపడలేదు తను. అంతర్గతంగా ఇంకో అనుమానంకూడా తొలుస్తోంది తనని.

అదేమో తండ్రిరక్తంకంటే తల్లిరక్తం ఎక్కువపాలు తనలో పారుతోంది గావును...తల్లిలాగే తనకీ కోరికలు అనంతం. తోడేకొద్దీ చెలమల్లో ఊరేజలం లాగ అవి వూరుతోనే వుంటాయి. వున్నదాంతో సంతుష్టి చెందటం ఏ కోశాన లేదు.

వుసుళ్ల పుట్టలాంటి కోరికలు కలవాళ్లు, ఇలాంటి జానాబెత్తెడు గొర్రెతోక సంపాదన గాళ్లని కట్టుకుంటే ఎలాంటి వికృత పరిణామాలు ఏర్పడతాయో చెప్పడానికి తన కుటుంబమే ఉదాహరణ.

తీరని కోరికలతో గయ్యాళయిపోయిన తల్లి, బాధ్యతారాహిత్యంతో రాయిగా మారిన తండ్రి, చెట్టుకో పిట్టగా ఆగమ్మ కాకులైపోయిన పిల్లలు: తనకీ ఇలాంటి విషవలయమే ప్రాప్తిస్తుందన్న వూహ వస్తే సోఫియా వణుకుతుంది.

ఈ శంకవల్ల వచ్చిన వాడినల్లా పెదవి విరుస్తుంటే ధామస్‌కి కోపం.

"నీకున్న అందానికీ, ఆస్తికీ, క్వాలిఫికేషన్‌కీ ఘరానా సంబంధాలు వస్తయ్యా?" అని దెప్పుతాడు.

"వచ్చినప్పుడే చేసుకుంటాలే," అని మొండికెత్తింది సోఫియా.

**జరిగిన కథ—10 :** కేశవరావ్, కామేశ్వరమ్మగార్ల ఏకైక పుత్రుడు మురళి — రంగనాధం, రాజ్యలక్ష్మమ్మగార్ల ఆఖరి సంతానం మీనాక్షిని మాయమాటలతో మోసపుచ్చి తన కోర్కెను తీర్చుకొంటాడు. కామేశ్వరమ్మకు ఆడపిల్ల పుడుతుంది. మీనాక్షి గర్భవతి అవుతుంది. మురళిని కేశవరావ్ వైజాగ్ మెడికల్ కాలేజీలో చేర్పించి వస్తాడు. చివరికి చేసేదిలేక మీనాక్షిలో పెరుగుతున్న పాపాన్ని రాజ్యలక్షమ్మ నాటు వైద్యంతో నిర్మూలించటానికి ప్రయత్నిస్తుంది ఆ వైద్యం మీనాక్షి ప్రాణాల్నే హరిస్తుంది. మురళి చదువు పూర్తిచేసి హౌస్ సర్జన్ చేస్తుంటాడు రంగారావుగారి ఏకైక పుత్రిక హిమబిందుతో పరిచయం కల్గుతుంది మురళికి. ఆమె మనసులో కూడా స్థానాన్ని సంపాయిస్తాడు. కేశవరావ్‌గార్కి కాబోయే కోడలు బిందు నచ్చింది. కానీ కామేశ్వరమ్మకు మాత్రం ఆమె వేషధారణ, చిన్నపిల్లల చేష్టలు, మగరాయుళ్లా తిరగటం సుతరామూ నచ్చలేదు. అలాగని రంగారావుగారి ఆస్తి, అంతస్థు, హోదా ఇవన్నీ చూసాక ఒప్పుకోకుండానూ వుండలేకపోతోంది. లాంఛనాల పేరుతో కామేశ్వరమ్మ కోరే గొంతెమ్మ కోర్కెలను వినివినీ విసిగిపోయిన రంగారావ్‌గారు చివరకు 'నా ఆస్థిలో చిల్లిగవ్వ కూడా ఇవ్వను' అని ఖచ్చితంగా చెప్పటంతో ఆమె వాక్ ప్రవాహానికి ఆనకట్ట పడుతుంది. ఈలోగా — మురళి చెల్లెలు వసంతను తీసుకొని హాస్పటల్‌లో వున్న ఓ ఫ్రెండ్‌ను చూసివస్తూ దారిలో కన్పించిన మరో ఫ్రెండ్ రామకృష్ణ స్కూటర్‌మీద ఎక్కి అతన్ని ఆనుకొని కూర్చున్న బిందును చూసిన మురళి ఆమెను తీవ్రంగా విమర్శిస్తాడు. ఆ తరువాత ఇద్దరిమధ్యా వాగ్వివాదం జరుగుతుంది. ఆ తరువాత వారిద్దరు విడిపోతారు మురళి ఓ పల్లెటూర్లో గవర్నమెంట్ డాక్టర్‌గా పనిచేస్తుంటాడు. వయసు తాకిడికి తట్టుకోలేక అక్కడే నర్స్‌గా పనిచేస్తున్న సోఫియాతో కోర్కెలు తీర్చుకుందామనే దురుద్దేశంతో పొత్తు పెట్టుకొంటాడు

ఆ ముహూర్తం తోసుకు రాబట్టే కాబోలు మురళి ఆవూరికి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చాడు. అందగాడు; అయినింటి బిడ్డ,చూడగానే నా రాజకుమారుడు ఇతనే అనిపించింది సోఫియాకి.

తను సాదా మనిషి. తనతని రాకుమారి కావాలెనంటే ఇంకో జన్మ ఎత్తాలిసుంటుందనీ గ్రహించింది సోఫియా.

అయితే నిరాశలో కూడా రాయి విసరటం మానలేదు. అదృష్టం! పండురాలి సరాసరి దోసిట్లో పడింది.

పాలెస్‌కి పోయే రాకుమారుడు వెడుతూ వెడుతూ విశ్రాంతికోసం రాదారి బంగళాలో బసచేసినట్లు, తన కౌగిట్లో వాలిన మురళిని అట్లాగే బంధించి తనవాణ్ణి చేసుకోవాలనే యోచనతోనే తన కన్నెతనాన్ని అతనికి కానుక పెట్టింది సోఫియా.

రెణ్ణెల్లు గడిచేటప్పటికి వూరందరికీ తెలిసిన రహస్యమయింది వీరి ప్రణయం. తమ సంబంధాన్ని గోప్యంగా వుంచాలని చూసిన మురళి ప్రయత్నాలకి మద్దతు ఇవ్వలేదు సరికదా—ఎక్కువగా ప్రచారం కావటానికే సానుకూలపడింది సోఫియా.

* * *

ఆరోజు ఉదయం పదిగంటల వేళ పట్నంనించి వచ్చేబస్సు దిగాడు థామస్.

అది బస్ స్టాపు అని తెలియటానికి అక్కడున్న ఒకేఒక గుర్తు చెట్టునీడన వున్న చిన్న టీ బంకు.

బస్సు రోడ్డు దగ్గర్నించి నాలుగయిదు ఫర్లాంగుల దూరముంటుంది వూరు. రిక్షాలాంటి వాహనాలేమీలేవు. ఎర్రమట్టితో వేసిన రోడ్డు మాత్రం వుంది అక్కణ్ణించి. తెలిసిన వాళ్లెవరయిన వుంటే ముందు చెబితే బండి పంపుతారు. లేకపోతే ఎంతటి వారికయిన ఇక నడకే శరణ్యం.

ఆ రోడ్డువైపు అడుగు వేయబోయి యథాలాపంగా బంకుకేసి చూశాడు థామస్. తెలిసిన ఆకారం టీ కలిపించుకుంటూ కనిపించిందక్కడ

"హల్లో స్టూవర్డ్!"

వేయబోయిన అడుగు వెనక్కితీసి హుషారుగా బంకువైపు నడిచాడు థామస్.

ఒకసారి తలతిప్పి చూసి మళ్లీ మొహం తిప్పుకున్నారు ఆ స్టూవర్డ్ అన్నతను. అతని మొహంలో థామస్ దరిశనానికి అంత సంతోషం వ్యక్తమవలేదు.

"ఇదిగో చూడు! చంచాలో సగం కంటే చక్కెర ఎక్కువెయ్యొద్దు" అని టీ కలిపే కుర్రాడిని హెచ్చరిస్తూ థామస్ రాకకంటే తనకి టీయే ప్రధాన విషయమన్నట్టు తిరగబోసే టీ ధారవంకే చూస్తుండిపోయాడు

థామస్ దగ్గరగా వచ్చి స్టూవర్డ్ భుజం మీద చెయ్యేశాడు "ఏం భాయ్ పలకవు? ఎప్పుడు వచ్చావిక్కడికి?" అని పలుకరించాడు.

టీ కప్పు చేతికి తీసుకుంటూ థామస్‌ని ఏ భావమూలేని చూపు చూశాడు స్టూవర్డ్ అడిగిన ప్రశ్న వదిలేసి —"నీకో టీ కలపమంటాను." అన్నాడు.

ఇద్దరూ టీ కప్పులతో బంకు ముందున్న కొయ్య బెంచీ మీద కూర్చున్నారు.

తలలపైన రావిచెట్టు ఛత్రం పడుతోంది.

కొమ్మమీద ఒంటరికాకి ఒకటి రెక్కలు దులువుకుంటూ "కావు—కావు" మంటూ ఎవరినో పిలుస్తోంది. రోడ్డుమీద బుర్రుమంటూ వెళ్లిందొక లారీ గడ్డి నింపుకొని. దాని వెనకే ఎర్రటి దుమ్ము ఇంతెత్తున లేచి మళ్లీ నెంపాదిగా అణగారింది.

"శెలవు పెట్టావా ఏమిటి?" అన్నాడు థామస్ మళ్ళీ, స్టూవర్డ్ మౌనాన్ని కదిలిస్తూ.

"ఊ ..మరె.. మా మేనత్త కవురు పెడితేనూ. .మూర్ఛోజులయింది వచ్చి... మళ్లీ ఇవాళ పట్నం పోతున్నా" విరుస్తూ విరుస్తూ తప్పని సరయినట్టు అయిష్టంగా జవాబిచ్చాడు స్టూవర్డ్.

తనంటే వెర్రి అభిమానం చూపించే స్టూవర్ట్ ఇలా ముభావంగా వుండటానికి అర్థాలు వెతుకుతూ టీ చప్పరించ సాగాడు థామస్.

పట్నంలో ఒకే పేటలో వుంటున్నందువల్ల అయిన స్నేహం వారిద్దరిదీ. స్టూవర్డ్ మెకానిక్. ఒక ఆటో మొబైల్ వర్క్‌షాపులో పనిచేస్తున్నాడు.

బక్కగా గట్టిగా గాలివీస్తే ఎగిరిపోయేటట్లుండే స్టూవర్డ్‌కి కండలు తిరిగిన దండలుగల థామస్ అంటే వల్లమాలిన ఆరాధనా భావం.

"గురూగారూ!" అని పిలుస్తాడు భక్తిగా థామస్‌ని. మనసు విప్పి అరమరికలు లేకుండా మాటాడుతాడు. వీలయితే శెలవు రోజున ట్రయిల్ పేరున తను బాగు చేస్తున్న ఏ కారులోనో ఎక్కించుకు తిప్పుతుంటాడు వూర్లో

స్టూవర్డ్‌తోనేకాక అతని కుటుంబంతో కూడా పరిచయముంది థామస్‌కి.

కొద్దిగా ఉన్న కుటుంబం అతనిది. ఇంటెల్లి



పాదీ అంతో ఇంతో చదువుకున్నవారే. తండ్రి హెడ్ కానిస్టేబుల్ గా పోలీసు డిపార్టుమెంటులో పని చేస్తున్నాడు. తల్లి ఎలిమెంటరీ స్కూలు టీచరు. ఇద్దరు చెల్లెళ్లు బట్టల కొట్లలో సేల్సు గరల్సు. ఇంకో చెల్లెలూ తమ్ముడూ చదువుకుంటు న్నారు.

కుటుంబంలో ఎక్కువమంది సంపాదనపరులు కావటంవల్ల వారి ఇల్లు ఎన్నడూ లేమి ఎరగదు. కొంత నాగరీకంగా కూడా వుంటారు.

స్టూవర్ట్ స్థితిగతులు మంచివవటం దృష్ట్యా సోఫియాని ఆ ఇంట్లో పడవేస్తే సుఖపడుతుందనే అభిప్రాయం థామస్‌కి ఎప్పట్నించో వున్నది

అయితే ఒక్కటే సంకోచం. హంస రెక్కల్లాంటి బట్టలు ధరించి ఆ బట్ట మడత నలగని ఉద్యోగం చేస్తోంది సోఫియా — నూనెమడ్డి ఓడే గుడ్డలు విడవకుండా ఒంటినించుకొని కార్లకింద పడుకుని నట్లు బిగించే పని స్టూవర్ట్‌ది.

నిండైన అవయవ శోభతో మిసమిసలాడే సోఫియా — రెక్కపాయగా గడక్రర ఆకారంలో వుండే స్టూవర్ట్. . వాళ్లిద్దర్నీ పక్కపక్కనే ఊహిస్తే ఆ జంట అతికినట్టుండక అతనికే ఎబ్బెట్టనిపించి ఇప్పటివరకూ బయటపెట్టలేదు తన ఉద్దేశ్యాన్ని

ఈ మధ్యనే స్టూవర్ట్‌కి ఆ వర్క్‌షాపులో కొంత పార్ట్‌నర్‌షిప్ కూడా వుందని తెలిశాక ఇక ఆలస్యం చెయ్యక, ఆ సంకోచాలన్నీ పక్కకి నెట్టేసి, ''మా సోఫియాని చూసుకోవోయ్ బామ్మరిదీ'' అని వరస కలిపి ఆహ్వానించాడు

''అలాగేలెండి గురూగారూ! ఆ వూళ్లోనే మా మేనత్త గూడా వుందిలెండి — ఓమారెడదాం'' అని ఒప్పుకున్నాడు స్టూవర్ట్ కూడా.

వారం క్రింద జరిగేయి ఈ మాటలు. ఆ తరవాత వారిద్దరూ కలవటమిదే.

హటాత్తుగా స్ఫురించింది థామస్‌కి.

'ఒచ్చేను గదా అని స్టూవర్ట్ సోఫియాని కలిసుంటాడు. ఈ నరాల నాగన్నని చిన్నబుచ్చేలా ఏదో అని వుంటుంది చెల్లెలు. అందుకే ఇలా మొహం ముడిచేడితను' అన్న నిర్ణయానికి వచ్చేడు థామస్.

బంగారంలాంటి ఈ సమ్మంధం కూడా చెల్లెలి పెడసరం మూలాన్న చిట్లిపోబోతోందని ఆందోళనతో తత్తరలాడేడు థామస్ ఎలాగైనా సర్దిచెప్పాలని తొందరపడేడు.

''నాకు చెప్పకుండానే ఒచ్చేవేమోయ్? మరి మా చెల్లెల్ని చూశేవా?'' అనడిగేడు స్టూవర్ట్ ముఖ కవళికల్ని పరిశీలిస్తూ.

స్టూవర్ట్ మొహం అదోలా అయింది. ఏదో అనబోయి తమాయించుకున్నాడు.

''చూల్లేదులెండి.'' అన్నాడు ముక్తసరిగా.

'అయితే అతని మొహం ముడుపుకి కారణం తన చెల్లెలు కాదన్నమాట!' థామస్ కొద్దిగా తేరుకున్నాడు.

''అదేమోయ్. వూళ్లోకొచ్చికూడా చూడకుండా వెళుతున్నావ్? నేనంతగా చెబితేకూడా...'' అన్నాడు. నా మాటకిచ్చే విలువ ఇంతేనా? అన్నట్టు నిష్ఠూరంగా.

స్టూవర్ట్ ఒక్క క్షణం తటపటాయించి,

## కాలంకరి చాక

''మీరు కోపగించుకోకండి గురూగారూ! మీ చెల్లెలుకి నేను తగననిపించే నేనావిణ్ణి కలవలేదు. ఇక మీగ్గూడా వరుళ్లని గాలించే పని తప్పిపోయిందిలెండి. ఆవిడ పెళ్లి మీరు బెంగపెట్టు కోనక్కరలేదు. పెళ్లిమాటేమోగానీ తన జోడీని ఆవిడే ఎంచుకొన్నది అక్కడ.'' అన్నాడు తెగించి.

ఆ వ్యంగ్యానికి థామస్ సౌమ్య పకృతి క్షణంలో మారింది. కళ్లు తీక్షణంగా అయేయి వెన్ను నిటారుగా అయింది.

''ఒళ్లు తెలిసే మాట్లాడుతున్నావా?'' అన్నాడు గద్దింపుగా

కండ బలం లేకపోయినా స్టూవర్ట్ గుండెబలం ఎక్కువే ''నా ఒంటి మాటకేంలెండి గురూగారూ! మీ చెల్లెలే ఒళ్లు తెలికుండా ఆ డాక్టరు ఒళ్లోకి వురుకుతోందని వూరువూరంతా నోరు చేసు కుంటోంది వెళ్లి కనుక్కోండి.'' అన్నాడు తొణక్కుండా.

అతని ఆరోపణ తాలూకు వాస్తవమేదో పాడ గట్టేనట్టయి ఆవేశం దిగజారింది థామస్‌కి 'చెల్లెలి చపల స్వభావానికి వక్ర భాష్యాలల్లడం ఆ వూరి

## ఓ మాట!

పెరుగుట విరుగుట కొరకే నన్నది
పెదబాలశిక్షలోని చిన్నప్పటి మాట!
కాని పెరుగుట* పెరుగుతూ పోవుట కొరకే నని
ఈ నాటి ధరలు పాడుతున్న అంతులేని వేలంపాట!

— డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

వాళ్లకి మామూలే ప్రచారంలో కొత్తగా చేర్చిన కథ కాబోలిది' అని నిర్ధారించుకున్నాడు

'అలాంటి వాటిని గడ్డిపరక ఒంటిన పడితే కొనగోట మీటి దులుపుకున్నట్లు నిర్లక్ష్యం చైడం అలవాటయిన తనే అతను చెబుతోంటే విని ఒళ్ళు తెలియని కోపం తెచ్చుకున్నాడే — కొత్తవాడయిన స్టూవర్ట్ తొలిగా విని నిజమని భ్రాంతి చెందడం ఆశ్చర్యమా!' అని సహనం తెచ్చుకున్నాడు

'ఆ వూళ్ళోవాళ్ల నోళ్లు మురికివి స్టూవర్ట్ వాళ్ళ నోళ్లు విప్పితే వచ్చేది దుర్వాసనే. వాళ్ల మాటలు నమ్మకు' అన్నాడు.

అతని గొంతులో అనుకోకుండా ఒక ఆడపిల్ల బరువు మోసే వ్యక్తికుండే అణకువ గుణం ప్రవేశించింది.

బిగిసిన స్టూవర్ట్ ముఖ భావాలు సడల లేదు. దిక్కులు చూడటంలో కొన్ని నిమిషాలు భారంగా తరిగేయి. దూరంగా దుమ్మురేగి బస్సు వస్తోన్న జాడ తెలిసింది.

అకస్మాత్తుగా థామస్ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు స్టూవర్ట్.

''ఎప్పటి మాటలోవద్దు. ఈసారి మీచెల్లెలి నిష్కల్మషాన్ని నిబద్ధి చేసుకురండి గురూగారూ! మీమాట నెత్తిన పెట్టుకోక పోతే అప్పుడడగండి.'' స్నేహపూర్వకంగా చెయ్యి నొక్కి వదిలాడు.

బస్ ఆగింది. మోసుకుపోతున్న మందికి స్టూవర్ట్‌ని కూడా జత చేసుకుని ముందుకు సాగి పోయింది.

రక్తం ఆవిరయినట్టు నిస్తేజంగా వూరిదారి పట్టాడు థామస్.

పైన ఎండసెగ నిర్దాక్షిణ్యంగా నెత్తి మాడు స్తోంది లోపల కూడా ఏదో మంట మనసుని కాలుస్తోంది. అప్పుడప్పుడే రాజుకుంటున్న కోపం కాలికడ్డొచ్చిన రాయిని ఫర్లాంగుదూరం పడేలా తన్నింది. అంతకంతకూ పెరిగిపోతున్న కసి మాన సికంగా ఆ వూరివాళ్లని సజీవదహనం చేసేసి ఆ బూడిదని నొసటన పెట్టుకుంటోంది. అప్పుడున్న మనస్థితిలో అతను కదిపితే కరిచేలా వున్నాడు. అతని నడక జోరు ఎప్పుడూ అరగంట తక్కువ పట్టని ఆ దూరాన్ని పావుగంటలో దాటేసింది.

హటాహటిన సోఫియా అద్దెకుంటున్న గదికి చేరుకున్నాడు థామస్.

కూనిరాగం తీసుకుంటూ బట్టలు ఇస్త్రీ చేసుకుంటోంది సోఫియా. అన్నగార్ని చూసి ఆ అమ్మాయి మొహం వెలిగింది.

''భలే. మంచి సమయానికి వచ్చేవ్‌రా అన్నా— ప్రొద్దున్నే పలావ్ చేస్తూ అనుకున్నా — అన్న వస్తే బాగుండునూ అని — రారా'' అంటూ ఆపేక్షగా ఎదురు వెళ్లింది చేతిలో పని వదిలేసి

థామస్ లోపలికి రాలేదు. గుమ్మంలోనే నిలబడి, వీధివైపు ముఖం చేసి, ''ఏ వెధవ్వలా నా చెల్లెలికి రంకు అంటగట్టిందీ — దమ్మున్న మొగాడైతే రండిరా నా ఎదటికి — ఆడపిల్లని వంటరిగా చూసి అవాకులూ చెవాకులూ వదరటం కాదురా — ఇప్పుడు రండి. నాలికలు వాలికలు చేస్తాను, డొక్క చీలికలు చేస్తాను.'' అంటూ అంతకంతకూ రెచ్చిపోతున్న గొంతుకతో అరవసాగాడు.

ఆ వీధికి రాబోయిన ఒకరిద్దరు మనుషులు ఆ కేకలకీ, అతని రౌద్రాకారానికీ బిక్కచచ్చి మొహం తప్పించి పక్కసందులోకి మళ్లిపోయారు.

బిత్తరపోయి నుంచుండిపోయిన సోఫియా క్షణంలో తేరుకుని గాభరాగా రెండడుగులు ముందుకు వేసి అన్నగారి జబ్బ పట్టుకుని ఒక్క ఉదుటున లోపలికి లాగి తలుపులు మూసి గెడియ పెట్టింది.

లోపలికి వచ్చినా థామస్ ఆవేశపు ఉరవడి తగ్గలేదు.

చెల్లెలి చేతికి చిక్కిన భుజాన్ని గింజుకుంటూ, ''అసలు వాళ్లని కాదే — నిన్నూ అనాల్సింది. అడ్డమైన వెధవల్నీ రామకుతిరగద్దే అంటే విన్నావ్! సోషల్‌గా బిహేవ్ చెయ్యాలి అన్నావ్. కల్చర్ — కల్చర్ అంటూ గొప్ప కబుర్లు చెప్పేవ్. ఇప్పుడనుభ వించు. అట్టానీతో పూసుకుతిరిగిన ప్రతి మగతనోరి లేని వెధవా నీకేదో మచ్చ వుందని వాగేవాడే. వినలేక మధ్య నేను చస్తున్నాను.'' అంటూ అటు గాలి ఇటు మళ్లించి చెల్లెలిమీద చిందులేశాడు.

సోఫియా అన్నగార్ని బలవంతానా మంచంమీద కూలేసి,

''పోనిద్దూ వాళ్ల పాపాన వాళ్లే పోతారు. అయినా మనకిది కొత్త సంగతి కాదుకదా! ఎప్పుడూ

లేంది నువ్వివాళ ఇంత రాద్ధాంతం చేస్తున్నా వేమిటి ?'' అన్నది అన్నని శాంతపరుస్తూనూ, ఆశ్చర్యపడుతూనూ.

''ఎందుకా ? బంగారంలాంటి సంబంధమే — విశేషంలాంటి సంబంధం. ఈ వెధవలు పుట్టించిన పుకార్ల గాలి సోకి పొలిమేర మెట్టకుండానే వెనక్కి తిరిగేసింది. ఇట్లా అయితే నీ పెళ్లెప్పుడవుతుంది ? ఎలాగవుతుంది ?'' పాపం అతని ఆక్రోశం అదీ —

సోఫియాకి సగం బోధపడ్డది. ఇక మిగతా సమాచారం పట్ల ఆసక్తి కనబరచలేదు.

''అంతేకదా ! అది కాకపోతే దాని తాతలాంటి దింకొకటి. దానికింత గల్లంతెందుకు ?'' అన్నది చాలా సాధారణంగా.

థామస్‌కి తిక్కరేకొచ్చింది. ''ఎంత తేలిగ్గా వుందే నీకూ... ఇంకోటొస్తుందట ఇంకోటి. నావల్ల కాదిక. ఏం చేస్తావో చేసుకో. వరించి ఏ రాజకుమారుణ్ణి కట్టుకుంటావో, లేకపోతే అందరి మాటలూ పడుతూ వృద్ధకన్యలా ఇట్లాగే వుండిపోతావో నీ యిష్టం. నీ జోలికి రానిక'' అంటో చేతులు తిప్పుతూ చిటపటలాడేడు.

సోఫియా నవ్వి అన్నగారి అవుసరాలు చూడటంలో మునిగింది. థామస్ కుతకుతలాడ్డం మానలేదు. స్నానం చేస్తున్నంతసేపూ, భోంచేస్తున్నంతసేపూ, ఆఖరికి విరామంగా పడక మీద వాలినప్పుడు కూడా ఆపకుండా తన మాట మన్నించని చెల్లెల్నీ, ఆ చెల్లెల్ని కాదన్న స్టూవర్డ్‌నీ, అందుకు కారకులయిన లోకుల్నీ నోట్లో నానబెడుతూనే ఉన్నాడు.

కిమ్మనకుండా వింటోంది సోఫియా.

కడుపులో అక్కసంతా వెళ్లగక్కవిచ్చి, ఆ ఉధృతం అణగారనిచ్చి తాపీగా అప్పుడన్నది. ''ఇంతకీ ఇంతోటి ఆ దిక్కుమాలిన మెకానిక్ సంబంధమూ తప్పిపోయిందనేనా నీ బాధంతానూ — స్టూవర్డ్‌ని కాదు — అతను చెప్పిన ఆ డాక్టర్నే చేసుకోబోతున్నాను — చూస్తూండు.'' అని.

గుండె గతుక్కుమన్నట్టయి, అమాంతంగా మంచంమీద లేచి కూర్చున్నాడు థామస్.

''అయితే నే విన్నదీ... ?'' అంటో అర్థోక్తిలో ఆపేడు; అనుమానంగా చెల్లెల్ని చూస్తో.

శుభ్రంగా వున్న స్టౌనే మళ్లీ మళ్లీ నొక్కి నొక్కి తుడుస్తోంది సోఫియా.

'ఏమనాలి ? అవునంటే బతకనిస్తాడా ?' జంకుగా తలెత్తి చూసి అన్నగారి మాటి చూపులు తట్టుకోలేక వెంటనే వచ్చేసింది సోఫియా దోషిలా.

అది చాలు. చెల్లెలెక్కడో తెలివితక్కువగా తప్పటడుగు వేసిందని థామస్‌కి తెలీడానికి.

మంటపైన ఉన్నప్పుడు పదార్థం పొగలు గక్కుతుంది. ఆ మంట తీసేస్తే ఆ పొగ ఏమవుతుంది ? నీరవుతుంది !

చెల్లెలిమీద నమ్మకంతో ఇప్పటివరకూ ధీమాగా నిలవగలిగిన అతను ఆ నమ్మకం సడలేసరికి జావగారి పోయాడు.

''ఆఖరికి నువ్వూ దానిలాగే దిగజారి- పొయ్యావటే'' అంటో రెండు చేతుల మధ్యనా తల ఇరికించి దిగాలు పడిపోయాడు.

స్టౌ వెలిగించి నీళ్లు పడేస్తూ సోఫియా ఓరకంట అన్నగారిని చూసింది.

దండనమే సమస్త వక్రతల్నీ తీర్చే ప్రక్రియ అన్న నిశ్చితాభిప్రాయం కల అన్నగారు తననిప్పుడు చావగొట్టి చెవులు మూస్తాడనుకున్నది.

ఆశ్చర్యం ! రక్తస్పర్శ అంతటి దౌర్జన్యవాదిన్ కాళ్లూ చేతులూ చివరికీ నోటిని కూడా కట్టిపడేసి దీనుణ్ణి చేసింది కద !

మనస్సు ఆర్ద్రమయిపోయింది సోఫియాకి.

పది నిమిషాల్లో టీ కప్పుతో అన్నగారి పక్కకొచ్చి కూర్చుంది.

''నువ్వూ అందర్లాగే నన్నపార్థం చేసుకున్నావురా అన్నా'' అన్నది మృదువుగా.

ఆరే ఆరే మంటపైన కిర్సనాయలు విదిల్చినట్టు భగ్గుమన్నాడు థామస్.

''మరేనే—అర్థం చేసుకోలేకపోబట్టే ఇన్నాళ్లూ నువ్వు నంగనాచివని నమ్మేను. కళ్లు తెరిపించ బోయిన లోకులందర్నీ తిట్టిపోశేను.

అయినా నా తెలివితక్కువ కాకపోతే ఉగ్గు జీర్ణించుకున్నట్టు నీకు నరనరానా జీర్ణించుకు పోయినయ్యి ఆ తల్లి నూరిపెట్టిన బుద్ధులు. ఈ రోజా వేనేదో చాదస్తంగా మంచి మాటలు చెప్పబోతేమటుకు అవి పైపైన అంటుకుంటయ్యే తప్ప ఒంటపడతాయా ?

గంధం నీళ్లలో నానేసిన వేపచెక్కలు కాస్సేపు సువాసన వేస్తాయి. కొంచెం ఆరగదీస్తే మళ్లీ మామూలు చేదువాసనే వేస్తాయ్. నువ్వు పూర్తిగా మారిపోయావని తలచటం నాదే బుద్ధితక్కువలే...''

సగం ఆగ్రహంగానూ సగం ఆ కోపంలోనే రంగరించిన పశ్చాత్తాపంతోనూ ఇంకా ఏమిటేమిటో అంటూనే ఉన్నాడు థామస్; చాలాసేపటిదాకా.

కణకణలాడుతున్న అతని కోపంమీద నివురు గప్పకునే ఎడమిస్తూ అన్నగారికి వెరిచినట్టుగా అతని మాటల కడ్డురాకుండా కొంచెంసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది సోఫియా.

ఆ తరవాత నెంపాదిగా, ''నీ ఆవేశమే నీదిగానీ నన్ను మాటాడనియ్యవా ?'' అన్నది.

''ఏం చెబుతావే ? బుద్ధి గడ్డితిన్నది — ఇప్పుడు నాలిక్కరుచుకుంటోంది అంటావ్. నే తప్పు చెయ్యలేదు. అవతలివాడే దించేడు అని పత్తిత్తు కబుర్లు చెబుతావ్ అంతేనా ? తప్పుడు పని చేసిం దానివి అంతకంటే ఇంకేం చెబుతావ్ ?'' అన్నాడు విసురుగా.

అతని ధోరణి భరించలేనట్టు బేలగా చూస్తూ, ''నువ్వు కాస్త నిదానించి వినవా ?'' అన్నది వేడుకుంటున్నట్టు.

థామస్ తగ్గాడు. కానీ మాటలో మాత్రం ముందున్న విసురు తగ్గించకుండా ''ఏమిటో చెప్పు ?'' అన్నాడు.

గుక్కతిప్పుకున్నట్టయి ఊపిరి పీల్చుకున్నది సోఫియా.

''ఆ సంగతి అట్లా ఉంచి, చల్లారిపోతోంది ముందీ టీ తాగెయ్.'' అంటో టీలో గుడ్డ పొరగా కట్టిన మీగడని వేలితో తీసేసి కప్పు అందించింది.

అతను ఒక్కొక్క చుక్కే రుచి చూస్తూండగా, ''నువ్వు కోప్పడనంటే అంతా చెబుతానురా అన్నాయ్'' అన్నది.

ఆ ఒక్క మాటతో అతని ఆధిక్యాన్ని తానింకా మన్నిస్తూనే వుందనీ, అతని అధికారానికి భయపడుతోనే వున్నదనీ అతనికి తోపింపచేసి, ఆ సంతృప్తితో అతన్ని మెత్తబరిచి ఆ మ్మైన మిగతాది చెప్పకు రాబోయింది.

''క్రిందటి మాటొచ్చినప్పుడు మా అన్నాతికి కొత్తగా వచ్చిన డాక్టరుగార్ని చూపించాను కదూ!'' అంటూ ప్రారంభించి, ''ఆయన నాకు బాగానచ్చార్రా అన్నా. పెళ్లంటూ చేసుకుంటే ఆయన్నే చేసుకోవాలనిపించింది నాకు'' అన్నది సోఫియా కాస్త సిగ్గు పడుతూ.






బులుసు వేంకటరమణయ్య

# నిర్లక్ష్యమునకు శాస్తి

భగవంతుని ఆరాధించకుండా, ధ్యానించకుండా ఉత్తమ గతిని పొందాలని కోరుతున్న ఒక దురహంకారి అయిన రాజు, తనకు ఆ మార్గాన్ని బోధించే గురువు కావాలని ప్రకటించాడు రాజుగారు సమ్మానించి బహుమానమిస్తారనే ఆశతో విద్వాంసులు అతని వద్దకు వస్తే అసందర్భమైన ప్రశ్నలు వేస్తే సమాధానం చెప్పలేకపోయేవారు. ఆ రాజు వారిని పొమ్మని చెప్పక — సమాధానం తగినట్లు చెప్పనందున చెరసాలలో ఉంచేవాడు. ఇలా కొందరు పండితు లాతనివల్ల బాధపొందారు.

ఆ రాజుకు తగినట్లు బుద్ధి చెప్పదలచి ఒక తెలివైన పండితుడు ఆతని ఆస్థానానికి వచ్చాడు. వచ్చినవాడు రాజువైపు చూడనైనా లేదు అతడు రాజును లెక్కచెయ్యక సభలో ఉన్న ఇతరులతో మాటలాడుతూ, వారియందు గౌరవాభిమానాలు చూపుతూ కొంతసేపు గడిపాడు ఆ సభలో రాజు ఉన్నట్లే ఆ పండితుడు అనుకోలేదు.

తన్ను ఆ రీతిగా అలక్ష్యం చేసినందువల్ల రాజునకు ఆతనిపయి చాలా కోపం వచ్చింది వెంటనే సేవకులను పిలిచి ''మీరు వెంటనే ఇతణ్ణి సభనుంచి బయటికి ఈడ్చుకొనిపోయి చావగొట్టి పంపివేయండి'' అన్నాడు. అప్పుడు ఆ పండితుడు ''ఓ రాజా! నీ సభకు వచ్చి నిన్ను కొంచెమయినా లక్ష్యపెట్టకుండా వున్నందుకు నాకు శిక్ష విధించావు. సరే! నేనా శిక్షను అనుభవించడానికి ముందు నీ సంగతి ఆలోచించు. నీవు ఒక చిన్న రాజ్యానికి అధికారివి! నిన్ను లక్ష్యం చెయ్యనందున నేనీ శిక్ష అనుభవించవలసి వస్తే — లోక సామ్రాజ్యానికి నిరంకుశ ప్రభువైన భగవంతుణ్ణి లక్ష్యపెట్టని నీవు ఎలాటి శిక్షను అనుభవించవలసి ఉన్నదో ఆలోచించు దురహంకారాన్ని విడిచి కొంచెం యోచిస్తే నీకే తెలుస్తుంది'' అని అన్నాడు.

ఆ మాటలు రాజు మనస్సుకు బాగుగా నాటుకొన్నాయి. అహంకారం పూర్తిగా అణిగిపోయింది తన పొరపాటును గ్రహించి, తనకు కనువిప్పు కలిగించిన ఆ పండితుణ్ణి సత్కరించి, నాటి నుండీ భగవంతుణ్ణి నిర్లక్ష్యం చెయ్యక ఆరాధించసాగాడు. భగవదనుగ్రహం వల్లనే ఉత్తమ గతులు కలుగ గలవని అతడు బాగా తెలుసుకున్నాడు.

(భగవాన్ శ్రీ సత్యసాయి చిన్నకథ ఆధారంగా)

---

ధామస్ అడ్డు తగిలాడు

''అనుకోడానికేం ఈ డాక్టరేం ఖర్మ — అమెరికా ప్రెసిడెంటునే కట్టుకోవాలనుకోవచ్చును నువ్వనుకోగానేసరా? అవతలతను అనుకోవద్దూ? నిన్నీ గొంతెమ్మ కోరికలు తగ్గించుకొమ్మని లక్షసార్లు చెప్పేను'' అన్నాడు మందలింపుగా

''అమెరికా అధ్యక్షుడి మాటేమోకానీ ఈ డాక్టరు మాత్రం నాకందుబాటులో కొచ్చాడు'' అంటో తనమనస్సుని అతనాకర్షించటం, చొరవవేసి వల విసరటం, మురళి ఆ వలలో చిక్కుకొనటం, అందరికీ తెలిసిన రహస్యంగా తమ బాంధవ్యం బిగవటం వరకూ చెప్పుకొచ్చింది

చెల్లెలి ఈ వరస ధామస్‌కి అంతగా నచ్చలేదు. అందని వాట్లకి అర్రులు చాచటమంటే ఇదే అనుకున్నాడు.

మనకులం కాదు; మతం కాదు; తూగే అంతస్తు కాదు, నిజం చెప్పుకోవాలిసొస్తే అతనితో జోడైన రూపూకాదు. చెల్లెలిది అత్యాశకాకపోతే మరేమిటి?

ఇది ఒక తప్పయితే ఆ విధంగా అడ్డదారిన అతనికోసం ప్రయత్నించి కాలు జార్చటం మరో తప్పు సరే — అయిందేదో అయింది పోనీ పెళ్లి చేసుకుంటానన్న మాటన్నా తీసుకున్నదా? అంటే ''అదీ లేద''న్నది సోఫియా

పైగా అదేం ధీమానో, ''పైకి అనలేదుగానీ ఇంతగా పెంచుకున్న అనుబంధాన్ని ఇప్పుడెలాగ కాదంటాడు? ఎలాగ తెంచేస్తాడు?'' అన్నది

## కాలం కరిచాక

అయ్యో పిచ్చిమొహమా అనుకుని, ''అదేం వెర్రిమాట! ఎంత ముదిరినా రహస్య ప్రణయం పెళ్లికి హామీ పత్రమవుతుందా? మోజు తీరేదాకా నువ్వే నా లోక మన్నట్టుంటాడు; అది తీరింతరవాత నువ్వెవరో నేనెవరో అనవచ్చును. లేకపోతే తనంత తానే కోరివచ్చింది. అంది పుచ్చుకున్నాను. నాదేం తప్పులేదనవచ్చును. అతన్ననే దెవరు? చేతులుకాలిన నువ్వే లబ్బున గోలెత్తాలి'' అన్నాడు ధామస్

''కీడెంచి మేలెంచటం మంచిదే. ఒకవేళ ఆ సందర్భమే ఒచ్చినా అందుకు గూడా సిద్ధపడే వున్నాను నేను'' అన్నది సోఫియా నిశ్చయంగా

''భగ్నప్రేమికురాల్లా ఏడుపుగొట్టు పాటలు పాడుకుంటూ జీవితాంతం గడిపేయగలనంటావ్ — అంతేనా?'' వెటకారంగా అన్నాడు ధామస్.

''వలచినవాణ్ణి ఒప్పించుకోలేక మోసపోయానని తల మోదుకు ఏడ్వటానికి మామూలు ఆడపిల్ల కాదురా అన్నా నీ చెల్లెలు.''

చెల్లెలి గొంతులో పలికింది గర్వమో, ఆత్మ విశ్వాసమో తెలియలేదు ధామస్‌కి

''నీ మొహం. ఏం చెయ్యగలవ్ మరి?'' అన్నాడు చులకనగా

ఇంకాస్త అన్నకి దగ్గరగా జరిగింది సోఫియా.

''నీ అండ వుంటే నే సాధించలేనిదేముందిరా అన్నా'' అంటో ఉబ్బేసి, ''ఇక్కడే నీ సాయం నాక్కావాలిరా'' అంది గోముగా.

''ఏం చేయాలంటావ్?''

''మనం గొప్పవాళ్లు అనుకునే వాళ్లున్నారు చూశావ్—పైక్కనబడేగంభీరం వుత్త పటాటోపమే. కంగిస్తే తెలుస్తుంది వాళ్ల పిరికి గుండెలెంత వోటివో. ఇంకో బలహీనం ఏమిటంటే ప్రాణం పోడానికైనా ఒప్పదల ఔతారుగానీ పరువు పోగొట్టుకోడానికి ఒల్లకాదంటారు.

రాక్షసుడి ప్రాణంలా ఆ ఆయువు పట్టుని లంకించుకుంటే మనచేతి కీలుబొమ్మలవుతారు వాళ్లు ఈ పెద్దమనిషి ఆ కోవలో వాడే గనక మన మతనికి జడవక్కరలేదు.

మంచిగా ఒప్పుకున్నాడా సరే — గొడవలేదు. నువ్వన్నట్టు కాదంటాడా? రట్టు చేసో, రచ్చకీడుస్తామని బెదరగొట్టో బలవంతానైనా చర్చికి ఈడ్చుకుపోయి నాకతనితో పెళ్లి జరిపించెయ్యాలి నువ్వు. బంధమంటూపడి నా చేతికి చిక్కితే ఇంకెక్కడికి పోగలడు?'' తను వేసిన పథకం తాలూకు నమూనా వివరించింది సోఫియా.

నచ్చినా నచ్చకపోయినా యింత వరకూ వచ్చాక వేరే గత్యంతరం లేదనపించింది ధామస్‌కి తనపని దౌర్జన్యం చెయ్యటమే గనక తనకది కష్టం కూడా కాదు

''పద ఇప్పుడే అతగాణ్ణి ఓ పట్టుపట్టి అమీ తుమీ తేల్చేద్దాం'' అంటూ లేవబోయాడు

నవ్వి అన్నగారి భుజం పట్టి ఆపింది సోఫియా ''దానికింకా ఆలస్యముందిరా అన్నా నేచెబుతాగా!'' అన్నది తాపీగా.

(ఇంకా వుంది)

# శర్మబావ ఇళ్ళవేట



'ఆయనెవరో చెప్పినట్లు ఇసుకనుంచి నూనె తియ్యటంకన్నా, ఎండమావిలో నీళ్ల తాగటం కన్నా, బజార్లో పంచదార దొరకటంకన్నా కూడా కష్టం భాగ్యనగరంలో ఇల్లు సంపాదించటం. ఇక్కడ వచ్చిన చిక్కేమిటంటే హైదరాబాద్ ట్రాన్స్ఫరయి వచ్చిన ప్రతి వెధవా చిక్కడపల్లిలో ఉందామనే అనుకుంటాడు దాంతో అక్కడ ఇసుక వేస్తే రాలనంత జనం ఇళ్లకి విపరీతమయిన డిమాండు వాళ్ళ మాత్రం ఛస్తారా దూరంగా వెళ్లి ఉందామంటే మన సిటీబస్సుల పుణ్యమా అని లేటుగా వచ్చినందుకు రోజూ ఆఫీసర్‌చేత చీవాట్లు తినాలి దానికితోడు ఆటోలవాళ్ళ పీక్కుతినేస్తారు. అసలు ఈ విషయంమీద ఒక పేపర్ రాసేద్దామను కుంటున్నాను' గిరీశం పోజు పెట్టాడు శర్మబావ.

'బావా! ప్రసిద్ధిచెందిన ఉస్మానియా యూనివర్సిటీలో సోషియాలజీ లాంటి డిపార్టు మెంటులో లెక్చరర్‌వి అయినందుకే నిన్ను అభినందించాలి ఇటువంటి విషయాలమీద పేపర్లు రాస్తే నీకు సన్మానం చేసే ప్రమాదం రావచ్చు జాగ్రత్త'

'పిచ్చివాడా! పనికిమాలిన పొలిటీషియన్లకి సన్మానాలు చెయ్యటంలో మునిగి ఉన్నారు జనం అంతా మనకి అలాంటి భయాలేమీ లేవు'

'అవన్నీ సరేగాని బావా నా యింటి విషయం ఏం చేశావు'

'అభయం. అభయం. అయినా నిన్ననే కదరా వచ్చావు. తొందరపడకు. కాఫీ ఇస్తావా కాంతామణి' ఒక పొలికేక పెట్టాడు.

''చూడు రాంబాబూ ! జీవితం చాలా చిన్నది. ఈ కాస్త జీవితం నవ్వుతూ గడిపెయ్యాలి చిన్న చిన్న సమస్యలు వచ్చినప్పుడు షేక్స్పియర్లాగా మొహం పెడితే పెద్ద సమస్యలు వచ్చినపుడు జుట్టు పీక్కున్నా తెగవు. అంచేత తొందరపడి బాధపడకు నీకు ఇల్లు చూసే బాధ్యత నాది.'

శర్మబావ నాకు మేనత్త కొడుకు. చిన్నప్పట్నుంచి కలిసి మెలిసి తిరిగినవాళ్లం అవటంచేత చనువు ఎక్కువ. వయసులో నా కన్నా ఓ పదేళ్ళ పెద్దవాడే. మొన్నటివరకు మద్రాసులో ఉన్న నాకు హైదరాబాదు ట్రాన్స్ఫరవటంతో రైలుదిగి తిన్నగా శర్మబావ ఇంటికిచేరి, ఇల్లు వెదికే భారం తనమీద పెట్టాను

కాఫీ వచ్చింది. సిప్ చేశాం.

'కాఫీ తిన్నావోయ్' అన్నాడు భార్యతో. అది శర్మబావకి ఊతపదం

'గ్రామర్ తప్పు బావా! కాఫీ తినరు. తాగుతారు.'

'అబ్బ! జోక్ తిన్నావోయ్.'

*　　*　　*

ఆ రోజు ఆదివారం. పొద్దున్న తొమ్మిదిన్నర అవుతోంది రేడియోలో నిలయ విద్వాంసులు వేణువుని, వంటింట్లో శర్మబావ పెసరట్లని ఊదేస్తున్నారు.

నేను మూడు పెసరట్లు తిని చేతులెత్తేశాను.

'పట్టుమని పది పెసరట్లు తినలేని వాడివి నువ్వేం తెలుగువాడివిరా. అరవ దోసెలు తినటానికి అలవాటు పడిపోయావు. నాకు ఇంకో పెసరట్టు వెయ్యవోయ్ ప్రాణసఖి' అన్నాడు భార్యవైపు తిరిగి.

ఒక పెసరట్టు పడింది ప్లేటులో

'అయినా నేరం నాదికాదు లలితకుమారీ నీ చేతి వంటది. ఇవాళ పెసరట్లు నిజంగా తిన్నావు'' అన్నాడు భార్యతో.

''నేనింకా తినలేదు ఇందాకట్నుంచీ తింటోంది మీరే''

''అబ్బ. జోకు తిన్నావోయ్ ''

శర్మబావ ఉంటే సందడికి తక్కువేమీ ఉండదు.

'బావా. మనం కనీసం ఇవ్వాళైనా ఇళ్లవేట పూర్తి చెయ్యాలి' అన్నాను. అప్పటికే దరిదాపు వారంరోజులు అవుతోంది నేను వచ్చి. శర్మబావ ఎంత కావలసినవాడైనా అన్నిరోజులు ఇంకొకళ్ల ఇంట్లోఉండటంనాకిష్టంలేదు అందులోనూసిటీల్లో.

'వెళ్దాం రా. నేతితో వండిన ఈ పెసరట్లు హెవీడోస్ ఇలా పడితే ఇక సాయంత్రంవరకు మనం తిండి మొహం చూడక్కర్లేదు. ఇవ్వాళ అంతా నీ పనే' అన్నాడు చెయ్యి కడగటానికి లేస్తూ

*　　*　　*

సిటీబస్‌లో పక్కన కూర్చున్నాయనతో బావ బాతాఖానీ.

'ఈ పేపర్లో ఇందిరాగాంధీ ఫోటో చూశారా మాస్టారూ. ముక్కు తింటుందండీ'

'చూడండి. ఆవిడకి గవర్నమెంటువాళ్ళు జీతం ఇస్తారు. అదిగాక తండ్రి రాసిన పుస్తకాలమీద ఆదాయంకూడా ఆవిడకి బాగానే ముడుతుంది. అందుచేత ఆవిడకి ఇలా ముక్కులు, బుక్కులు తినాల్సిన అవుసరం లేదు' అన్నాడాయన చరణ్‌సింగ్ మొహంపెట్టి సీరియస్‌గా.

'అబ్బ జోకు తిన్నారు సార్. సీరియస్‌గా జోకు చెప్పగలిగినవాళ్లని ఇన్నాళ్లకి మిమ్మల్నే చూశాను '

* * *

నారాయణ్ గూడాలో బస్ దిగాం.

'ఇక్కడ దగ్గర్లో ఒక ఇల్లు ఉండాలి చూద్దాం' అన్నాడు శర్మబావ.

అయిదు నిముషాలు నడిచాక తాజ్‌మహల్ హోటల్ దగ్గర సందులో ఒక ఇంటి ముందు ఆగాం.

ఇంటి నెంబరు చూశాక, 'కామేశ్వరరావుగారూ' అంటూ పిలిచాడు గుమ్మం దగ్గర నిలబడి

కొద్దిసేపట్లో ఒక మధ్యవయస్కుడు బయటికి వచ్చాడు

'ఎవరండీ'

'కామేశ్వరరావుగారు మీరేనా' అడిగాడు బావ

'అవును'

'నమస్కారం సార్. నా పేరు శర్మ వీడి పేరు రాంబాబు '

'నమస్కారం. ఏం కావాలండీ' ఆయన్ని చూస్తే కొత్తవాళ్లతో మాట్లాడటం ఇష్టంలేని వాడిలాగా అనిపిస్తున్నాడు

'వీడు నా మేనమామ కొడుకండీ. బ్యాంకులో ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు ట్రాన్స్‌ఫర్ మీద ఇక్కడికి వచ్చాడు మీ ఇంట్లో ఒక పోర్షను అద్దెకి ఉందని తెలిసివచ్చాం' క్లుప్తంగా వివరించాడు

'మా ఇంట్లో పోర్షను ఏమీ అద్దెకి లేదు' ఆయన మొహం ఎందుకనో చాలా అప్రసన్నంగా ఉంది.

శర్మబావ అర్థం కానివాడులాగా అటూ ఇటూ చూశాడు గేటు దగ్గిరికి వెళ్లి ఇంటి నెంబరుని తన డైరీలో రాసుకున్న నెంబరుతో పోల్చి చూశాడు

'ఇంటి నంబరు ఇదే మీ పేరు బి. కామేశ్వరరావు కదా' ఆయన్ని అడిగాడు

'అవును' ఆయనకి ఈ వ్యవహారం అంతగా నచ్చినట్లులేదు

'అయితే మీ ఇంట్లో పోర్షను ఉండేతీరాలి' తేలిగ్గా ఊపిరి పీలుస్తూ అన్నాడు శర్మబావ.

'లేదని నేను చెపుతున్నాను కదా' ఆయన చికాగ్గా అన్నాడు

'మీరు భలేవారు సార్' అన్నాడు శర్మబావ కొట్టిపారేస్తున్నట్లుగా

'మా ఇంటి పేరు భలే కాదు. భావరాజు' ఆయన సీరియస్‌గా అన్నాడు.

మా శర్మబావకి సమానంగా జోకు వెయ్య కలిగిన వాడిని ఇన్నాళ్లకి చూశాను.

'అబ్బ ... అబ్బ ... జోకు తిన్నారు సార్.

# శర్మ బావ — ఇళ్ల వేట

ఇంతకీ మీరు భావరాజువారా. ముందే చెప్పారు కారు. అయితే మీకు కాకినాడలో భావరాజు సుబ్బారావుగారు తెలిసే ఉంటారు' అన్నాడు శర్మబావ ఆయన ఆయువుపట్టు తెలుసుకున్న ధోరణిలో.

'ఆ కాకినాడ సుబ్బారావు ఎవరో నాకు తెలియదు' ఏమిటీ గోల. అన్నట్లు చూశాడు.

'కాకినాడ సుబ్బారావు కాదు. భావరాజు సుబ్బారావ్. కాకినాడలో ... ' టీచరు బుద్ధిపోనిచ్చు కోకుండా సరిదిద్దాడు శర్మబావ.

'ఎవరైతేనేం, ఆయన నాకు తెలియదు. తెలిసినా మీకు పోర్షను ఇచ్చేది లేదు' అసహనంగా అన్నాడు ఆయన.

'అంటే ఉందన్నమాట. నేను చెప్పలే' దొంగని పట్టేశాడు బావ

పేకాట్లో పొరపాటున జోకరు కిందపడేసిన వాడిలాగా మొహం పెట్టాడు కామేశ్వరరావుగారు.

'మీరు మొహమాట పడకండి సార్' అంటూ శర్మబావ అటూ ఇటూ వెదుకుతున్నట్లుగా చూశాడు. 'మేం కూర్చోవచ్చా' అడిగాడు

'నిరభ్యంతరంగా కూర్చోవచ్చు. కాని పోర్షను లేదు' అన్నాడు ఆయన నిలదొక్కుకోవటానికి ప్రయత్నిస్తూ.

'పోర్షనుదేముంది సార్. ఇవ్వాళ ఉండకపోతే రేపు ఉంటుంది. కాని మనుషులు, పరిచయాలు ఎంత విలువైనవి అవి ఇలా తేలిగ్గా వదిలెయ్య కూడదు మీరు అలాగే నిలబడిపోయారు కూర్చోండి సార్'

ఆయన కూర్చున్నాడు శర్మబావవంక తీక్షణంగా చూస్తూ.

'మంచినీళ్లు తాగుతారా' చాలా మర్యాదగా అడిగాడు బావ, ఆయన తన అతిథి అయినట్లు

ఆయన తల అడ్డంగా ఊపాడు ఇంకా తీక్షణంగా చూస్తూ.

## జోలపాట

॥పల్లవి॥ జో! ఓటరానంద! జో! జో! ఓటరూ
'ఓటు' పరమానంద 'నోటు' బాగుందా!
'నోటు'లేకుంటే మరి 'సీటు' గోవిందా!!

॥చ॥ తాతలంతా మరి నేతులే తాగారు
నేతలంతా నీకు నీతులే చెప్పారు
చివరికంతా కలిసి గోతులే తవ్వారు
గోతిలో జనమంత కలిసి నవ్వారు

॥చ॥ రేపన్నదే లేదు నీకూ నాకూ
నిన్న మొన్నలు మనకి అన్నలే కాదా
బొంకి చెపితే నీకు తీయగుంటదీ
నిజం చెపితే నీకు చేదుగుంటదీ

జో! ఓటరానంద! జో! జో! ఓటరూ!
'ఓటు' పరమానంద 'నోటు' బాగుందా!

— రామసూరి

'నేను తాగుతాను'

ఆయనకి ఏం చెయ్యాలో తెలియలేదు. జుట్టు పీక్కున్నంత పనిచేసి, సీరియస్‌గా చూస్తూ లోపలికి వెళ్లాడు.

ఈ వ్యవహారం ఎక్కడికి వెళ్తోందో నాకు అర్థం అవటంలేదు.

'నువ్వు కూర్చోరా మన ఇల్లే అనుకో'

'నాకేం అర్థం కావటంలేదు బావా'

'అవుసరంలేదు నీకు ఇక్కడ పోర్షను ఇప్పించే బాధ్యత నాది' అన్నాడు భుజం తడుతూ.

నాకుమాత్రం అంతా అయోమయంగా ఉంది.

ఇంతలో ఆయన రెండు గ్లాసుల్లో మంచినీళ్లు తీసుకువచ్చాడు ఒకగ్లాసు శర్మబావ తీసుకున్నాడు.

'నాకు వద్దండీ' అన్నాను రెండోది ఆయన నాకివ్వబోతుంటే

ఆయన వెనక్కి తీసుకోబోయాడు.

'అదికూడా నాకే ఇచ్చెయ్యండి. పాపం వెనక్కి ఏం తీసుకువెళ్తారు' అన్నాడు శర్మబావ ఆ గ్లాసు కూడా తీసుకుంటూ.

రెండు గుక్కల్లో రెండు గ్లాసులూ ఖాళీ చేశాడు.

'ఇంతకీ నేను చెప్పేది ఏమిటంటే మా ఇంటి పేరు తుర్లపాటివారు' అన్నాడు శర్మబావ ఖాళీ గ్లాసులు కిందపెడుతూ.

'కావచ్చు. కాని పోర్షనులేదు' నిర్లిప్తంగా అన్నాడు ఆయన.

'భావరాజువారికి, తుర్లపాటివారికి తరతరాలుగా సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి. వాటిని మనం ఇలా తుంచెయ్యకూడదు సార్ !'

'ఎందుకు తుంచెయ్యకూడదు. ని . . ని .. అదేమిటబ్బా' బుర్ర గోక్కున్నాడు.

'నికృష్టం' శర్మబావ అందించాడు.

'కాదు.'

'నిర్యాణం '

'ఛ '

'నిక్షేపం.'

'కరెక్ట్ నిక్షేపంగా తుంచెయ్యవచ్చు!' అని ఆయన తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు

'ఆ పని మీ భావరాజువారు చెయ్యగలరేమోగాని మా తుర్లపాటివాళ్లం చెయ్యలేం' అన్నాడు శర్మబావ కొంచెం బిగ్గరగా.

ఆయన బదులు చెప్పేలోగా లోపల్నుంచి కర్టెన్ తొలగించుకుని ఒక ముసలావిడ వచ్చింది.

ఆవిడ్ని చూడగానే శర్మబావ మొహం ఆనందంతో వెలిగింది. కామేశ్వరరావుగారు మాత్రం కంగారు పడ్డారు.

'ఎవరు బాబూ తుర్లపాటివారి అబ్బాయి' కళ్లజోడు సవరించుకుంటూ అడిగింది ఆవిడ.

'అమ్మా! నువ్వు లోపలికి వెళ్లు' ఆయన ఆవిడని లోపలికి తీసుకెళ్లబోయాడు.

శర్మబావ చెంగున ఆవిడ ముందుకి వెళ్లి 'నమస్కారం మామ్మగారూ! నేనే తుర్లపాటివారి అబ్బాయిని. నా పేరు శర్మ. ఇల్లు అద్దెకి అడగటం కోసం వచ్చాను' అంటూ పరిచయం టూకీగా పూర్తిచేశాడు.

'నువ్వా బాబూ. మా పుట్టింటివారి ఇంటి

పేరు కూడా తుర్లపాటివారే' అంది ఆవిడ ఆనంద పడిపోతూ నెత్తిమీద ముసుగు సర్దుకుంటూ.

'ఆహా ఎంతటి అదృష్టం మామ్మగారూ. మన ఇద్దరి ఇంటి పేర్లు ఒకటే అవటం నా పూర్వ జన్మ సుకృతం. ముందు మీరు కూర్చోండి మామ్మగారూ. పెద్దవారు, ఎక్కువసేపు నిలబడ లేరు' హడావిడి చేశాడు శర్మబావ పరిస్థితిని తన చేతుల్లోకి తెచ్చుకుంటూ.

కామేశ్వరరావుగారు నిస్సహాయుడిలా చూస్తూ ఉండిపోయాడు.

'నిజమే నాయనా. రెండు నిముషాలు నిలబడితే చాలు నడుంనొప్పి ఏమిటో? పోయే వయసేగాని వచ్చే వయసా.' ఒకసారి నిట్టూర్చి వెంటనే అడిగింది 'ఇంతకీ మీది ఏ వూరు బాబూ' కుర్చీలో కూర్చుంటూ.

'అమ్మా! నువ్వు లోపలికి పద.'

'ఉండరా. మీది ఏ వూరు బాబూ.'

'మాది బందరండి.'

'నా మాట వినమ్మా. లోపలికి రా'

'అలాగా. అయితే తుర్లపాటి హనుమంతరావు తెలిసే ఉండాలే.'

శర్మబావ ఎగిరి గంతేశాడు.

'తెలియటం ఏమిటండీ. ఆయన మా నాన్నగారే'

కామేశ్వరరావుగారు తల పట్టుకుని కూర్చుండి పోయాడు.

'చెప్పావు కాదేం నాయనా. నువ్వు మా హనుమంతు కొడుకువా. నిన్నెప్పుడో ఇంతప్పుడు చూశాను. అప్పుడు నీకు నాలుగేళ్లు. బందర్లో గొడుగుపేటలో ఉండేవాళ్లు మీరు. ఆ రోజుల్లో నువ్వు ఎప్పుడూ బట్టలు వేసుకోకుండా...'

'మామ్మగారూ'

'...చీమిడి ముక్కుతో...'

'మామ్మగారూ'

'...ఎప్పుడూ ఏడుస్తూ '

'మన బంధుత్వం ఏమిటో చెప్పారుగారు మామ్మగారూ!' తెలియని వయసులో తాను చేసినవి ఇప్పుడు చర్చించటం ఇబ్బందికరంగా ఉంది శర్మ బావకి.

'అయ్యో. బంధుత్వాలు అడిగి తెలుసుకోవలసిన అగత్యం పట్టింది. చూడు నాయనా. మీ నాన్న చిన్నప్పుడు తన ఇంట్లోకన్నా ఎక్కువ మా ఇంట్లోనే ఉండేవాడు. అన్నం, చదువు, బట్టలు అన్నీ మాతో పాటే. తర్వాత దూరాభారంవల్ల ఒకళ్లకొకళ్లు దూరం అయ్యాంగాని, ఒకళ్లంటే ఒకళ్లకి ఎంత ఆప్యాయత...అభిమానం...' ఆవిడ గతంలోకి వెళ్లి పోతోంది.

కామేశ్వరరావుగారు ఊపిరి బిగపట్టి వింటు న్నాడు డీలాపడ్డ మొహంతో.

'అంటే చాలా దగ్గర సంబంధం అన్నమాట' అన్నాడు శర్మబావ ఆయనవైపుచూసి తలఆడిస్తూ.

'అలాగని మరీ అంత దగ్గర సంబంధమూ కాదనుకో' అంది ఆవిడ.

శర్మబావ మొహంలో, వెలుగు కాస్త తగ్గింది.

'అలాగని పూర్తిగా బీరకాయ పీచుకూడా కాదు గదా మామ్మగారూ' అన్నాడు బావ.

'ఎంత మాట నాయనా! స్వయానా నా వేలు విడిచిన బాబాయి మనవడే మీ నాన్న' అంది ఆవిడ సస్పెన్స్ చేప్పేస్తున్నట్లుగా పోజుపెట్టి.

కొంచెం తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు కామేశ్వరరావుగారు.

అది గమనించిన శర్మబావ 'అది చాలదుటండీ. కావాలనుకుంటే; అంతకన్నా దగ్గర సంబంధం ఏముంటుంది చెప్పండి? ఇన్నాళ్లూ అజ్ఞానంలో ఉండి మిమ్మల్ని కలవలేదు' అన్నాడు బుద్ధుడిలాగా.

'దానిదేముందిలే నాయనా! ఇప్పుడు తెలిసిందిగా.'

'పోయేటప్పుడు మా నాన్నయినా చెప్పలేదు మరి' టైముకి అస్త్రం వదిలాడు శర్మబావ.

'ఆ! హనుమంతు పోయాడా! ఎప్పుడు జరిగింది ఈ ఘోరం' ఆవిడ ఆత్రంగా అడిగింది.

పరిస్థితి మళ్లీ శర్మబావ చేతుల్లోకి వచ్చింది.

'పోయిన సంవత్సరం చనిపోయారండి మా నాన్నగారు. గుండెజబ్బుచేసి' అన్నాడు విచారంగా మొహంపెట్టి.

'అయ్యో! వెళ్లిపోయావా హనుమంతూ. అందరి ఆయువూ పోసుకుని నేనే బతుకుతున్నాను పాపిష్టిదాన్ని' అంది ఆవిడ ముక్కు చీదుతూ.

అవునన్నట్లుగా చూశాడు కామేశ్వరరావుగారు.

'అలా అనకండి మామ్మగారూ. అందరం పోయేవాళ్లమే. ఒకళ్లు ముందు. ఒకళ్లు వెనుక. అంతే' అన్నాడు శర్మబావ ధైర్యం చెపుతున్నట్లుగా.

ఒక నిముషం భారంగా గడిచింది. ఆవిడ ముక్కు చీదటం బాక్‌గ్రౌండ్‌లో కంటిన్యూ అవుతూండగా?

'ఇవ్వాళ చాలా సుదినం మామ్మగారూ. ఇల్లు వెదుక్కుంటూ వస్తే మీరు కనిపించారు. వీడు మా మామయ్య కొడుకు. పేరు రాంబాబు. బ్యాంక్‌లో ఆఫీసర్‌గా పనిచేస్తున్నాడు. హైదరాబాద్ ట్రాన్స్‌ఫరయి వచ్చాడు. మీ ఇంట్లో పోర్షను ఒకటి అద్దెకి ఉందని తెలిసి ఇలా వచ్చాం' అన్నాడు అసలు విషయానికి వస్తూ.

'ఉంది బాబూ. రెండు రోజుల క్రితమే ఖాళీ అయింది. ఏరా కాముడూ. ఉంది కదా!' ఆవిడ కొడుకుని అడిగింది.

'నిన్ననే ఇంకొకళ్లకి ఇస్తానని చెప్పాను అమ్మా...' అన్నాడాయన నీరసంగా.

'ఎవరికో ఎందుకు? కావలసినవాళ్లు ఉన్నప్పుడు బయటివాళ్లకి ఇవ్వటం ఎందుకు. వాళ్లకి లేదని చెప్పెయ్' అంది ఆవిడ అధికార స్వరంతో.

'అదికాదమ్మా. .'ఆయన ఏదో చెప్పబోయారు.

'ఇంకేం చెప్పకు.'

'అదికాదమ్మా వీళ్లు ఎలాంటి టైపు మనుషులో తెలుసుకోకుండా...' మూలుగుతున్నాడు ఆయన.

శర్మబావ ఎగిరి గంతేశాడు.

'ఆ కరెక్ట్ టైప్... టైపిస్ట్' అన్నాడు ఆవేశంగా.

కామేశ్వరరావుగారు కంగారు పడ్డట్టుగా అటూ ఇటూ చూశాడు.

'ఏమిటబ్బాయ్. టైపు ఏమిటి?' ఆవిడ కుతూహలంగా అడిగింది.

'ఏం లేదు మామ్మగారూ. అది వేరే కథ.'

'ఏం లేదులే అమ్మా. నువ్వింక లోపలికి వెళ్లు' కంగారుగా అన్నాడాయన.

'వెళ్తాలేరా ఇతనికి మాత్రం ఇల్లు ఇయ్యి. అద్దె గురించి ఏమీ పోట్లాడకు' అందావిడ లేస్తూ.

శర్మబావ కూడా లేచాడు.

'వస్తాను నాయనా. మంచిరోజు చూసుకుని వచ్చి దిగండి. ఒకళ్లకొకళ్లం తోడుగా ఉంటాం' ఆవిడ వీడ్కోలు సందేశం.

'అలాగే మామ్మగారూ! మీరు విశ్రాంతి తీసు






## శర్మ బావ — ఇళ్ల వేట

కోండి' అన్నాడు శర్మబావ ఆవిడతోపాటు లోపలి గుమ్మంవరకూ వెళుతూ.

ఆవిడ వెళ్లాక నావైపు తిరిగి కన్నుకొట్టి చిరు నవ్వు నవ్వాడు.

కాసేపట్లో కామేశ్వర్రావుగారు బయటికి వచ్చాడు.

'అయితే మేం వస్తాం కామేశ్వర్రావుగారూ. మంచిరోజు చూసి మా రాంబాబు ఫామిలీతోసహా వచ్చి దిగుతాడు. అద్దె ఎంతో మీరే చెప్పండి' అన్నాడు బావ చర్చలు ముగిసినట్లుగా.

'అది తర్వాత. ముందీ విషయం చెప్పండి. ఇందాక మీరు టైపు గురించి అన్నది ఏమిటి' అడిగాడు ఆయన కోపంగా.

'నేనేం అనలేదే. టైపిస్ట్ అని గుర్తు చేశాను అంతే'

ఆయన సూటిగా చూశాడు. ఓడిపోతున్నట్టుగా ఉంది ఆ చూపు.

'మీకు ఎంత తెలుసు'

'నాకు అంతా తెలుసు. టైపిస్ట్...మాలతి... ప్రేమ. .వ్యవహారం...'

సినిమాల్లో విలన్లాగా అనిపించాడు శర్మబావ నాకు.

ఆయన్నిచూస్తే జాలేసింది.

చివరి ప్రయత్నంగా అన్నాడు — 'తెలిసినంత మాత్రాన మీరు ఏం చెయ్యగలరు' మేకపోతు గాంభీర్యం నటించాడు

'ఈ విషయం మీ అమ్మగారి చెవిలో ఊది ఊది ఊదరగొట్టేశాను అనుకోండి, ఆవిడ మీ భరతం పట్టేస్తారు. అవునా'

ఆయన ఒక్కనిముషం ఆలోచించాడు.

'సరే. మంచిరోజు వచ్చి దిగండి. అద్దె మూడొందలు. ఇల్లు చూసి వెళ్లండి' అన్నాడాయన పక్కపోర్షను తాళం తీస్తూ.

*   *   *

'ఏమిటి బావా ఈ మిస్టరీ ? ఈ సస్పెన్స్ నేను భరించలేను. నువ్వు టైపిస్ట్ గురించి ఆయనతో అన్నది ఏమిటి ? అది విని ఆయన ఎందుకు అంత భయపడ్డాడు. ఆ ముసలావిడని చూసి ఆయన ఎందుకంత భయపడుతున్నాడు ? ఈ ప్రశ్నలకి సమాధానం తెలిసీ చెప్పకపోయావో నా తల వెయ్యి ముక్కలయిపోతుంది' ప్రశ్నల వర్షం కురిపించాను బయటికి రాగానే.

శ్రీ కృష్ణపరమాత్మ వేషంలో ఎన్టీఆర్‌లాగా చిర్నవ్వు నవ్వాడు శర్మబావ.

'పిచ్చివాడా. అదే కిటుకు నీకు కథంతా చెప్తాను విను. ఈ పోర్షన్లో రెండురోజుల క్రితం వరకూ నా స్నేహితుడు ఒకతను ఉండేవాడు. అతన్ని బలవంతంగా ఖాళీ చేయించాడు ఈ కామేశ్వర్రావు గారు తన తల్లికి తెలియకుండా. ఎందుకో తెలుసా ? ఆయన ఆఫీసులో మాలతి అని ఒక టైపిస్ట్ ఉంది ఆ వృద్ధకన్యతో ప్రేమలో పడ్డాడు ఈయన. ప్రక్క పోర్షన్లో ఆవిడ్ని తెచ్చి, అద్దెకు దింపినట్లుగా దింపి, వ్యవహారం సాగించ వచ్చని ఆయన ప్లాన్. ఈ విషయం నా స్నేహితుడు నిన్న నాకు చెప్పాడు. అతన్ని ఈ కుటుంబం గురించి వివరాలు అడిగితే తెలిసింది. కామేశ్వర్రావుకి ఒక ముసలి తల్లి ఉందని, ఆవిడ పుట్టింటివారి ఇంటి పేరు తుర్లపాటి అని ఆవిడ అప్పుడప్పుడు మా ఫ్రెండ్‌తో చెపుతూ ఉండేదిట.'

'ఆవిడంటే కామేశ్వర్రావుగారికి ఎందుకంత భయం ?'

'వస్తున్నా. అదే అసలు పాయింటు. అయిదు లక్షల రూపాయల ఆస్తి అంతా ఆవిడ పేర్న ఉంది. ఆవిడకి ఏ మాత్రం కోపం వచ్చినా యావదాస్తిని అనాథశరణాలయానికి రాసేస్తానని బెదిరిస్తూ ఉంటుందిట. అందుకని ఆవిడంటే కామేశ్వర్రావుకి చచ్చేంత భయం. వాడి భక్తి అంతా ఆస్తిమీదనేనని తెలిసిన ఆ ముసలావిడ అది వాడి పేర రాయటం ఆలస్యం చేస్తోంది. ఈ విషయాలు అన్నీ మా స్నేహితుడి దగ్గర్నుంచి తెలుసుకుని ఈ ప్లాన్ వేశాను. తిన్నాను కదా ?'

'బావా... నువ్వు జీనియస్.'

'నీ మొహం. ఈ మాత్రం తెలివితేటలు లేకపోతే ఈ లోకంలో మనలాంటి చిన్నచేపలు బతకటం కష్టం. అయితే ఇందులో మనం ఊహించని విషయం ఆ ముసలావిడకి మా నాన్నగారు తెలియటం. దానివల్ల పని తేలిక అయింది' అన్నాడు శర్మబావ తాజ్‌మహల్‌లోకి దారితీస్తూ. ★

# కార్టూన్ల వర్షాకాలం - బిNరెడ్డి


















( గత సంచిక తరువాయి )


మహేంద్ర దేవా! నా సోదరులను బంధుజనులెల్లరను చూడవలెనను తలంపు మిక్కుటముగ నున్నది
అలాగే ధర్మరాజా! ఈ దేవదూతతో వెళ్లండి మీవారినందరినీ చూపిస్తాడు
మేమూ ధర్మరాజుతో వెళ్ళెదము మహేంద్రా!


దేవదూత ముందు దారిచూపగ యుధిష్ఠిర సోదరులు ముందుకు సాగిరి.. అంత నొకచో
ఆ!!! దుర్యోధనుడా!


మహర్షీ! ఏమిటీ విపరీతం? అతడు దుర్యోధనుడే గా!
హు! మహాపాపికి మహనీయ భోగములా?








అవును ధర్మరాజా! ఈ చోటును దేవలోకములోనిదే.. మనము రావలసిన చోటుకే వచ్చాము...


ఎవ్వరు మీరు?



# "అంత ప్రత్యేకత ఏముందని సర్ఫ్‌లో ? ఉతికే పౌడర్లన్నీ నా ఉద్దేశ్యంలో ఒకటేననుకుంట-కాదా ?"

**అని రాస్తున్నారు శ్రీమతి శీలా సింగ్-లింకింగ్ రోడ్, ఖార్, బొంబాయి.**

మేం శ్రీమతి శీలా సింగ్‌ను మా రీసెర్చ్ లేబరేటరీకి ఆహ్వానించాం—బాగా మాసిన తెల్ల చొక్కాని ఉతికే పరీక్ష చేసి చూపిద్దామని

## చొక్కాని రెండుముక్కలుగా చేసాం. ఒక్కముక్కలో నిరూపిద్దామని.



పైన పేరులేని రెండు డిటర్జంట్ ప్యాక్‌లలోంచి పౌడర్ తీసి రెండు ద్రావణాలు తయారుచేసాం. పైపై మురికి పోయేందుకు చొక్కా ముక్కల్ని మామూలు నీటిలో పిండాక, ఒక్కొక్క చొక్కా ముక్కని ఒక్కొక్క ద్రావణంలో నానబెట్టాం. అలా ఆ చొక్కాముక్కలు నానుతూండగా. . .

## నీటికింద ఏం జరుగుతోందో వివరించి చెప్పాం-

మురికి తాలూకు ప్రతి అణువునూ వదలగొట్టేందుకు సర్ఫ్‌లో చురుకైన చర్యగల పదార్థాలు అత్యధికంగా ఉన్నాయి. ఆ ద్రావణంలో బట్టని పిండితే కలిగే ప్రయోజనం అందువల్లే మరి. అంతేకాదు, సర్ఫ్‌లో గల ఒక ప్రత్యేక పదార్థం, వదలగొట్టబడిన మురికిని వేరేగా ఉంచుతూ అది తిరిగి బట్టలపైకి చేరుకోకుండా నిరోధిస్తుంది.



## ఖచ్చితమైన గెలుపు

ఆ చొక్కా ముక్కలు పిండబడ్డాయి. వాటిలో తేడా స్పష్టంగా కనిపించింది—సర్ఫ్‌లోని తెలుపుచేసే ప్రత్యేక పదార్థం వల్ల.

## "అనుకోనేలేదు నేనెప్పుడూ, సర్ఫ్ యింతగా పనిచేస్తుందని" అంది శీలా

మేం ఆమెకి చెప్పాం, ఎక్కువ మంది గృహిణులు సర్ఫ్‌నే వాడతారని. ఎందుకంటే సర్ఫ్ కేవలం అత్యుత్తమ ఉతికే పౌడర్ మాత్రమే కాదు, అది ఆపేక్షతో శ్రద్ధని చూపే తీరు.




# హై పవర్ సర్ఫ్
## అమిత తెల్లగా ఉతుకుతుంది...అమిత తెల్లగా, కనువిందుగా!
### తెల్ల బట్టలకి సెబాష్ తెలుపు . రంగు బట్టలకి సెబాష్ గెలుపు

LINTAS-SU. 255 2316-TL

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.



# ఐ లవ్ యూ

కాకాని కమల

ఇంటికి వస్తూనే చేతిలోని బ్రీఫ్‌కేస్ టేబిల్ మీదకి విసిరి చరాలున మంచంలో వాలి కళ్ళు మూసుకున్నాడు రాజారావ్.

అతనికి మనసంతా మండుతున్నట్లు వుంది.

సరిగ్గా పావుగంట క్రితం జరిగిన సంఘటన...ఎంత మర్చిపోదామన్నా మరుపుకి రావటం లేదు. గుండెలో వాడి బాకులా పొడుస్తూంది.

ఈ రోజు దీపావళి పండుగ!

నిన్న సాయంత్రం నూట ఎనభై రూపాయలు పెట్టి "హరిత" కోసం అని ఒక చక్కటి క్రేప్‌సిల్క్ చీర కొన్నాడు.

ఇప్పుడేకాదు ప్రతీ పండగకీ ఆమెకోసం ఏదో ఒకటి కొని ప్రెజెంట్ చేస్తూ వుంటాడు.

నిన్న సాయంత్రం ఆఫీసు నుంచి వస్తూ చీర, స్వీట్సు కొని బ్రీఫ్‌కేస్‌లో పెట్టి తాళం వేశాడు.

ఈ రోజు ఉదయాన్నే ఆమె ఇంటికి వెళ్ళి "హాపీ దివాలీ" చెప్పి ఇద్దామనుకున్నాడు.

రాజారావుకి హరితతో పరిచయం ఇప్పటిది కాదు. దాదాపు ఏడాది క్రితమే జరిగింది.

తెల్లగా దంతపు బొమ్మలా అందంగా చాలా నాజూగ్గా వుంటుంది హరిత. రెండు జడలు వేసుకుని ఖరీదయిన చీరల్లో మంచి స్టైలుగా వుంటుంది. ప్రైవేటు కంపెనీలో పని చేస్తూంది ఇంకా పెళ్లి కాలేదు. ఒంటరిగా రెండు గదుల ఇల్లు అద్దెకి తీసుకుని వుంటోంది.

రాజారావ్ బ్యాంక్ ఉద్యోగి.

ఒకసారి "హరిత" కంపెనీ చెక్ మార్చుకుందుకు బ్యాంక్‌కి వచ్చింది.

మెరుపు తీగలా లోపలికి వస్తున్న ఆమెని చూడగానే రాజారావ్ మతి తప్పింది.

తనుగ తాను ఆమెకి సహాయం చేశాడు.

ఆ తరువాత రెండు మూడు సార్లు ఆమె బ్యాంకుకి వచ్చింది.

కాని ఈసారి మునుపటిలా కాక సరాసరి రాజారావ్ దగ్గరకే వచ్చింది స్వతంత్రంగా.

దాంతో బ్యాంక్‌లో రాజారావ్ క్రెడిట్ పెరిగింది.

"మీరు నాకు ఎంతో సహాయం చేస్తున్నారు. ఒకసారి మా యింటికి టీకి రండి. ప్లీజ్ ... దిసీజ్ మై రిక్వెస్ట్..." అంది గోముగా హరిత చక్కటి ఇంగ్లీషులో.

రాజారావ్ కరిగి పొయ్యాడు.

అతని ఆనందం అవధులు దాటింది.

ఆ విధంగా ఆమెతో పరిచయం పెరిగింది

ఆ పరిచయం ప్రణయంగా మారి తీగలు సాగి పుష్పించటానికి ఆట్టే కాలం పట్టలేదు.

ఒక విధంగా ఆమె అందం, లేతవయసు రాజారావుని వున్మత్తుడ్ని చేశాయి.

రాజారావ్‌కి పెళ్ళయింది ఇద్దరు పిల్లలు. భార్య శాంత నల్లగా, కాస్త లావుగా వుంటుంది. ఆట్టే చదువుకోలేదు – పల్లెటూరి రకం—వేషభాషల్లో కూడా నాగరికత కనుపించదు.

నిజానికి రాజారావుకి శాంత సరిఅయిన జోడి గాదు. కాకి ముక్కుకి దొండపండు.

రాజారావ్ మంచి పర్సనాలిటీతో అందంగా ఆకర్షణీయంగా వుంటాడు చక్కగా డ్రెస్ చేసుకుని ఏ వేళా ట్రిమ్‌గా అగుపిస్తాడు. శాంత దగ్గర బంధువుల పిల్ల. శాంత తండ్రి అల్లుడికి కట్నకానుకల రూపంలో బాగా ముట్టచెప్పాడు. స్కూటర్ కొనిచ్చాడు. ఇల్లు కట్టుకోమని భూమి రాసిచ్చాడు.

అందుకే శాంత మెళ్ళో కళ్ళు మూసుకుని రాజారావ్ మూడుముళ్ళు వేశాడు. ఏదో... జీవితం గడిచిపోతోంది.

కాని ...

శాంత లాంటి అమ్మాయిల్ని చూసి నప్పుడు మాత్రం అతడి మనసు పెర పెర లాడేది.

మనసంతా అవ్యక్తమైన వేదన అనుభవించేది.

"అందమైన ఆడపిల్లతో సుఖపడే యోగం భగవంతుడు తన మొఖాన రాయులేదు" అనుకొనేవాడు.

అలాంటి మనస్థితిలో "హరిత' పరిచయం అతడ్ని స్వర్గంలోకి తీసుకువెళ్లింది.

ఇద్దరి మధ్య "ప్రేమ"బలపడ్డాక తరచూ ఆమె ఇంటికి వెళ్లేవాడు. సెలవు దినాల్లో సగభాగం అక్కడే గడిపేవాడు. సినిమాలు, పిక్‌నిక్‌లు, షికార్లు ఎంజాయ్ చేసేవారు. పండగలు, ఫంక్షన్స్ పేరిట హరితకి విలువైన కానుకలు ఇచ్చేవాడు రాజారావ్.

హరిత అతడ్ని ఎంతగానో అలరించి మురిపించేది.

"తన భార్య అందగత్తె కాదు" అన్న అశాంతిని ఆ విధంగా కొంతవరకు మర్చిపో గలిగాడు రాజారావు

"శాంత" గంభీరంగా ప్రవహించే నది అయితే-

"హరిత" గలగలా దుమికే జలపాతం!

రాజారావ్‌కి జలపాతం అంటేనే ఇష్టం.

ఆఫీసులో అందరికి హరిత తన గరల్ ఫ్రెండ్ అని గర్వంగా చెప్పుకునేవాడు. వాళ్ళంతా ఇతని అదృష్టానికి ఈర్ష్య పడుతుంటే కాలరెత్తుకుని లోకాన్ని జయించి నట్లు ఠీవిగా తిరిగేవాడు.

* * *

ఈ రోజు దీపావళి పండుగ.

అందుకే నిన్న "హరిత" కోసం మంచి చీర కొని పాక్ చేయించాడు.

ఆఫీసు పని ఒత్తిడిచేత నిన్న సాయంత్రం ఆమె ఇంటికి వెళ్లటం కుదరలేదు.

అందుకని ఈ రోజు ఉదయాన్నే భార్య పోరు పడలేక తలంటి పోసుకుని. హరితకి ఇష్టమయిన లేత ఆకుపచ్చ రంగు సఫారీ డ్రెస్‌లో ముస్తాబయి బ్రీఫ్‌కేస్ స్కూటర్‌కి పెట్టి ఆమె ఇంటికి వెళ్ళాడు.

కాని-

ఎంతో హుషారుగా మేడ మెట్లు ఎక్కి ఆమె గదిలోకి అడుగు పెట్టబోయిన అతని గుండెకి ఎదురు చూడని విధంగా శరాఘాతం తగిలింది.

లోపల్నుంచి స్పష్టంగా సంభాషణ వినిపి స్తోంది. ఒక పురుష కంఠం ఏదో అంటుంటే హరిత కిలకిలా నవ్వుతోంది.

రాజారావ్ చెవులు రిక్కించాడు-

"గిరీష్! నిజం చెప్తున్నాను, ఆ రాజా రావ్ నీ కాలి గోటికి పనికిరాడు, ఐ హావ్ నో ఇంట్రస్ట్ ఎబౌట్ హిమ్. కాని... పూర్ ఫెలో! స్టిల్... హి ఈజ్ మాడ్ ఆఫ్టర్ మి! బ్యాంక్ పని తొందరగా అయిపోతుంది కదా అని అతని దగ్గరకు వెడతాను. అదంతా "లైకింగ్" అనుకుని వెంటపడ్డాడు బాంక్ ఎంప్లాయీ కదా? పర్సునిండా డబ్బు వుందేమో... చీరలు, సారెలు కొనిస్తాడు. అతని భార్య అందంగా ఉండదట! పల్లెటూరి గబ్బిలంట! అతనే చెప్పాడు పోనీ ... పాపం ... అని జాలి చూపించాను, కాని ... నిజానికి నేను నిన్ను "లవ్" చేస్తున్నానని చెప్తే "హర్ట్" అవుతాడు. తనే తెల్సు కుంటాడని ఓపిక పడుతున్నాను. !' గలగలా నవ్వింది

గిరీష్ శృతి కలిపాడు.

"అయినా... పెళ్లయినవాడికి ప్రేమేంటి చెప్పు?"

"నో ప్రేమ కాదు, పైత్యం!"

మళ్లీ నవ్వులూ

"ఏయ్ హరి! చిలకనవ్వు తరువాత... ముందిది చెప్పు ? నే నిచ్చిన రింగ్ నచ్చిందా లేదా?" ఆమె బుగ్గ గిల్లాడు గిరీష్.

### వాడు - నేడు

వాటి కవితా వస్తువు
ప్రియురాలి ఓరచూపులు
నేటి కవితా వస్తువు
జవరాలి ఆకలి చూపులు
నాటి వర్ణన
అతివల అవయవాల
ఎత్తు పల్లాల మీద
నేటి వర్ణన
అబలల ఆర్తనాదాలపైన
వాడు జీవన మధనం
నేడు జీవిత సమరం!!

— శివరామ రెడ్డి

గోముగా కళ్ళు తిప్పింది హరిత.

"ఊఁ...నీ రింగ్‌కంటె నాకు నువ్వే .." చప్పున అతడ్ని కౌగిలించేసింది.

ఆ తరువాత సన్నగా విట్టూర్పులు!

"వ్చ్...వ్చ్..." మెత్తగా శబ్దాలు!

రాజారావ్‌కి తల గిర్రున తిరిగినంత పని అయ్యింది.

కాళ్ల కింద భూమి కదులుతున్నట్లు ఒణికిపొయ్యాడు. ముందుకి పడబోతున్న అడుగుని అతి ప్రయత్నంతో వెనక్కి తీసుకుని వడివడిగా మేడ మెట్లు దిగి రోడ్డుమీదికి వచ్చాడు

"పిచ్చోడు! తనని ప్రేమిస్తున్నానను కొంటున్నాడు! ఐ హావ్ నో ఇంట్రస్ట్ ఎబౌట్ హిమ్..."

హరిత మాటలు రాజారావ్ గుండెల్లో గునపాల్లా గుచ్చుకుని బాధ పెడుతున్నాయి.

"బాంక్ ఎంప్లాయి కదా? డబ్బుందేమో కానుకలు ఇస్తున్నాడు!"

రాజారావ్‌కి ఒళ్లంతా కంపరం పుట్టింది. అంత ట్రాఫిక్‌లో స్కూటర్ ఎలా నడిపాడో— ఇంటికి ఎలా వచ్చాడో తెలియదు.

ఇంటికి వస్తూనే బ్రీఫ్‌కేస్ టేబిల్‌పైకి విసిరి అసహనంగా మంచంలో వాలాడు.

వటాక్కారుతో నొక్కు తున్నట్లు మనసంతా నొప్పిగా వుంది.

ఇంట్లో పిల్లలు పిస్తోళ్లతో ఢాం .ఢాం అని పేలుస్తూ సందడి చేస్తున్నారు

వంట గదిలోంచి పిండి వంటల తాలూకు కమ్మని సువాసన వేస్తోంది

రాజారావ్ మనసంతా నిశ్శబ్దంగా మూగ బోయింది.

...తనుఏవేళ ఇంటికివచ్చినా ఆప్యాయంగా అడుగులకు మడుగులుఒత్తే, అమాయ కంగా తనని ప్రేమించి తన క్షేమం కోసం నోములు, వ్రతాలు నోచే భార్య, తనకి కాస్త తలనొప్పి వస్తే తెగ బాధపడి హడావుడి చేసే భార్య శాంత మనసులో మెదిలింది.

హుఁ... ఇంత చదువు సంస్కారంవుండి తనేం చేశాడు? తనకోసం తపించే భార్యని నిర్లక్ష్యం చేసి తనని గడ్డిపరకలా తుంచి పారేసే ఒక పరాయి ఆడదానికోసం వెంప ర్లాడాడు డబ్బుని, ప్రేమని వృధా చేశాడు.

మొన్న పండక్కి శాంత చీర అడిగితే తనే మన్నాడు?

"నీ అందానికి వున్నవి చాలవా?" అని విసురుకున్నాడు

అడక్కపోయినా "హరిత" కోసం చీర కొన్నాడు.

కాని...

తనకి జరిగిన సన్మానం ?

పూర్తిగా తప్పు తనదే ఆమె మెప్పు కోసం కట్టుకున్న భార్యని లోకువ చేశాడు. రాయికి — రత్నానికి తేడా తెల్సుకోలేక పోయ్యాడు. సంసారాన్ని నిర్లక్ష్యం చేశాడు. కాని ... అందుకు హరిత తనకి ఇచ్చిన బిరుదు ? పిచ్చివాడు... పూర్ ఫెలో ...

అవును.

తను నిజంగా పిచ్చివాడు పూర్ ఫెలో !

లేకపోతే ... అవసరాల కోసం, కానుకల కోసం ప్రేమ నటించే ఒక విచ్చలవిడి స్త్రీ కోసం కట్టుకున్న భార్యని నిరసించాడు. అవసరం అయితే భార్యని ఒదులు కుందుకు కూడా సిద్ధపడ్డాడు. అవును నిజంగా తను పిచ్చివాడే !

రాజారావ్ నెమ్మదిగా కళ్లు తెరిచాడు.

అతని మనసులో ఆవరించిన చీకట్లు తొలగిపొయ్యాయి. సన్నగా ప్రేమజ్యోతి వెలిగింది.

"నాన్నగార్కి కోపం వచ్చిందిట! అమ్మ అల్లరి చెయ్యద్దు అంటోంది. మనం వీధిలో టపాసులు పేల్చుకుందాం ?"

తలుపు వారగా పిల్లల గుసగుసలు వినిపించాయ్.

సన్నగా నవ్వుకుంటూ లేచి బ్రీఫ్ కేస్ తెరిచాడు.

## ఐ లవ్ యూ

"లల్లీ...నానీ..." పిల్లల్ని పిలిచాడు.

తండ్రి పిలుపు కోసం ఎదురుచూస్తున్న పిల్లలిద్దరూ ఛెంగున లోపలికి వచ్చేశారు.

"ఇదిగో! ఈ మిఠాయిలు తీసుకోండి?" పిల్లలిద్దర్ని దగ్గరకి తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు.

చీర ప్యాకెట్ పట్టుకుని వంట గదిలోకి వచ్చాడు —

శాంత బాగా పని హడావుడిలో వుంది.

రోటి ముందు కూర్చుని రుబ్బుతోంది ! చిరునవ్వుతో సౌమ్యంగా అన్నాడు.

"శాంతా ! ఏంటే... ఎప్పుడూ పనేనా ? నీకు కొత్తచీర తెచ్చాను చూడు..."

భార్య పక్కన పీట వాల్చుకుని కూర్చుంటూ ప్యాకెట్ ఓపెన్ చేసి చీర బయటికి తీశాడు.

మెత్తగా, నాజూగ్గా పాము కుసంలా వుంది చీర !

శాంత కళ్లు తళతళా మెరిశాయ్.

అయినా బెట్టుగా అంది—

"ఇప్పుడు నాకు చీర ఎందుకూ ?"

కొంటెగా నవ్వాడు రాజారావ్.

"ఎందుకేమిటి ? కట్టుకోటానికి ? అయినా పండగ వచ్చిందంటే ఇంత పని ఎందుకు పెట్టుకుంటావ్ శాంత ?" జాలి పడ్డాడు.

"ఊఁ... ! ?" మూతి తిప్పింది శాంత.

"... ..."

"భార్య మీద చాలా ప్రేమ పొంగి పోతోంది గాని...పండగలకి కాక పిండివంటలు మరి ఎప్పుడుట చేసుకునేది ? మీకు ఇష్టం అని పులిహోర, బొబ్బట్లు చేస్తున్నాను. జీడిపప్పు పాయసం కాచాను పిల్లలు తినేవి నిన్ననే చేసి డబ్బాలో పోశాను."

రాజారావ్ శాంత బుగ్గమీద సుతారంగా చిటిక వేశాడు.

"మరి నీ యిష్టం ?"

"మీ ఇష్టమే నా ఇష్టం" సన్నగా నవ్వింది శాంత.

రాజారావ్ మనసు మెత్తగా అయ్యింది.

పరిశీలనగా భార్య కేసి చూశాడు.

హరితలా తెల్లగా నాజూకయిన చేతులూ, కత్తిరించిన గోళ్లకి ఎర్రటి నెయిల్ పెయింట్, ట్వీజర్ తో చక్కగా తీర్చిదిద్దిన కనుబొమ్మలు, కళ్లచుట్టూ చుర్మారేఖలు, బుగ్గలకి గులాబి రంగూ, పెదాలకి లిప్ స్టిక్ మేకప్ - ఇవేమీలేవు శాంతకి.

కాని—

నల్లటి కళగల మొఖంలో, కొద్దిగా చెమటకి తడిసి ఎర్రగా మెరిసే కుంకుమ, ముక్కున తళుక్కున మెరిసే తెల్లరాయి బేసరి చెక్కిళ్లకి దూమెరుగ్గా పచ్చిపసుపు ఛాయలు, కాస్త వన్నె తరిగి కమిలి నట్లున్న పెదాలు... కళ్లనిండా కరుణతో ఒక విధమైన పవిత్రత తొణికిసలే అలౌకిక సౌందర్యం శాంతది.

—"మీ కిష్టం అని పులిహోర, బొబ్బట్లు చేశాను !"—

పండగపూట పిల్లల కోసం, భర్త కోసం పడే తాపత్రయంలో ఆనందం...

"భార్య కడుపు నిండా భోజనం అయితే, గరల్ ఫ్రెండ్ కాలక్షేపం బఠానీగింజ ... " కొలీగ్ కృష్ణశర్మ తరచూ చేసే వ్యాఖ్యానం జ్ఞాపకం వచ్చింది రాజారావ్ కి.

అతడి పెదవుల మీద సన్నటి చిరునవ్వు తొణికింది.

భార్య కళ్లల్లోకి ఆప్యాయంగా చూస్తూ తనలోతాను చెప్పకున్నట్లు అప్రయత్నంగా అన్నాడు రాజారావ్ ...

"శాంతా ! ఐ లవ్ యూ..."

శాంత రుబ్బటం ఆపి చివ్వున తల ఎత్తింది.

"అంటే !?" అన్నట్లు అయోమయంగా భర్త మొఖంలోకి చూసింది.

సన్నగా, సమ్మోహనంగా న వ్వా డు రాజారావ్.



# కాన్వెంట్ చదువులు

"మా బాబు కాన్వెంట్‌లో చదువుతున్నాడు" అంది నా స్నేహితురాలొకావిడ గర్వంగా. "ఆంటీకి ఎబిసిడీలు అప్పగించు బాబూ!" అంది. నాలుగేళ్ల బాబు నర్సరీ రైమ్స్ కూడా వినిపించాడు సిగ్గుపడుతూనే. "గుడ్!" అని మెచ్చుకున్నానేగాని, నాలుగేళ్ల పసివాణ్ణి ఇప్పటి నుండీ చదువో అంటూ అవస్థ పెట్టడం అవసరమా? అనిపించింది మదిలో.

## ఆకాశాన్నంటే ఫీజులు :

"నెలకు యాభై రూపాయలు ఫీజు" అందావిడ. ఉలిక్కిపడ్డాను నేను. నర్సరీకే అంతయితే, ఇక పై తరగతుల మాటేమిటి!? నా స్నేహితురాలు ఫీజు చెప్పడంలో ఫీజు అధికం అన్న బాధ కంటె, అంత పెద్ద ఫీజుతో కొడుకుని కాన్వెంట్ చదువు చదివిస్తున్నామన్న అతిశయమే తొంగి చూసింది.

## వేలం వెర్రి :

అసలు ఈ కాన్వెంట్ చదువుల అవసరం ఎవరికి, ఎంతవరకు? అన్నది ఆలోచిస్తే ఈ విషయంలో ప్రజల వెర్రి ఎంతవరకు దారి తీస్తుందో అర్థమవుతుంది.

పిల్లల్ని అయిదవ ఏట- మాతృ భాషలో చదువు చెప్పే ప్రభుత్వ పాఠశాలకు పంపించడం మాని, మూడేళ్ళయినా నిండని పసివాణ్ణి ఇంగ్లీషు చదువులంటూ కాన్వెంట్‌కి తోలేసి, ఇప్పటి నుంచీ పిల్లాణ్ణి ఆ పరాయి భాషతో అవస్థ పెడుతూ, గొప్పగా 'మా బాబు కాన్వెంట్‌లో ఇంగ్లీషు మీడియంలో చదువుకుంటున్నాడు' అని చెప్పుకోవడం నేడు ఓ ఫ్యాషన్ అయిపోయింది. మాతృ భాషలో చదువుకున్నవారు సమర్థులు కాలేరా? తెలివితేటలు, చురుకుదనము కాన్వెంట్ చదువులకే పరిమితమా? అలాగంటే మనందరమూ వీధి బడులలో చదువుకున్న వాళ్ళం కామా? ఆ చదువులతో అభివృద్ధిలోకి రాలేదా? ప్రభుత్వం ఇస్తున్న ఉచిత విద్యను మాని, గొప్పలకు పోయి, తాహతకు మించిన ఖర్చుతో ఇంగ్లీషు మీడియం కోసం ప్రాకులాడడం అవివేకమే అవుతుంది.

ప్రవాసాంధ్రులకు కాన్వెంట్ చదువుల ఖర్మ ఎలాగూ తప్పదు. మాతృభాష లభ్యం కాని పరాయి రాష్ట్రాలలో ఇష్టమున్నా లేకున్నా, అధిక ఫీజులను, ఖర్చులను భరించే శక్తి ఉన్నా లేకున్నా, పిల్లల్ని ఇంగ్లీషు మీడియం చదువులకు విధిగా పంపక తప్పదు. ఈ విషయంలో కేంద్ర ప్రభుత్వోద్యోగుల నిమిత్తం సెంట్రల్ స్కూల్స్ ఆరంభించి ప్రభుత్వం కొంతవరకు మేలు చేసిందనే చెప్పాలి అయితే వీటిలో సీట్లు దొరకడం అందరికీ సాధ్యం కాదు కనుక, చాలామంది కాన్వెంట్లమీద పడటం జరుగుతోంది.

## స్టేటస్ సింబల్ :

పిల్లల్ని కాన్వెంట్లలో చదివించడం ఈనాడు ఒక స్టేటస్ సింబల్‌గా పరిణమించిందని చెప్పవచ్చును ప్రక్కింటి వాళ్ళ బ్బాయి కాన్వెంటులో చదువుతున్నాడు కనుక మా వాడూ కాన్వెంటులో చదవాలన్న పోటీ కనిపిస్తూంటుంది... మాతృభాష, మన జాతీయతను చాటేందుకో పుమ్మడిభాషతప్ప, ఆంగ్లం మనకొద్దు అంటూ ప్లాట్‌ఫాం ఎక్కి అర్థరహితమైన ఉపన్యాసాలు దంచే ప్రబుద్ధులే తమపిల్లల్ని కాన్వెంట్ చదువులకు పంపించడంలో ప్రథములుకావడం శోచనీయం!

రకరకాల యూనిఫామ్స్‌లో పిల్లలు చూడ ముచ్చటగా వున్నా, వయసుకు మించిన చదువులతో, గాడిద బరువులా పుస్తకాలను మోసుకువెళ్లే పసివాళ్లను చూస్తే జాలి వేస్తుంది. మన కాలంలో అన్ని పుస్తకాలు లేవు అయినా స్టాండర్డ్సు ఇప్పటి కంటే అప్పుడు ఎన్నో రెట్లు మెరుగ్గా ఉండేది. నేడు కాన్వెంట్లలో చదివినా, ఎన్ని పుస్తకాలు చదివినా నానాటికీ దిగజారే విద్యాస్థాయి అందరూ ఎరిగినదే!

## విద్యతో వ్యాపారం :

కేవలం వ్యాపార దృష్టితో కొందరు కాన్వెంట్లను స్థాపించడంతో ఇవి ఎక్కడికక్కడే పుట్టగొడుగుల్లా పుట్టుకొస్తున్నాయి. విపరీతమయిన ఫీజులను తీసుకోవడమే తప్ప, అందుకు తగిన విధంగా సమర్థులైన టీచర్లను నియమించి విద్యా బోధనలో కనీసపు స్థాయిని పాటించడం ఎక్కడోగాని కనిపించదు. విద్య వ్యాపారంగా మారిననాడు ఫలితాలు ఎలా వుంటాయో వూహించడం కష్టంకాదు... తల్లిదండ్రులలో కాన్వెంట్ చదువులపైన మోజు, పోటీ తగ్గిననాడు గాని, వాటి స్థాయి మెరుగుపడదని చెప్పవచ్చును.



## పిల ల అభివృద్ధి నిరోధకం ? !

ఆ మధ్య విదేశీ సైంటిస్టులు కొందరు పరిశోధనలు జరిపి ఓ విషయం వెల్లడి చేసారు. అదేమంటే— అయిదారేళ్ల లోపు పిల్లల్ని కాన్వెంటు వంటి (పబ్లిక్ స్కూళ్లం టారు విదేశాలలో) స్కూళ్లకు పంపడంవలన అనర్థాలు కలుగుతున్నాయన్నది (వోవర్ లోడెడ్ సిలబస్ కారణాలు).అందువల్ల పిల్లల మానసికాభివృద్ధికి ఎలా నిరోధకమవుతుందో వివరించారు... కనుక ఈ విషయాలు దృష్టిలో పెట్టుకునయినా తల్లిదండ్రులు ఇంగ్లీషు మీడియంమీద మోజుతో అయిదే ళ్లయినా రాకుండానే పసివాళ్లను అవస్థ పెట్టకుండా వుంటే బావుంటుందేమో!?

— విశ్వమోహిని ●



# వంటలు

## చోలే

కావలసిన వస్తువులు : తెల్ల శెనగలు — 1 కప్పు, ఉల్లిపాయలు — 10, పచ్చిమిరపకాయలు — నాలుగు, అల్లం—ఉసిరికాయంత, టమాటోలు- 4. నూనె—అరకప్పు టీపొడి— 1 టేబుల్ స్పూన్, వంట సోడా — అర టేబుల్ స్పూన్, ఉప్పు — తగినంత, కారం — 4 స్పూన్లు.

తయారుచేయు విధము : శనగలు రాళ్ళు అవీ లేకుండా శుభ్రం చేయాలి రేపు కూర చేస్తామనగా ఈ వేళ రాత్రే శనగలు నాన పెట్టాలి. తెల్లవారేసరికి బాగా నాని ఉంటాయి. వాటిని నీళ్ళుపోసి బాగా ఉడికే వరకూ స్టౌమీద ఉంచాలి అలా ఉడుకుతుండగానే టీ పొడిని శుభ్రమైన తెల్లని గుడ్డతో మూటకట్టి శనగలలో వేయాలి అలాగే వంటసోడా కూడా వేసేయాలి. శనగలు పూర్తిగా ఉడికేసరికి టీకూడా బాగా నీళ్ళలో కలుస్తుంది ఇంకా ఒక గ్లాసునీళ్ళ శనగలలో ఉన్నాయనగా శనగల గిన్నెను స్టౌమీద నుంచి దించి టీ వున్న గుడ్డ మూట తీసేయాలి. ఉల్లిపాయలు, అల్లం, పచ్చిమిరపకాయలు, సన్నగా తరగాలి. స్టౌమీద బాణలిపెటి నూనె పోయాలి. తరిగి వుంచుకున్న వుల్లిపాయలు, అల్లం, పచ్చిమిరపకాయలు వేసి ఎర్రగా వేయించాలి. టమాటోలు మెత్తగా పిసికి ఆ రసం కూడా బాణలిలో వేసి కొద్దిసేపు వేయించాలి. ఇప్పుడు టీ నీళ్లతో సహా ఉడికించిన శనగలు బాణలిలో వేయాలి. తగినంత కారం 4 స్పూన్లు వేసి కొద్దిసేపు ఉడకనిచ్చి కొత్తిమీర వేసి దించేయాలి.

-టి. స్వప్న*

చిన్నప్పుడు చేశానా పనిని. ఇంకా గుర్తుంది నాకు ఆ సంఘటన గుర్తొచ్చినప్పుడల్లా సిగ్గుగా, అవమానకరంగా అనిపిస్తుంది. తప్పు అంటూ చెయ్యక పోవాలి కానీ చేస్తే, ఎవరిపట్ల చేసేనో, వారికి ఆ సంగతి తెలియ జేయకపోతే మనసులో ముల్లులా గుచ్చి బాధ పెడుతూంటుంది.

మాష్టారు క్లాసులో అందరి ముందూ కోప్పడ్డారు కోపం వచ్చి. ఇంటికి వెళ్తున్న మాష్టార్ని చీకట్లో రాయి విసిరి కొట్టాను. నేనే ఆ పని చేసింది అని తెలీదు ఎవరికీ, కానీ ఆయన తల కట్టుతో కనబడితే,ఆయన్ని సూటిగా కలవలేకపోయేను ఈ బాధ భరించ లేక ఓ నాడు ఆయనకీ విషయం చెప్పి, క్షమించమని కోరేసాను ఆ తరువాత బాధ తప్పి తీరిన వాడిలా హాయిగా నిట్టూర్చేను.

తప్పు చేస్తున్నానన్న భావం రాగానే నా మనసులో ఎప్పుడూ ఆ సంఘటనే మెదుల్తూంది.

* * *

సినిమాని ఉత్కంఠగా చూస్తున్నారంతా. తెర మీద హీరో ఎవర్ని కాపాడదామా అని గుంటనక్కలా కాచుక్కూర్చున్నాడు.

సరస్వతి ప్రక్కసీట్లో ఇబ్బందిగా కదుల్తోంది. సరస్వతి వైపు చూశాను.

"ఏవయింది ?" గుసగుసగా అడిగేను.

"ఏంలేద"న్నట్లు బుర్ర తిప్పింది సినిమాకేసి చూస్తూ.

వెనకసీట్లో చూసేను. ఎవరో కుర్రాళ్లు ముసి ముసిగా నవ్వుకుంటున్నారు. ఏవేవో చెప్పుకుంటున్నారు.

మళ్లీ తెరకేసి చూడసాగేను. సరస్వతి యిబ్బందికి కారణం నా మగబుద్ధి పసికట్టేసింది.

దే ఆర్ టీజింగ్ సరస్వతి !

నా భార్యని వాళ్లు రెచ్చగొడుతున్నారు. వెనకసీట్లోంచి ముందు సీట్‌లోకి కాళ్లు తగిలిస్తూ, ముందుకు వంగి సిగరెట్ పొగ వదుల్తూ...

సీట్ మారదామని అటూ యిటూ చూసేను. థియేటర్ అంతా నిండిపోయింది.

మనసు భగభగా మండిపోసాగింది. ఏం చేయాలో తెలీని స్థితి. ఏదో చేసేయాలనే రోషం.

ఎవరైనా గుర్తుపట్టగలనేమో అని వెనక్కి తిరిగి చూసేను.






"ఎలా చూస్తున్నాడో చూడ్రా ! సినిమా చూడు గురూ !" అన్నాడొకడు.

అందరూ ఘొల్లున నవ్వేరు.

చుట్టూ ఉన్న అందరూ వాళ్ల వైపు విసుగ్గా చూసేరు. ఎవరికీ వాళ్లని మందలించే ధైర్యం లేదు. కోరి తగవును కొని తెచ్చుకొనే అవివేకం ఎవరికీ ఉండదు కనుక.

ఆ కుర్రాళ్లన్న వయసు అలాటిది. దేన్నీ లెక్క చేయని వయసది. ఎవరూ వాళ్లని జయించలేరనే ధీమా వాళ్లది. ఎదుటివాడ్ని తన కన్న లోకువ చేస్తే గొప్పగా ఫీలయే వయసది. ఆ వయసు వాళ్లతో పెద్దవాళ్ళు తగవు పడరు.

నా అసమర్థత వాళ్లని మరింత రెచ్చగొట్టింది. యింకా యిబ్బంది పెట్టసాగేరు సరస్వతిని. చివాలున లేచి బయటికి వచ్చేసాం.

# మన్నించని మనసు

రిక్షాలో కూచొని మెల్లగా ఏడవసాగింది, సరస్వతి.

"ఎందుకే !?" అన్నాను విసుగ్గా.

కళ్ళనిండా నీళ్ళతో నా వైపు చూసింది. జాలి వేసింది. సరస్వతి మీద భుజాల చుట్టూ చేతులు వేసి దగ్గరకి లాక్కున్నాను.

"ఆహా ! ఏం సీనురా ?" వెనకనుంచి వినబడ్డాయి ఆ మాటలు, నవ్వులూ.

అప్రయత్నంగా దూరంగా జరిగేం. వాళ్ళే! వాళ్ళు నలుగురూ - రిక్షా ఆపబోయేను. సరస్వతి వెనక్కి లాగింది వద్దన్నట్టు.

"ఏం ?!" అన్నాను పళ్ళ బిగువన.

"మరింత రెచ్చిపోతారు." అంది.

నాకు వళ్ళు మండిపోసాగింది కసి, ఆవేశం, రోషం, అసమర్ధత అన్నీ విచిత్రంగా చుట్టు ముట్టేసి బాధ పెట్టేస్తున్నాయి.

ఈ పరిస్థితి కొత్త కాదు. సరస్వతికి నాకూ పెళ్ళయిన దగ్గర్నుండి మొదలయేయి. ఆర్నెల్లయి ఇదే వరస. సరస్వతి చాలా అందమైనది. ఆ అందం చూసే నేను పెళ్లి చేసుకున్నాను. ఆ అందమే మేం యిపుడు బైటకి వెళ్లి ఫ్రీగా తిరగడానికి యిబ్బంది పెడుతోంది.

జువనైల్స్ !!

సరస్వతి అందాన్ని కళ్ళతోనే కొరుక్కు తినేయాలనే చూపులు. వీడెవడ్రా అనే నిరసనతో కూడిన చూపులు. ఈలలు, అసభ్య కరమైన కామెంట్స్.

అందంగా ఉన్న ఆడది కార్లో దిగితే ఈ వ్యక్తులెవరూ ఆమె వైపు చూడరు. ఆమె భర్తతో, తండ్రికో ఉన్న మనీ పవర్‌కి భయపడతారు. అందమైన ఆడది షోకేస్‌లో ఉండాలి. కానీ మధ్య తరగతికి చెందినదై ఉండకూడదు. అది ఓ రూలు. ఈ యిరుకు సమాజం విధిస్తున్న రూలు.

యింటికి చేరుకున్నాక హాయిగా ఫీలయేం. ఆ నాలుగ్గోడల మధ్య మాకు దొరికే ప్రశాంతం చాలా గొప్పది. అవర్ హెవెన్ ఇన్ ది వరల్డ్.

## 2

ఆఫీసులో పని చేసుకుంటుంటే ప్యూన్ వచ్చి చెప్పేడు. "ఫోన్ వచ్చింది సార్! బి. వో. గారు రమ్మన్నారు."

బి. వో. రూమునుండి ఫోను చెయ్యాలన్నా

రిసీవ్ చేసుకోవాలన్నా చికాగ్గా ఉంటుంది.

"ఎవరా?' అని ఆశ్చర్యపోతూ వెళ్లేను.

"ఏమండీ!?" అంది సరస్వతి గొంతు.

"ఏమిటి సరస్వతీ?" అడిగేను కొంచెం విసుగ్గా.

"వాళ్లండీ! వాళ్ళు."

"ఎవరూ...?" ముందు అర్థం కాలేదు. తరువాత వెంటనే తట్టింది.

"వాళ్లేనండి, మొన్న..." అర్థోక్తిగా ఆపేసింది.

"ఏం? ఏం అయింది?" ఆత్రుతగా అడిగాను.

"ఇంటిముందు నిలబడి అల్లరి చేస్తున్నారండీ ఒకడేమో వచ్చి తలుపుకొడుతున్నాడు పక్కింటి పిన్నిగారింటి నుంచి ఫోన్ చేస్తున్నాను." ఏడుపు నొక్కిపెడుతోందని తెలుస్తోంది.

"ఏడవక. నేను వస్తున్నాను. పిన్నిగారింట్లోనే ఉండు" అని ఫోన్ పెట్టేసాను.

కామెంట్స్ వరకూ పరిమితం కాదు ఇది యింకా ముదిరేటట్లుంది:

వెంటనే సెలవుపెట్టి పోలీస్ స్టేషన్‌కి వెళ్లాను. ఎస్సైని కలిసి నా బాధ చెప్పాను.

"కూర్చోండి" అన్నాడు ఎస్సయి.

కుర్చీలో కూలబడ్డాను

ఎలా చెప్పాలో ఆలోచిస్తున్నట్లు పెన్సిల్‌ని వేళ్లతో అటూ యిటూ దొర్లించేడు

"మీరు చెప్పిన వెధవలు మాకు తెలుసు. మా నోటీస్‌లోకి వచ్చేరు యింతకు మునుపే. మీరు చెప్పినట్టు ఏక్షన్ తీసుకుంటాం వాళ మీద సరే! కానీ వాళ్లని ఎక్కువ కాలం జెయిల్లో ఉంచలేం. వాళ్లు విడుదల కాగానే ఎవరు వాళ్లమీద రిపోర్ట్ చేసేరో వాళ్లకి తెలుస్తుంది. మీ...మిమ్మల్ని మరింత హింసిస్తారు అనుక్షణం చట్టానికి దొరకని రూపంలో హెరాన్ చేస్తారు మీ లైఫ్ మీద ఎస్సాల్ట్ తల పెట్టినా తల పెట్టవచ్చు నేరం అంటూ జరిగిపోయాక, జరగవలసిన అన్యాయం జరిగిపోయేక మేం ఏక్షన్ తీసుకుంటే మీకు జరిగే లాభం ఏమిటి?! నేను యిదంతా ఓ పోలీస్ ఆఫీషియల్‌గా చెప్పడం లేదు. నాకు తెలుసు ఇటువంటి కేసుల్లో ఏం జరుగుతుందో. వాళ్లని ఇప్పటికి ఏ పదిసార్లో రెమాండ్‌లోకి తోసేం. కాళ్లూ చేతులు విరిగేటట్టు కొట్టేం. మళ్లీ మామూలే. రెండవసారి మీరు మళ్లీ మామీద రిపోర్ట్ చేయడానికి ధైర్యం చేయని విధంగా అల్లరి చేస్తారు వాళ్ళు. ఆలోచించండి. రెండు రోజులాగి ఏక్షన్ తీసుకుంటాను, మీమీద అనుమానం వాళ్లకు రాకుండా" అన్నాడు.

ఎస్సై చెప్పిన మాటల్లో నిజం అర్థం అయింది నాకు. ఎన్నిసార్లు పోలీస్ రక్షణ కోసం పరిగెత్తగలను? ఆఫీస్‌లో ఉన్నపుడో, కేంప్ వెళ్లినపుడో, సరస్వతిమీద కసితో ఏమైనా వాళ్లు చేస్తే...

ఆలోచిస్తూ "థాంక్స్" చెప్పి బయట పడ్డాను

ఈచిక్కులుకి కారణం ఏమిటి? సరస్వతి అందమా? సరస్వతి అందంగా లేకపోతే మన శ్శాంతి దొరికేదా? చెడు ఆలోచనల పడతు న్నందుకు నన్ను నేను హింసించుకున్నాను. సరస్వతి చాలామార్లు తను అందంగా లేకపోతేనే బాగుండునని వ్యక్తపరచింది. అందంగా పుట్టడం ఓ వరం అది శాపంగా మారుస్తోంది జువనైల్ డెలికంసీ సరస్వతి తప్పేంవుంది.

వాళ్లలో మార్పుకోసం, సమాజంలో మార్పుకోసం మొరాలిటీకోసం నిరీక్షించాలి.





## మన్నించని మనసు

ఈ ఊరినుంచి ట్రాన్స్‌ఫర్ చేసుకున్నా ప్రయోజనంలేదు. యిదే ప్రపంచం.

వారం రోజులు బాధపడ్డాం. అందులో ఒకడు మరీ అల్లరి పెట్టసాగేడు. వాడిపేరు రామారావ్ అని తెలిసింది. వాడు, ఆ రామారావ్ అన్న మాటలు నన్ను మానసికంగా మరీ బలహీనుడ్ని చేసేవి.

ఓ రోజు హఠాత్తుగా ఆ ఎస్సై మా యింటికి వచ్చేడు, వాళ్ళ నలుగురూ ఇంటి ఎదురుగా ఉన్నా వాళ్లని చూడకుండా. నేను ఆశ్చర్యపోతూ ఆహ్వానించేను. నా రిపోర్టు ప్రసక్తి ఎత్తకుండా ఏవేవో స్నేహపూర్వకంగా మాట్లాడి వెళ్లిపోయేడు. జీప్ ఎక్కబోయే ముందు అన్నాడు, "మీకూ నాకూ స్నేహం ఉందని తెలిస్తే మరి వాళ్ళ ధైర్యం చెయ్యరు. చూస్తూండండి."

మరో రెండు రోజులు వరసగా అతను వచ్చేడు. టీ తాగి, కాసేపు కూర్చొని వెళ్లిపోయేడు.

హఠాత్తుగా ఆ అల్లరి తగ్గిపోయింది! కొంచెం బంధువులకి దగ్గిరగా యిల్లు మార్చేసేం. ఆ ఇన్స్‌పెక్టర్‌కి "థాంక్స్" చెప్పుకున్నాను.

రెండున్నర నెలలు గడిచేయి. నేనూ, సరస్వతీ సినిమాకి వెళ్లినపుడు మాకు ఆ సంఘటన, ఆ రోజులు గుర్తొస్తున్నాయి. యిపుడు అంతగా బాధించడంలేదు ఎవరి చూపులూ మమ్మల్ని.

సరస్వతిని పుట్టింట్లో దింపివస్తున్నాను. సామర్లకోటలో రైలు దిగేసరికి తెల్లవారు ఝాము అయింది. కాకినాడ వెళ్లేందుకు చాలాసేపు వెయిట్ చేసేక ఓ టాక్సీ దొరికింది. నేనొక్కడ్నే బయలు దేరేను ఆ టాక్సీలో.

కాకినాడ పొలిమేరల్లో సడన్‌గా కారాపేడు డ్రైవర్.

వెనకసీట్లో కునికిపాట్లు పడుతున్న నేను బద్ధకంగా అడిగేను. "ఏమైంది డ్రైవర్!?"

"ఎవరో పడున్నారు సార్!" అన్నాడు దిగుతూ.

ముందుకు హెడ్ లైట్ల వెలుగులో చూసేను. ఎవడో పడి ఉన్నాడు రక్తపు మడుగులో.

కారు దిగేను.

### చంద్రుడు

చీకటి శిక్ష పక్షంపాటు.
మార్పుతో తక్షణం బైటకొచ్చి
దిన దిన ప్రవర్ధుడై
పండువెన్నెల్ని చిందిస్తూ
పక్షం గడిచేసరికి మళ్లా
దూరమవుతున్నాడు.
నిలకడ లేని జీవితాల్లో
వెలుగు నిలబడదు.

– మాధవరపు కృష్ణ

దగ్గరగా ఆ వ్యక్తిని చూసి తుళ్ళిపడ్డాను. వాడు, ఆ నలుగుర్లో ఒకడు. రామారావ్!

రామారావ్ ఆ రక్తపు మడుగులో స్పృహ లేకుండా పడి ఉన్నాడు. నాలో ఆ క్షణంలో కొద్దికాలం క్రితం వాడ్ని ఎలా తన్నాలను కున్నానో, వాడ్ని ఏ పరిస్థితిలో చూడాలను కున్నానో అదే పరిస్థితిలో ఉన్నాడిప్పుడు. ఆ రోజులూ, ఆ మానసిక క్షోభ అంతా గుర్తుకు వచ్చేయి.

"డ్రైవర్! పద" అన్నాను.

"అదేంటి సార్! పాపం యీయన యిలా పడుంటే, సాయం పట్టండి సార్ తీసుకు వెళ్దాం" అన్నాడు.

"నాకు టైమవుతోంది. ఈ గొడవలన్నీ పడే వోపిక లేదు. పద" అన్నాను సీరియస్‌గా.

"కానీ సార్!" ఏదో అనబోయేడు డ్రైవర్.

"కారుని ఎంగేజ్ చేసింది నేను, నా యిష్టం లేకుండా నువ్వు ఎవర్నీ కార్లో ఎక్కించ కూడదు. పద" అన్నాను కారెక్కి డోర్ వేస్తూ.

నన్ను తిట్టుకుంటూ కారు స్టార్ట్ చేసేడు.

కారు కొద్దిదూరం వెళ్లింది.

నాలో మళ్లీ నా చిన్ననాటి సంఘటన గుర్తొచ్చింది. నిస్సహాయంగా పడిఉన్న వాడ్ని వదిలేసి తప్పు చేస్తున్నాననే భావన కలిగింది. నా మనసు అప్పుడే నన్ను వేధించడం మొదలు పెట్టింది.

"డ్రైవర్! కారాపు, వెనక్కి త్రిప్పి ఆ మనిషి దగ్గిరకి పోనీ."

కారు రివ్వున 'యు'టర్న్ కొట్టింది.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

**రంగారెడ్డి చిత్ర మాంత్రికులు :**

ఆరు నెలల సావాసంతో వారు వీరవుతారని సామెత. దీనినే భ్రమరకీట న్యాయం అన్నారు విద్వాంసులు. కీటం భ్రమర మవుతుందో కాదో నాకు తెలీదు గాని, శ్రీ జిల్లల రంగారెడ్డి మాత్రం కళాకారుల సావాసంతో పూర్తిగా కళాకారుడయి పోయాడు. రంగారెడ్డి నల్లగొండ జిల్లా దొనకంటి అనే కుగ్రామంలో పుట్టాడు. హైస్కూలు చదువు పూర్తయిన తర్వాత రాష్ట్ర లలితకళా అకాడమీలో అటెండరుగా చేరాడు. కళాకారుల నిరంతర సహవాసంతో అతనిలోని నిగూఢంగా వున్న కళాకారునికి జాగృతి కలిగింది. తీరిక వేళల్లో ఏవో బొమ్మలు గీయడం ప్రారంభించాడు. అప్పైన జనపదం నుంచి వచ్చినవాడు గదా! జానపద గాథలలోని విచిత్ర రూపాలు, మాంత్రికులూ మెదిలే మనసూ, సంస్కారమూనూ. కనుక మాంత్రికుల వైపే కుంచె కదిలింది. అతని ప్రవృత్తిని పరికించి అతనిని, అతని తోటి అటెండర్ శ్రీ కరీంను అకాడమీ పెద్దలు ఆదరించి వారిలోని కళను ప్రోత్సహించారు. రంగారెడ్డి సుప్రసిద్ధ కళాచార్యుడు శ్రీ వి. మధుసూదనరావు వద్ద రాష్ట్ర లలితకళా అకాడెమీ విద్యార్థి వేతనంతో వర్ణచిత్ర రచనలో శిక్షణ పొందాడు. ఈ శిక్షణతో రంగారెడ్డిలో అణగిమణగి వున్న చిత్రకారుడు ఆత్మవిశ్వాసంతో తలయెత్తాడు. జానపద దృష్టితో, ఆ దృష్టితో కలిగిన భావుకతా దృష్టితో మాంత్రికులను చిత్రించడం ప్రారంభించాడు. స్వయంగా పైకి వచ్చిన వారికి, తమ ప్రాజ్ఞ్యం గురించి ఇతరులు ఏమనుకుంటారో తెలుసుకొనే కుతూహలంవుండడం సహజం. కనుక రంగారెడ్డి వరుసగా 1968, 69, 71, 72, 76 లలో వ్యష్టి చిత్రప్రదర్శనలను హైదరాబాదులో ఏర్పాటు చేశాడు. ప్రేక్షకులు ఏదో మాంత్రికుల లోకంలో విహరించినట్లు అనుభూతి పొందారు. ప్రేక్షకుల ఆదరణతో పాటే రాష్ట్ర లలిత కళా అకాడెమీ మూడుసార్లు, హైదరాబాద్ ఆర్ట్ సొసైటీ ఒకమారు, ఏ. పి. కౌన్సిల్ ఆవ్ ఆర్టిస్ట్స్ రెండుమార్లు, చిత్రకళాపరిషత్ రెండు మార్లు, లలితకళా సమితి ఒక తడవ, ఆంధ్ర అకాడెమీ ఆవ్ ఆర్ట్స్ ఒకమారు రంగారెడ్డికి అవార్డులు ఇచ్చాయి. పలువురు కళాప్రియుల భవనాలను, పలుసంస్థలను రంగారెడ్డి మాంత్రికుడు అలంకరించాడు. రంగారెడ్డి గడచిన జూన్ మొదటి వారంలో కళాభవన్ లలితకళా అకాడెమీ గాలరీలో తన 28 చిత్రాలుప్రదర్శించాడు. రాష్ట్ర ఆస్థాన చిత్రకారుడూ, రాష్ట్ర లలితకళా అకాడెమీ కార్యదర్శి శ్రీ పాకాల తిరుమల రెడ్డి ఈ ప్రదర్శనం ప్రారంభించారు. సుప్రసిద్ధ కళాచార్యులు శ్రీ వి. మధుసూదనరావు అన్నట్లు, రంగారెడ్డి మాంత్రిక సంఘం వారి విచిత్ర ప్రపంచం సమ్మోహకంగా ఉన్నాయి. ఈ ఇరవై ఎనిమిది చిత్రాలలోను తైలవర్ణాలు, ఆలేఖ్యాలు ఉన్నాయి. తన బాహ్యాభ్యంతర ప్రపంచ దర్శనంతో కలిగిన అనుభూత నిసర్గ సుందర ప్రతిరూపాలా ఈ చిత్రాలు! అని అనిపించింది నాకు. సూక్ష్మరేఖల ఆలేఖ్యాలలోను, వర్ణవైవిధ్యం గల చిత్రాలలోను రంగారెడ్డి సరళత, దృక్కోణ చిత్తశుద్ధి కనిపిస్తాయి. నిజానికి రంగారెడ్డి చిత్రప్రపంచంలోని మాంత్రికులు బాహ్యప్రపంచపు మాంత్రికులు కారు. రంగారెడ్డి మాంత్రికుల వికార స్వరూపాలు, తల, తోకలేని ఆకారాలు చూస్తుంటే, అతని మాంత్రిక ప్రపంచమంతా నేటి సమాజాన్ని దుయ్యబట్టే వ్యంగ్య ప్రపంచమనిపిస్తుంది. నేడు జీవితంలో పైమెట్లు అందుకుంటున్న వారి ప్రతారణ చాతురిని, తలలు, పార్టీలు మార్చే పద్ధతిని, తల(మెదడు) లేనివారు కూడ మేధావులు అందుకోలేని అత్యున్నత పదవులను అందుకోడం చూస్తున్న రంగారెడ్డి ఈ వ్యంగ్య పద్ధతిని అనుసరించాడని నా నమ్మకం. ఏమైనా, రంగారెడ్డి తన మాంత్రిక లోకం నుంచి మానవ లోకానికి దిగి వ్యంగ్యాన్ని మరింత పదునుగా ప్రదర్శించడం బాగని నా సలహా. అప్పుడు అతని చిత్రాలలో జానపదచ్ఛాయ వైదొలగి, నూతన శైలి ఏర్పడుతుంది. రంగారెడ్డి గొప్ప భవిష్యత్తు గల చిత్రకారుడు.



చిత్ర కారుడు : జిల్లల రంగారెడ్డి



చిత్రం : "మాంత్రికులు"

# హైదరాబాద్ నోట్ బుక్

**యువకులకు శ్రీ అల్లాడి హితవు :**

రాష్ట్ర మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ అల్లాడి కుప్పుస్వామి జూన్ 30వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయం 61వ స్నాతకోత్సవంలో స్నాతకోపన్యాసం చేస్తూ సంఘం ప్రధానమైన వరకట్నపు కీడును తొలగించాలని యువకులను ఉద్బోధించారు. స్వాతంత్ర్యానంతరము ప్రజల త్యాగభావాన్ని విస్మరించడం వల్ల నైతిక మూల్యాలు పడిపోయాయని, అందువల్ల అవినీతి, లంచగొండితనం, అక్రమ నిల్వలు, దుష్ప్రచారం వంటి సాంఘిక దోషాలు పుట్టగొడుగుల్లా తలయెత్తాయి అని, శాంతిభద్రతల ఎడల గౌరవం కరువయిందని, ఆయన విచారం ప్రకటించారు. ఈ కారు చీకటిలో పాత తరంవారు ఏమీ చేయలేక అదర్శప్రాయులుగా ఉండలేకపోతున్నారు. ఈబురదనుంచి దేశం ఉద్ధరింపబడాలంటే యువకులే ఆశాకిరణం. సాంఘిక దోషాలను తొలగించడానికి కావలసింది చిత్తశుద్ధి. చట్టంకాదు. వరకట్న నిరోధక చట్టం ప్రభుత్వ కాగితాంపై ఉంది. కాని ఉన్నత స్థితిలో ఉన్న యువకులు కూడా పెద్ద పెద్ద మొత్తాలు కట్నాలు లాగుతున్నారు. కట్నాలు గురించి తలిదండ్రులు పట్టుబడితే యువకులు, యువతులు పెళ్లిని నిరాకరించాలి. యువకులు ఈ దురాచారానికి ఎదురు తిరగకపోతే ఇది సంఘం కూకటి వేళ్లను తినివేసే పుట్టకురుపులా అవుతుంది అని శ్రీ అల్లాడి విషాదం ప్రకటించారు. ఈ ఉత్సవంలో దేశంలోని వివిధ రంగాలలో ప్రముఖులైన శ్రీయుతులు జి. పార్థసారధి, డాక్టర్ జహీర్ అహమద్, ప్రొఫెసర్ రావ్‌జోషిలకు గౌరవ డాక్టరేట్ ఆఫ్ లిటరేచర్‌పట్టాను, డాక్టర్ వై. నాయుడమ్మకు గౌరవ డాక్టర్ ఆఫ్ సైన్సెస్ పట్టాను, వైస్ చాన్సలర్ శ్రీ జి. రామరెడ్డి ఇచ్చారు. వీరిలో డాక్టర్ జహీర్ అహమద్, శ్రీ జి. పార్థసారధి ఉత్సవానికి హాజరుకాలేదు. ఈ సారి మహిళలే ఎక్కువ బంగారు పతకాలు సంపాదించారు. కుమారి కె. వరాలు (ఎం.ఎస్.సి. గణితం) మూడుబంగారు పతకాలు, కుమారి వంజపే శుభద్రా శ్రీపాద్ (ఎం. ఏ. హిందీ) ఐదు బంగారు పతకాలు సంపాదించారు. అంధ విద్యార్థి శ్రీ వి. సదానంద్ (ఎం. ఎ. చరిత్ర) బంగారు పతకం సంపాదించారు.

**స్పీకరు మందలింపు :**

బళ్ల పాఠ్యపుస్తకాల సంగతి విధాన సభకు కూడ ఎక్కింది. జులై 13న విధానసభలో ప్రతిపక్ష సభ్యులు ఈ విషయాన్ని చర్చకు తెచ్చినపుడు తాత్కాలిక సభాపతి శ్రీ ఎ. ఈశ్వరరెడ్డి పాఠ్యపుస్తకాల సరఫరాను 'యుద్ధ స్థాయిలో' జరుపాలని విద్యాశాఖా సహాయమంత్రి శ్రీ ఎస్. ఆళ్వారుదాసుకు సలహా ఇచ్చారు. ప్రస్తుతం కావలసింది చర్చ గాని, ప్రకటనలు కావని ఆయన మందలించారు. ఈ చర్చలలో పలువురు ప్రతిపక్ష సభ్యులు పాల్గొన్నారు.

**పాఠ్యపుస్తకాలకోసం ప్రదర్శనం :**

నగరంలోని హైస్కూలు విద్యార్థులు జులై 13వ తేదీన పాఠ్య పుస్తకాల కోసం ప్రదర్శనం జరిపారు. డొనేషన్లు రద్దు చేయాలని, విద్యాలయాలలో సీట్ల కొరతను తీర్చాలని కూడా ప్రదర్శకులు నినాదాలు చేశారు. ఈ ఊరేగింపు నగరంలోని వివిధ ప్రాంతాల నుంచి సచివాలయం వద్దకు చేరింది. అక్కడ పోలీసులు వారిని అడ్డగించారు. అందువల్ల విద్యార్థి ప్రతినిధులు తమ కోర్కెల విజ్ఞప్తి పత్రాన్ని విద్యామంత్రులకు అందజేయడానికి సచివాలయంలో ప్రవేశించారు. కాని, మంత్రులు లేనందున నిరసనగా తమ విజ్ఞప్తి పత్రాన్ని సచివాలయం ముందు కాల్చివేసి, ప్రసంగాలు జరిపారు.

**తెలుగుదేశంలో శ్రీ రత్నసభాపతి :**

ప్రముఖ రాజకీయ నాయకుడు శ్రీ ఎం. రత్నసభాపతి తెలుగుదేశం పార్టీలో చేరారు. ఈయన మాజీ శాసనసభ్యుడు, రాష్ట్ర కేంద్ర వ్యవసాయాభివృద్ధి బ్యాంకి మాజీ అధ్యక్షుడు. రాష్ట్రప్రభుత్వం సన్నకారు, మధ్యతరగతి రైతుల ఎడల శ్రద్ధ చూపడం లేదని విమర్శిస్తూ ఆయన ముఖ్యమంత్రికొక లేఖ వ్రాశారు.

**మహంకాళి జాతర :**

సికిందరాబాద్‌లోని ఉజ్జయినీ మహాకాళి దేవాలయం వద్ద జులై 11, 12వ తేదీలలో మహంకాళి జాతర అతివైభవంగా జరిగింది. ఏటా ఆషాడ మాసం మూడవ ఆదివారం ప్రారంభమై రెండు రోజుల పాటు ఈ జాతర జరుగుతుంది. మొదటి రోజులు ముత్తైదువులు శుచిగా బోనాలు తెచ్చి దేవికి సమర్పిస్తారు. ఈ బోనాల మెరవణి (ఊరేగింపు) సికిందరాబాద్‌లోని వివిధ వీధుల గుండా బయలుదేరి నగరానికే వింత శోభ చేకూర్చింది. పురుషుల నాట్యాలు, ఆర్భాటాలు వినోదం కలిగించాయి. వేలాది ప్రజలు దేవి దర్శనం కోసం తెల్లవారు జాము నుంచి బారులు తీరి నిలబడ్డారు. అమ్మవారి పటాన్ని 12వ తేదీన బోయిగూడాలో నిమజ్జనం చేశారు. ఈ దేవాలయం ప్రతిష్ట జరిగి దాదాపు 200 సంవత్సరాలు కావచ్చింది. ఈ ఉత్సవం చూసినప్పుడల్లా నాకు ఈ శతాబ్దం నాలుగవ దశకంలో మహంకాళి దేవాలయం ముందు ప్రవహించే బలిపశువుల రక్తపుటేర్లు వాటిని ఆపండని కోరుతున్న శ్రీ దత్తాత్రేయశర్మ ప్రసంగాలు జ్ఞాపకం వస్తాయి. ఆ రక్తప్రవాహాలు చూచి భయమేసేది. దత్తాత్రేయ ఒక హైస్కూలులో తెలుగు పండితుడు. నిఖార్సైన సంఘసేవకుడు. తెల్లటి ఖద్దరు దుస్తులతో సభలు, సమావేశాలు ఏర్పాటు చేసేవాడు. అప్పట్లో హిందువులకు శ్మశానం కరవయ్యేది. ప్రభుత్వం వారు శ్మశానానికి స్థలాలు కేటాయించాలని శ్రీ శర్మ ఆందోళన చేయడం వల్ల ఆయనను "శ్మశాన శర్మ" అనేవారు. ఆయన ప్రతి సభను "దేశమును ప్రేమించుమన్నా" అనే గురుజాడ గీతంతో ప్రారంభించే వాడు. ఆయన దశాబ్దాల పాటు చేసిన అహింసా ప్రచారంతోనే మహంకాళి దేవాలయం ముందు దున్నపోతుల, గొర్రెల, మేకల బలులు, వాటి బీభత్స దృశ్యాలు ఆగిపోయాయి. వాటితో పాటే ఆయనను స్మరించడం కూడ ఆగిపోయింది.

**ఉపశ్రుతి :**

తమిళనాడులో దాదాపు 70 లక్షల మంది విద్యార్థులకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేశారు గదా! మన రాష్ట్రంలోను అలాటిది జరుగుతుందా? అనడిగారు నన్నొక అమాయకుడు. పాఠ్యపుస్తకాలకే దిక్కులేదు. పగటిపూట భోజనం కూడానా? సంబడమే — అన్నారు మా మాటలు వింటున్న ఒకరు.

## ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

### హృదయాకర్షకం

"దక్షిణ" కథ మాకెంతో నచ్చినది. ఈ కథ మా హృదయాలను కదిలించివదనుటలో అతిశ యోక్తిలేదు. రెక్కలు వచ్చిన తమ సంతానం వృద్ధాప్యంలో తమను విడిచి పెట్టిపోగానే ఆ తల్లి దండ్రులు పడే ఆవేదన రచయిత కళ్లకు కట్టినట్టు వర్ణించారు. దానికై రచయిత ఉపయోగించిన భాష, శైలీ హృదయాకర్షకంగా ఉన్నది.

ఎస్. రూపవతి (పాట్లి)

### ఎప్పుడు ?

మా అభిమాన నటుడు కమలహాసన్ ముఖ చిత్రాన్ని ఎప్పుడు ప్రచురిస్తారు ?

ఎ. పద్మావతి (నెల్లూరు)

### నచ్చాయి

2.7.82 సంచిక కథలలో "ఆవూ—పులికథ" "లోటు" కథలు వైరైటీగా ఉండి మా కెంతో నచ్చాయి.

"ప్రేమ దేవత" సీరియల్ ప్రారంభంలోనే మమ్మాకట్టుకొంది. "మనసుకథ", కాలం కరిచాక సీరియల్స్ రెండూ కూడా మంచి సస్పెన్స్‌తో చాలా ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

గోగిసెట్టి శివశంకర్‌రావ్ (గొల్లప్రోలు)

### గిలిగింతలు

"కామా" కథలో సీతాపతి— సుజాత ప్రణయ లీలలు గిలిగింతలు పెట్టాయి.

చామర్తి శ్రీను (చింతలూరు)

### సీరియల్

'ప్రేమ దేవత' సీరియల్ ఆదిలోనే ఆకట్టు కుంది.

ఏలేటి గంగాధర్ (ముప్పాల్)

### భగవానుడంటే ?

"ధర్మపథం" శీర్షికద్వారా చాలా చక్కని విష యాలు కూలంకషంగా తెలియ జేస్తున్నారు. ఈ వారం "భగవానుడంటే" బాగుంది.

సి. అరుణకుమారి, మురళి,నాగేశ్వరరావు (కాశీబుగ్గ)

### బాగాలేదు

ఆంధ్రసచిత్రవారపత్రిక హిందినటి "తరాన" ముఖచిత్రం ఏమంత బాగాలేదు.

షేక్ మహమూద్‌బాషా (రైల్వేకోడూరు) ●

**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.**



# మీ రిఫ్రిజిరేటర్ సదా మీతోటి సుఖజీవనం సాగించగలదే నంటారా?

రిఫ్రిజిరేటర్ అంటే మీ కుటుంబ సభ్యుల్లో ఒకరన్న మాటే. రవంత శ్రద్ధ చూపారంటే అది మీకిచ్చే సేవ మరెంతో.

మీ రిఫ్రిజిరేటర్‌లో గట్టిఉక్కుతో చేసిన లోపలి గోడలు వున్నాయేమో చూసుకోండి.

మీ రిఫ్రిజిరేటర్ లోపలి భాగం ప్లాస్టిక్‌దైతే జాగ్రత్త. గోద్రెజ్ అయితే మాత్రం దిగులేలేదు. ఒక్క గోద్రెజ్ రిఫ్రిజిరేటర్లోనే ఎనామెల్ స్టీలు లోపలిగోడలు వున్నాయి. ఇవి త్రుప్పు పట్టడం, పెచ్చులూడడం, పగుళ్లు బారడం జరగదు. ఎక్కువ కాలం మన్నుతాయి.

మీయింట్లో దీపాలకాంతి తగ్గినప్పుడూ, సంగీతం స్వరం తప్పినప్పుడూ మీ రిఫ్రిజిరేటర్ గుండెకూడా దడదడలాడుతుంది.



మీ రిఫ్రిజిరేటర్ ఎంత మాత్రం వోల్టేజి రెపరెపలను తట్టుకోగలదో చూడండి. చాల రిఫ్రిజిరేటర్లకు ఈ వోల్టేజి రెపరెపలను 210 నుండి 230 వోల్టుల వరకు మాత్రమే తట్టుకుంటే గోద్రెజ్ 190 నుండి 250 వోల్టుల వరకు తట్టుకోగలదు.

మీ రిఫ్రిజిరేటర్ మీకు సొమ్ము ఆదా చేసి పెట్టగలదు.

మీ రిఫ్రిజిరేటర్‌లో నిలవకు చోటు ఎక్కువ వుంటే, టోకుగా కొనడం, రానూపోనూ ఖర్చులూ, రవాణాలలో ఎక్కువ ఆదా చేసుకోగలరు.

గోద్రెజ్ మీకు ఎక్కువ చోటు ఇస్తుంది. ఇందులో కూరల ట్రే వెనకదాకా వుంటుంది. ఫ్రీజర్ కూడా పెద్దదే. ఛిల్లర్ కూడా బాగా పెద్దగా వుంటుంది. చక్కగా డిజైను చేయబడిన తలుపు ప్యానెల్ ఎక్కువ సీసాలు పట్టేలా షెల్ఫులు కల్గివుంది. అందుకే ఇంకా ఇంకా ఎన్నో ఎన్నో ఇళ్లలో గోద్రెజ్ అడుగు పెడుతున్నదంటే ఆశ్చర్యమేముంది. దేశంలో అత్యధికంగా అమ్ముడయే ఈ రిఫ్రిజిరేటర్ ఒకసారి ఇంట్లో అడుగు పెట్టిందంటే ఆ ఇంట్లో ఇక సదా సుఖ సంతోషాలే.

మీరు మీ రిఫ్రిజిరేటరును మరియు స్వయంగా మిమ్ములను చక్కగా సంతోషంగా ఉంచుకోవాలనుకుంటే ఈ కూపన్ పూర్తిచేసి పంపండి. 'గోద్రెజ్ రిఫ్రిజిరేటర్ కేర్ బుక్‌లెట్' ఉచిత కాపీ పొందండి.

'గోద్రెజ్ రిఫ్రిజిరేటర్ కేర్ బుక్‌లెట్' కాంప్లిమెంటరీ కాపీ పొందండి!

అమూల్యమైన సమాచారంతో నిండిన బుక్‌లెట్ మీకు పోస్ట్‌లో పంపుతాము. నేడే ఈ కూపన్ క్రింది చిరునామాకు పంపండి: గోద్రెజ్ అండ్ బాయ్స్ మ్యాన్యుఫాక్చరింగ్ కం. ప్రై. లి. మార్కెటింగ్ డిపార్ట్‌మెంట్, ఫిరోజ్‌షానగర్, బొంబాయి 400 079

పేరు ____________________

చిరునామా ____________________

____________ పిన్‌కోడ్ నం. ________

మీ రిఫ్రిజిరేటర్ బ్రాండ్ పేరు: ____________

APH

Godrej® మేలైన శాస్త్రపద్ధతిలో ఉత్పత్తులు... కలకాలం నిలిచే విలువలు.

HTB-GBM-8425